ఉచితం

తళతళ మెరిసే స్టెయిన్‌లెస్
స్టీల్ గిన్నె

క్రొత్త

# పాలతో కూడిన
# ఫారెక్స్
# ఘన ఆహారం

రెండు టిన్నులు కొన్నప్పుడు

క్రొత్త ఫారెక్స్ అధిక రుచికరం
క్రొత్త ఫారెక్స్ అధిక సంపూర్ణం

ప్రేమతో మీరు పెట్టే ప్రతి చెంచాడు
మీ పాపాయి పెరుగుదలకు మంచిది.




ఈ కానుక ఎంపిక చేయబడిన వట్టణాలలో ప్రత్యేక కానుక టిన్నులపై సరుకు వున్నంత వరకు లభ్యం.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం–గ్లాక్సో

CLARION/B/GX/5/173 TEL

చతుర

సంపుటి : 7 డిసెంబర్ 1984 సంచిక : 11

# ఈ నెల సమగ్ర నవల

నూతన సంవత్సరారంభ శుభదినాన పాత సంగతులు మరచిపోయి హాయిగా, ఆనందంగా కొత్త జీవితానికి నాంది పలుకుదామనుకుని ఒక్కచోట చేరారు వారిద్దరూ. ఉరకలు వేస్తున్న వయసుకు వివాహ బంధంతో జవాబు చెబుదామని ఏనాడో నిర్ణయించుకున్నవారే వారిద్దరూ.

అలాంటి ఆ సుదినాన అతను అమాంతం, పిచ్చెక్కినవాడిలా "ఏం....నువ్వేం స్వర్గాన్నుంచి ఊడిపడ్డావా? మళ్లీ అంటాను, యూ డర్టీ క్రీచర్... బిచ్..." అంటూ దులపరించుకున్నాడామెను... అంత ఆకస్మికంగా అతనలా ఎందుకు మారిపోయాడు...? అతన్నలా మార్చేసిన పరిస్థితులేమిటి?? అతని ప్రవర్తన దేనికి...




అనుకోని పరిణామాలు అనూహ్యంగా ఎదురైన పరిస్థితుల్లో మనుషులెలా ప్రవర్తిస్తారు? ఆ ప్రవర్తనల ఫలితాలు వారి పరిసరాల మీదా, తోటివారి మీదా ఎలా ప్రసరిస్తాయి?? ఎలాంటి పరిణామాలకు దారి తీస్తాయి?

ఒక యువ ప్రేమికుల జంటతో ప్రారంభమై, క్షణక్షణానికి మారే సంఘటనలు, విపరీత పరిణామాలతో ఆద్యంతం ఉత్కంఠతో కొనసాగేలా

## కె.కె.మీనన్

రచించిన కొత్త తరహా నవల 'ప్రతిధ్వని' ఈ నెల చతుర సమగ్ర నవల. నందనోద్యానంలో ప్రారంభమై రాజకీయాల కీకారణ్యంలో అంతమయే ఈ 'ప్రతిధ్వని' నవలా రచనలో ఒక సరికొత్త ప్రయోగం.

ముఖచిత్రం: దిలీప్ బెనర్జీ

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించ వలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

## నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యింక దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అంటే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారి, కోల్గేట్ యొక్క
నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు
తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే
సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ
లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన
కలిగించే ఆహారపు తునకల్నీ, దంతక్షయాన్ని
కలిగించే సూక్ష్మజీవుల్నీ తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు
తోముకుంటే, దాంతో యిక మీకు
శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోటే
దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారి మీ కుటుంబంలో
వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని
ధృవపరుచుకోండి. నోటి దుర్వాసన
పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.
వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




GK&E.B84.55 Tel

### *దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

# చతుర ప్రపంచం

## ప్రేమికులకు ప్రత్యేకం

ఏకాంతాన్ని కోరుకునే ప్రేమికులకోసం జపాన్‌లో చాలా హోటళ్లు వున్నాయి. అలాంటి హోటళ్లని అక్కడ 'అబెక్కు' అంటారు. ఈ పదం 'అవెక్' అనే ఫ్రెంచి పదం నుంచి ఏర్పడింది. ఫ్రెంచి భాషలో 'అవెక్' అంటే 'ఒక్కసారి' అని అర్థం. ప్రేమికులకు ప్రత్యేకించబడిన ఆ హోటళ్లలో అన్ని సదుపాయాలతో అలంకరించబడివున్న గదిని కొన్ని గంటలకి గాని, ఒక రాత్రికి గాని అద్దెకు తీసుకోవచ్చు. అయితే ఆ హోటళ్లలో ఒక్క గదిని కూడా వ్యాపారవేత్తలవంటి వారికి ఇవ్వరు. ఆ హోటళ్లలో కాఫీ షాపుల్లాంటివి కూడా వుండవు. ఇదంతా ప్రేమికులకి పూర్తి ఏకాంతం కల్పించేందుకు చేసిన ఏర్పాటు! ఆ హోటళ్ల ముందు గంటకి అద్దె ఇంతని రాయబడిన బోర్డులు వుంటాయి.

జపాన్‌లో 'టోక్యో మెగూరో' అనే ప్రాంతంలో 'ఎంపరర్' అనే హోటలు



వుంది. రాజభవనంలా వుండే ఆ 'ప్రేమికుల హోటల్' అలాంటి హోటళ్లలోకెల్లా ఖరీదైనది. టోక్యో నగరానికి నరోయా పట్టణానికి మధ్యగల రోడ్డుకి ఇరువైపులా 'ప్రేమికుల హోటళ్లు' ఎక్కువగా వున్నాయి. ఆ హోటళ్లు విభిన్న ఆకారాలలో వుంటాయి. వాటిలో విలాస నౌక 'క్వీన్ ఎలిజబెత్', 'వెర్సయిల్లెస్' రాజభవనం వంటి వాటిలా కన్పించే హోటళ్లు కూడా వున్నాయి. హోటల్ గదుల లోపలి అలంకరణ, ప్రేమికులు తమ ఏకాంతంలోని థ్రిల్‌ను అనుభవించేందుకు అనువుగా వుంటుంది. ఆ గదుల్లో 'బాత్' టబ్‌లు, అద్దంలా కన్పించే సీలింగూ వుంటాయి.

ప్రస్తుతం ఒసాకాలోని మున్సిపల్ కార్పొరేషన్ ప్రేమికుల హోటళ్ల నిర్మాణానికి అనుమతి ఇచ్చేందుకు వ్యతిరిక్తత తెలుపుతోంది. ఈ హోటళ్లు స్కూళ్లకి, సంక్షేమ కేంద్రాలకి కనీసం 110 మీటర్ల దూరంలో వుండాలని క్రితం సంవత్సరం సెప్టెంబరు నెలలో వాళ్లొక చట్టం చేశారు.

## విడియో మాస్టర్

ఇటీవలికాలంలో పిల్లల్ని విపరీతంగా ఆకర్షించినవాటిలో 'విడియో గేమ్స్'దే ప్రముఖ స్థానం. అమెరికాలో 'రసన్ స్టోవల్' అనే 11 ఏళ్ల బాలుడు ఈ గేమ్స్ ఆడటంలో అత్యంత నైపుణ్యాన్ని ప్రదర్శించి 'విడియో మాస్టర్' అని పేరు తెచ్చుకున్నాడు. విడియో గేమ్స్‌కి సంబంధించిన సమాచారంతో వెలువడే ఓ ప్రముఖ అమెరికన్ పత్రికలో రసన్ 'విడ్ కిడ్' అని ఓ శీర్షికను నిర్వహిస్తున్నాడు కూడా!

విడియో గేమ్స్ ఉత్పత్తిదార్లు ఏదైనా కొత్త విడియో గేమ్‌ని మార్కెట్‌లో విడుదలచేసేముందు రసన్ ఆమోద ముద్ర కోసం పంపుతారు. అతను ఆమోదించాకనే ఆ గేమ్ మార్కెట్‌లో ప్రవేశిస్తుంది. ఆవిధంగా రసన్ 200 గేమ్స్‌ని పరిశీలించి ఆమోదించాడు.



రసన్ 5 ఏళ్ళ వయసులో వున్నప్పుడోసారి ఓ సన్నిహిత మిత్రుడు విడియోగేమ్స్ ఆడుకోవడం చూశాడు. అతనికి సొంతానికి ఓ విడియోగేమ్ వుండాలని అన్పించింది కానీ, తండ్రి విడియో గేమ్ కొనిపెట్టేందుకు ఒప్పుకోలేదు.

రసన్ పట్టు వదలకుండా కొన్నాళ్ళకి స్వయంగా సంపాదించి, కూడబెట్టుకున్న డబ్బుతో విడియో గేమ్ కొనుక్కున్నాడు.

ఇప్పుడతనికి 8 విడియోగేమ్‌లు, మరో కంప్యూటరూ వున్నాయి. తనకు 21 ఏళ్లు నిండేటప్పటికి ఓ పెద్ద విడియో గేమ్స్ కంపెనీకి ప్రెసిడెంట్ కావాలన్నది రసన్ అభిలాష!

## సియర్స్ టవర్స్

చికాగోలోని 'సియర్స్ టవర్స్' అనబడే భవంతి ప్రపంచంలోనే అత్యంత ఎత్తయిన భవనం. 110 అంతస్తులతో 1353 అడుగుల ఎత్తు వుంటుందది. 'సియర్స్ రీబక్ కంపెనీ'కి చెందిన ఆ భవంతి ప్రపంచంలోని అతిపెద్ద ఆఫీసు కల్గిన భవనంకూడా! ఆ భవనంలో దిగువనున్న 50 అంతస్తులలో 7 వేల మంది సియర్స్ కంపెనీ వుద్యోగులు పనిచేస్తున్నారు.

ఆ భవనం 50,66,90వ అంతస్థుల వద్ద మాత్రం కొంచెం సన్నగా వుంటుంది. దాని నిర్మాణానికి నాలుగేళ్లు పట్టింది. అనేక పనులకు యంత్రాలనుపయోగించడం సర్వసామాన్యమైపోయిన అమెరికా లాంటి దేశంలోకూడా, ఆ భవన నిర్మాణానికై రోజుకు 16 వందల మంది శ్రామికులు పనిచేశారు.

ఆ భవనాన్ని కట్టేందుకు ఉపయోగించిన కాంక్రీట్‌తో 8 వరుసల్లో 5 మైళ్లు పొడవుగల విశాలమైన రోడ్డును వేయవచ్చు. ఆ భవనంలో అమర్చిన టెలిఫోన్ల వైర్లు ప్రపంచంచుట్టూ రెండుసార్లు చుట్టేంత పొడవుగలవి.

ఆ భవనంలో శీతాకాలంలో వెచ్చదనం, వేసవికాలంలో చల్లదనం వీలైనంత తక్కువ విద్యుచ్ఛక్తినుపయోగించి సమకూర్చడానికి అనువుగా ఏర్పాట్లున్నాయి. ప్రతి అంతస్థుదగ్గిర ఆగే లిఫ్టులతో పాటు, కిందనుంచి సరాసరి పైనున్న అంతస్తుకి అతివేగంగా తీసుకువెళ్లే లిఫ్టులు రెండున్నాయి. ఆ భవనాన్ని చూసేందుకు ఎందరో టూరిస్టులు కూడా వచ్చిపోతుంటారు. ఆ భవనంలోగల వేలాది అద్దాల కిటికీలు యంత్రాలచేత శుభ్రం చేయబడతాయి. ఆవిధంగా సంవత్సరానికి 8సార్లు శుభ్రంచేస్తారు. ఆ భవనంలో వున్న 5 హోటళ్లలో ఒక్కొక్క హోటల్లోనూ ఒకేసారి 15వందల మంది బస చేయవచ్చు.

'సియర్స్ టవర్స్' భవనం నలుపు, సిలిరంగుల సమ్మేళనంతో ఎంతో అద్భుతంగా వుంటుంది. భవనంపైన రంగు రంగుల పెద్ద గడియారం వుంటుంది. టూరిస్టులు చాలామంది దానిపై చేతులేసి ఫొటో తీయించుకునేందుకు ఉబలాటపడతారు!

## డబ్బు చేసిన రచన

తన నిజ జీవితానుభవాలను క్రోడీకరించి ఇటీవల 'నాట్ ఎ పెన్నీ మోర్, నాట్ ఎ పెన్నీలెస్' అనే నవల రాసిన జెఫ్రీ ఆర్చర్ ఆ రచన ద్వారా చాలా పాపులర్ అయ్యాడు.

బ్రిటన్‌లోని 'సోమెసెట్' అనే చోట పుట్టిన జెఫ్రీ ఆర్చర్ ఆక్స్‌ఫర్డ్ యూని





వర్శిటీలో పట్టభద్రుడయాడు. అతను మంచి క్రీడాకారుడు కూడా. 1964–66లో అంతర్జాతీయ స్థాయిలో జరిగిన పరుగు పందాలలో బ్రిటన్ తరపున పాల్గొన్నాడు. 1966లో లండన్ కౌన్సిల్‌కి సభ్యుడిగా ఎన్నికై 1969లో ఎంపీ అయ్యాడు.

1973 నుంచి జెఫ్రీ ఆర్చర్‌కి కష్టకాలం ఆరంభమైంది. కొందరి ప్రోద్బలంపై కెనడాకు చెందిన ఓ సంస్థలో మిలియన్ డాలర్ల విలువగల వాటాలను కొన్నాడు. అదొక బోగస్ కంపెనీ కావడంతో ఆ మొత్తం అంతా కోల్పోయాడు.

ఆ విధంగా ఎంపీలందరిలోకి జెఫ్రీయే బీదవాడయిపోయాడు. కనీసం మరుసటి ఎన్నికలలో పోటీ చేయడానికి కూడా అతనివద్ద డబ్బు లేకపోయింది.

జెఫ్రీ ఆర్చర్ తనకు ఏర్పడిన మిలియన్ డాలర్ల నష్టాన్ని ఓ విలువైన అనుభవంగా స్వీకరించాడు. తన అనుభవాలనన్నింటినీ 'నాట్ ఎ పెన్నీ మోర్, నాట్ ఎ పెన్నీ లెస్' అనే నవలగా మలిచాడు. అదే అతని మొదటి నవల. ఆ నవలలోని కథా సారాంశం ఇది:

"హార్వే మెట్‌కాఫ్‌ది మోసం చేయడంలో అందెవేసిన చేయి. అతను తైల నిక్షేపాలను పరిశోధించే 'ప్రాస్పెక్టా' అనే కంపెనీ స్థాపించి, తన కంపెనీ తైల నిక్షేపాలను కనుగొన్నట్టు పుకార్లు వ్యాపింపజేస్తాడు. ఆవిధంగా అతని కంపెనీలో వాటాల ధర బాగా పెరిగి, పెట్టుబడి పెట్టే అనేకమందిని ఆకర్షిస్తుంది. అందులో ఓ రాజ వంశీకుడు, డాక్టరు, లెక్కల ప్రొఫెసరు, కళా వస్తువుల వర్తకుడు వుంటారు. తర్వాత కొంతకాలానికి ఆ కంపెనీలో వాటాలు ఏమాత్రం విలువలేనివిగా తేలిపోతుంది. ఆ విధంగా హార్వే వాటాదారుల్ని తెలివిగా ఆకర్షించి డబ్బు మూటగట్టుకుని మోసం చేస్తాడు.

అయితే లెక్కల ప్రొఫెసర్ అది చూస్తూ వూరుకోలేదు. తనతో పాటు మోసపోయిన ముగ్గురినీ సమావేశపరచి,



"మనల్ని మోసంచేసిన హార్వేని అంత తేలికగా వదలగూడదు. మనకి షేర్ మార్కెట్ గురించి తెలియని మాట నిజమే. కాని, మనం మన రంగాలలో నిష్ణాతులమే కదా! ఆ రకంగా మనం మన తెలివితేటలనుపయోగించి ఆ వంచకుడి నుంచి మిలియన్ డాలర్లు గుంజుకుందాం.ఒక పెన్నీ ఎక్కువకాదు, ఒక పెన్నీ తక్కువ కాదు. మనకు కావల్సింది ఒక మిలియన్ డాలర్లు. అంతే! మనం తగిన పథకం రూపొందించి, మనం కోల్పోయిన సంపదను తిరిగి సంపాదించుకుందాం'' అంటాడు.

అనుకున్న ప్రకారం వాళ్లు హార్వే నుంచి తమ ధనం రాబట్టుకుంటారు. అయితే చివరికి వారికో షాక్ ఎదురవుతుంది. 'ప్రాస్పెక్టా' కంపెనీ ఓచోట నిజంగానే తైల నిక్షేపాల్ని కనుగొనడంతో దాని వాటాల విలువ అత్యధికంగా పెరుగుతుంది. దాంతో ఆ నలుగురు, మిలియన్ డాలర్లని తిరిగి హార్వే కంపెనీలో పెట్టుబడి పెట్టాలనుకుంటారు.

జెఫ్రీ ఆర్చర్ ఈ నవలద్వారా చాలా ధనమార్జించాడు. ఇప్పుడతను ఫుల్‌టైమ్ రచయితగా రచన సాగిస్తూ, ధనం సంపాదిస్తున్నాడు.

## మొదటి సమ్మె

మనదేశంలో మొట్టమొదటి సమ్మె 157 ఏళ్ళ క్రితం 1827 మేలో జరిగింది. ఆ సమ్మె చేసింది కలకత్తాలోని పల్లకీ మోసేవాళ్లు. ఆరోజుల్లో పల్లకీ ఒక్కటే ప్రయాణసాధనం. అప్పట్లో మనదేశాన్ని పరిపాలిస్తున్న బ్రిటిషవాళ్లు ఈ పల్లకీ బోయీల శ్రమను బాగా దోచుకుంటూ



చాలా స్వల్ప మొత్తాలు ఇచ్చేవారు. బోయీలు గనుక ఇంకా ఇమ్మని అడిగితే తన్నులు తినవల్సివచ్చేది. ఉన్నతాధికారులకు ఫిర్యాదుచేస్తే వారినుంచి కూడా అవమానమే ఎదురయేది. పైగా అలా ధైర్యంచేసి అడిగినందుకు ఒక్కొక్కప్పుడు పల్లకీ మోసేవాళ్ళను తప్పుడు కేసుల్లో ఇరికించడం కూడా జరిగేది. బ్రిటిష్‌వాళ్ల ఈ రకం ప్రవర్తన రోజు రోజుకీ మితిమీరసాగింది.

దాంతో పల్లకీ మోసేవాళ్ళు ఒక సంఘంగా ఏర్పడి న్యాయం పొందడం కోసం సమ్మె చేసేందుకు నిర్ణయించుకున్నారు. అయితే బ్రిటిష్ ప్రభుత్వం ఆ సంఘంలోని సభ్యులను ప్రభుత్వానికి నిర్ణీత రుసుమును చెల్లించి పల్లకీ మోసేందుకు లైసెన్స్ సంపాదించి, ఆ లైసెన్స్ బాడ్జిని ఛాతీ దగ్గిర తగిలించుకోవాలని ఆదేశించింది.

దానితో పల్లకీ మోసేవాళ్ళకు ఆగ్రహం కలిగింది. వాళ్లు ఛాతీపై బాడ్జిని తగిలించుకోవడం అవమానకరమైన విషయంగా భావించారు. లైసెన్సుకోసం కష్టార్జితం ఖర్చుచేయడానికి ఏమాత్రం ఇష్టపడలేము. అందుచేత వాళ్ళు ఈ ఉత్తర్వుపై పునరాలోచించమని కోరారు. కాని, ప్రభుత్వం పట్టించుకోలేదు.

దాంతో పల్లకీ బోయీలు ఈ అన్యాయానికి వ్యతిరేకంగా, కలిసికట్టుగా పోరాడాలని నిర్ణయించుకుని 1827 మే 22న సమ్మెకు పిలుపునిచ్చారు. ఆవిధంగా ఆ పల్లకీ మోసేవాళ్ళ సంఘం భారత దేశంలో మొట్టమొదటి సమ్మెను ప్రారంభించింది.

వేసవికాలమైన మే నెలలో కలకత్తాలో ఎండలు భరించలేనంతగా వుంటాయి. అదే నెలలో పల్లకీ మోసేవారి సమ్మె ప్రారంభమైంది. పల్లకీ లేకుండా బైట ఎండలో ప్రయాణించలేని బ్రిటిష్‌వాళ్ళు ఆ సమ్మెవల్ల చాలా బాధపడ్డారు.

మొదటి 5 రోజులు సమ్మె ప్రశాంతంగా జరిగింది. అది దేశమంతటా సంచలనాన్ని సృష్టించింది. ప్రతి భారతీయ వార్తాపత్రిక పల్లకీ బోయీల సమ్మెను సమర్థించింది.

పల్లకీ తప్ప మరో ప్రయాణ సాధనం లేకపోవడంతో బ్రిటిష్‌వాళ్లు ఎక్కడికీ కదిలే వీల్లేకపోయింది. సమ్మెను అణిచివేసేందుకు వాళ్ళు పల్లకీలను మోసేందుకు బీహార్, ఉత్తర ప్రదేశ్‌లనుంచి శ్రామికులను రప్పించసాగారు. అది సమ్మె చేస్తున్నవాళ్లపై దెబ్బతీసింది. ఇక తమ జీవనాధారం కోల్పోయినట్టేనని పల్లకీ బోయీలు భావించారు.

అసలే అలా నిస్పృహలో పడుతున్న వారికి బ్రౌన్ అనే బ్రిటిష్ యువకుడి వల్ల మరో షాక్ ఎదురైంది. అతను రెండు గుర్రాలతో లాగించే నాలుగు చక్రాల బండిని డిజైన్ చేశాడు. (అదే ఇప్పటి మన గుర్రబ్బండిగా రూపొందింది) ఆ నూతన కల్పనకి ఆంగ్లేయులు చాలా సంతోషించి, కలకత్తాలో ఓ బహిరంగ సభ ఏర్పాటుచేసి అతన్ని అభినందించారు. ఆ బండి వాడుకలోకి వచ్చింది.

దీనితో సాంప్రదాయకంగా వస్తున్న తమ వృత్తిని కోల్పోతున్న పల్లకీ బోయీలు హతాశులై, మే 27న సమ్మె నుంచి విరమించుకున్నారు. ఆవిధంగా మనదేశంలో జరిగిన మొట్టమొదటి శ్రామిక సమ్మె విఫలమైంది!

*




# ప్రతిధ్వని

కె.కె. మీనన్



చెట్లు చిగిర్చేయి. పూలు పూచేయి. తుమ్మెదల జాడ కన్పించదు, కానీ అవీ వుండేవుంటాయి.

'పొన్నలు పూచెఁ బొన్నలొగి పూవక
ముందఱఁ బూచెగోగులా
పొన్నలుఁ గొండగోగులును బూవక
ముందఱ బూచె బూరువుల్'

అన్నట్లు అలా అన్ని పూలూ పోటీపడి పూచేస్తే, తుమ్మెదలు మాత్రం చొరబడకుండా వుంటాయా! అందులోనూ అది మన్మధుడు సృష్టించిన అకాల వసంతం ఆయె!!

అకాల వసంతమే అలావుంటే, ఇక సకాల వసంతం మాటేవిటి? అందులోనూ అది అందమైన ఉదయం.

అవును... అది అందమైన ఉదయమే!

ఆ వుదయం- జనవరి మొదటి తేదీ ఉదయం...ఏడు గంటల సమయంలో...

పబ్లిక్ గార్డెన్ కలవారి పెళ్లి కూతుర్లా కళకళలాడుతోంది. చైనా గార్డెన్‌లోని గులాబీ మొక్కలు మంచుకు తడిసి మరింత పచ్చగా నిగ్గుదేలి సిగ్గుపడుతున్నాయి.

సూర్యోదయమైంది.

పసుపు పచ్చని లేత కిరణాలు విరిసి వున్న గులాబీ రేకుల మీద పొంచివున్న మంచు బిందువుల్ని స్పృశించటానికి ప్రయత్నించి, చలికి చురుక్కున కాలి కాబోలు వెనక్కి మరలిపోతోంటే...

అదో వింతగా, వేయి రంగుల ఇంద్ర ధనుస్సుగా కన్పడుతోంది.

మరి అందమైన ఉదయం కాదా ఇది?

అలాంటి ఉదయాన్న, అలాంటి ప్రదేశంలో ఓ అందమైన అమ్మాయి ఎవరి కోసమో ఎదురుచూస్తోంది.




వర్ణించటానికి వాతావరణం అందంగానేవుంది. కాని అనుభవానికి ఆనందకరంగా మాత్రం లేదు.

అందుకే-

"ఇంత చలిలో ఎందుకు రమ్మనాలి? రమ్మని ఇంత అలస్యం ఎందుకు చేయాలి??" అని విసుక్కుంది ఆ అందాల చిన్నది.

నిన్ననే-

అంటే, డిసెంబరు ముప్ఫయ్యొకటో తేదీన ఫోన్ చేసి చెప్పేడు భాస్కర్... ఇక్కడ ఈ సమయానికి వుండమని.

"రేపు కొత్త సంవత్సరం సుమా! పాత కోపాలు ఇంకా అట్టే పెట్టుకుని ఎగ్గొట్టెయ్యొద్దు" అని కూడా చెప్పేడు.

తనకూ ఆ విషయం తెలుసు. కొత్త సంవత్సరంలో ఆ పాత సంగతులన్నీ నెమరువేసుకోవటం తనకూ ఇష్టంకాదు. పాత సంవత్సరంతోపాటే వాటిని పాతి పెట్టేసింది. అసలు ఆ ఆలోచనే మనసులోకి రాకుండా జాగ్రత్తపడుతోంది.

"ఎంత ప్రేమించినా ఈ మగాళ్లకి.."

అదుగో, మళ్లీ ఆ పాత ఆలోచన్ల పాతరే తవ్వుతోంది.

ఛీ.... తనను తనే తిట్టుకుంది.

రాత్రి పన్నెండు గంటలకే తన సహోద్యోగి, నేస్తం ఎక్స్ఛేంజీ నించి ఫోన్చేసి నిద్రలేపింది.

"హలో లల్లీ... హేప్పీ న్యూ ఇయర్" అని నూతన సంవత్సర శుభాకాంక్షలు అందజేసింది. అంతేగాదు—

"కమ్మని కలలుకంటున్నావా డియర్" అని గేలిచేసింది. ఆ తర్వాత మరి నిద్ర పట్టలేదు లలితకు. అందుకు ప్రతిగా నేస్తాలందరికీ ఫోన్చేసి శుభాకాంక్షలు తెలపాలనుకుంది. అందుకు ఫోను ఉండనే వుంది. పనిలో పని భాస్కర్‌ను కూడా

పలకరించాలనే ప్రలోభం ఆమె మనసులో ప్రవేశించకపోలేదు. కాని, అతగాడి ఇంట్లో ఫోన్లే దు. ఆ వేళప్పుడు పక్కింటివాళ్లకు ఫోన్జేసి లేపి, ఆ వుదయం పూట వాళ్ల తిట్లు, శాపనార్థాలూ తినేంత శుభదినం కాదిది. అయినా ఎలాగూ తెల్లవారగానే కల్సుకోబోతున్నారుగా!

ఇక మళ్లీ పక్క మీదకు వెళ్లే ప్రయత్నం చేయలేదు లలిత.

ఆ ఇంటి యజమాని అప్పటికే లేచి ఏదో కిచకిచలాడుతున్నాడు. పెళ్లాన్ని అభినందిస్తున్నాడో, కొత్తగా తెచ్చిపెట్టుకున్న ప్రేమని అభినయిస్తున్నాడో మరి! మాట్లాడ్డంలో కూడా మహా పొదుపు ఆ మానవుడిది. అతని ఇల్లాలు మాత్రం సైరన్. ఊరందర్నీ ఊదరగొట్టి లేపుతుంది. ముందు రోజుల్లో అయితే ఒక్క కసురు కసిరి నోర్మూయ్యించేవాడు. కాని ఇప్పుడు అపురూపం అయిపోయింది. వార్ధక్యం వచ్చి మీద పడిపోతోందని భయపడిపోతోన్న ఆమెకు, ఏదో మునిగిపోతున్నట్టు కడుపొకటి ఒచ్చి పడింది. పిల్లల్లేరనీ, మరింక వుండరనీ ఒక గట్టి నిర్ణయానికి వచ్చేసిన ఆ కాబోయే కన్న తండ్రికి అపురూపం కదూ మరి!! ఇక ఆవిడగారి కంఠానికి అడ్డూ అపూ అంటూ లేకుండా పోయింది. ఆవిడ నిద్ర లేచేక తను ఇక నిద్ర కోసం ప్రయత్నించాలని అనిపించలేదు.

స్టౌ వెలిగించి స్నానానికి నీళ్లు పెట్టుకుంది. ఏం తోచక పాత పత్రిక తిరగేసి కొత్తగా ఓ కథ చదివింది. ఇంతలో నీళ్లు కాగి, పొంగి స్టౌ మీద చ్రుయమంటే లేచి బాత్రూంకెళ్లింది. స్నానం చేసి అతనికి నచ్చిన చీర కట్టుకుని ముస్తాబయింది. ముస్తాబు ముగిసినా అద్దం ముందు అలానే కూర్చోబుద్దేసింది. అద్దం మారిందా? లేక తన అందమే ఇనుమడించిందా??

ఇంటాయన లైట్లార్పేయమని కేకేస్తాడో లేక పెళ్లాం చేత కేకేయిస్తాడోననే అనుమానం వున్నా అలానే అద్దం ముందు కూర్చుండిపోయింది. కూర్చుని తన అందం చూసుకుంటో మురిసిపోసాగింది. ముందుకు దూకుతోన్న ముంగురుల్ని సముదాయించబోతే కన్పించింది చేతికి గడియారం వున్నట్టు. వెధవ గడియారం! ఎన్నిసార్లు చూసినా నాలుగో, మహా అయితే దానిమీద మరో అరో చూపిస్తుందే తప్ప తియ్యగా తెల్లవారదు కదా!

అమ్మయ్య తెల్లవారింది...

లలిత పబ్లిక్ గార్డెన్ చేరుకునేప్పటికి ఇంకా మసక మసగ్గానే వుంది.

'మసక మసక చీకటిలో...' 'ఛీ.... అదేం పాట? ఈ కవులకి సిగ్గులేదు. సినిమా కవులకి మరీను....' అనుకుంది.

గార్డెన్లో ఎవరూ లేరు.

వాకింగుకి వచ్చిన ముసలాళ్లు మాత్రం చేతులూపుకుంటో, మంచు కురిసిన తార్రోడ్డుని గుడ్డ బూట్లతో తన్నుకుంటో, రైల్వే లైను కేసి నడిచి పోతున్నారు

ఎన్నోసారో... మళ్లీ వాచీ చూసుకుంది. ఏడే అయింది. ఏడే అంటే... అదేం తక్కువ కాలమా? ఎన్ని గంటల్నుంచి నిరీక్షిస్తోంది వుదయం కోసం?

స్వెట్టర్ స్లీవ్ పైకి ఎక్కిపోతోంటే కిందికి లాక్కుంది. వేలినున్న వుంగరం తళుక్కుమంది.

ఆమె మనసులోకి ఏదో అవ్యక్త మధురిమచేరి పులకింపు మేసంతా జారి,

వెన్నెల జాలు వార్చింది ముఖంలో. పెదవి మీద ఓ నవ్వు దివ్వె వెలిగింది.

అది ఎంగేజ్ మెంటు రింగ్. ఒకప్పుడు దాన్ని తిరిగి ఇచ్చివేయాలని తొందర పడింది కూడాను. కాని ఆ తొందర పాటును అనుభవంతో అడ్డం వేసింది తన స్నేహితురాలు.

"ఏడిశావ్ లేవోయ్ వెర్రి చేష్టలూ నువ్వూనూ.... అతగాడు ఏ మానాన్న వున్నాడో ఏమో! లేదా పరిహాసానికే అన్నాడో. అంతమాత్రాన ఆడపిల్లవి ఇంతకు తెగిస్తావా? ఆడపిల్ల పెళ్లంటే అసిధారా వ్రతం లాంటిది. ఆ బాధేవిటో మీ నాన్నకి తెలుస్తుంది నీకెలా తెలుస్తుంది?" అని ఓ లెక్చరిచ్చింది, అక్కడికి తనేదో పదిమంది పిల్లల పెళ్లిళ్లు చేసి కష్టపడిపోయినట్టు.

అయినా ఆమె చెప్పిన మాటల్లో కూడా సత్యం లేకపోలేదు. భాస్కరం అయినా ఏమంత చెడ్డవాడు కాదు. కాకపోతే కొంచెం పెడసరం మనిషి. ఎదుటివాళ్ల ఆత్మాభిమానాన్ని దృష్టిలో పెట్టుకోకుండా ఏమాట బడితే ఆమాట అనేస్తాడు.

భాస్కరంతో తనకు ఎంగేజ్ మెంటయి ఆరు మాసాలు కావస్తోంది. అసలు ఈ జనవరిలోనే పెళ్లి జరగాల్సి వుంది. కాని, తనే ఒద్దని ఇంటికి ఉత్తరం రాసింది. దాంతో తండ్రి భయపడి పరుగెత్తుకొచ్చేడు కూడాను. వాళ్ల మధ్య జరిగిన వ్యవహారం ఆయనెరగడు.

"ఏం తల్లీ ఇష్టం లేదా?" అనడిగేడు బాధగా.

తండ్రి ముఖం చూస్తే జాలీ, బాధా జమిలిగా ముంచుకొచ్చేయి. ఆయనకి ఇష్టమైన సంబంధం అది. భాస్కర్ తండ్రీ,ఆయనా ఆప్తమిత్రులు. ఆ మైత్రిని బాంధవ్యంగా మార్చుకుని అభిమానాన్ని సుస్థిరం చేసుకోవాలని ఆయన అభిలాష, చిరకాల వాంఛ.

అప్పట్లో భాస్కరం అంటే తనకి ఎంత అయిష్టంవున్నా అంగీకరించటానికి మరో కారణం కూడా వుంది. ఆ వయసులో తన తండ్రి సంబంధాలకోసం వెతకలేదు. వెతికినా లేమిలో అంతంత కట్నాలు పోసి పెళ్ళిచెయ్యలేడు. పోనీ పెళ్ళీ గిళ్ళీ లేకుండా వుండిపోదామన్నా అదసలే సహించలేడు. అందుకే -

"లేదు నాన్నా..ఇష్టమే..!" అనేసింది.

"మరి ఆలస్యం దేనికి తల్లీ?"

ఆలస్యం అయితే ఆ సంబంధం చేయి జారిపోతుందేమోనని వాపోతున్నట్టుగా వుంది ఆ కంఠం.

"వేసవిలో అయితే బావుంటుంది నాన్నా...తమ్ముడాళ్ళకి సెలవులు కూడా వుంటాయి" అంది.

సంతృప్తిపడ్డాడా వృద్ధుడు.

"సరేలే తల్లీ" అని వెళ్ళిపోయాడు.

రెండు నెలలపాటు భాస్కరం, తనూ ముఖముఖాలు చూసుకోలేదు. చూడాలని చాలాసార్లు తనకి అనిపించింది. చూసి ఒకసారి మాట్లాడి రావాలనుకుంది. కాని పట్టుదల. ఆత్మాభిమానం అడ్డు తగిలింది. తన కుటుంబం గురించి, తనవాళ్ళ గురించి నీచంగా మాట్లాడితే తనకు తల తీసేసినట్లుంటుంది. అసలు మగాళ్ళ మీదే తనకు సదభిప్రాయం ఇటీవల సన్నగిల్లిపోసాగింది. ఏవేవో ఆదర్శాలు వల్లిస్తారు. కట్నం లేకుండా పెళ్ళిచేసుకోవటం అదేదో పెద్ద త్యాగంలా పోజు పెడ్తారు. దాన్ని ఆసరా తీసుకుని అడ్డమైన మాటలూ మాట్లాడతారు. అసలు

ఆ త్యాగం అన్నమాటలోనే వుంది దివాళా కోరు తనం. ప్రేమ వుండాలిగాని త్యాగం ఎందుకు దప్పాలు కొట్టుకోడానికి తప్ప. ప్రేమ వున్నచోట త్యాగం దానికదే పుట్టుకు వస్తుంది.

ఇష్టం లేకుంటే పోనీ పెళ్ళాడ్డం మానెయ్యాలి. అంతేగాని తన కుటుంబం గురించి ఛీప్‌గా మాట్లాడ్డం తను సహించ లేదు.

"హుఁ... ఎందుకు మళ్ళీ ఈ పాత సంగతులన్నీ" అని విసుక్కుని మరోసారి అటు చూసింది.

'అదుగో ఒచ్చేస్తున్నాడు'

ఆమె భార రాహిత్యంలో తేలిపోయింది. అలా ఆకాశపు అంచులదాకా ఎగిరి చుక్కలు చక్కిలగింతలు పెడితే తిరిగి మళ్ళీ నేలమీద వాలింది.

అతను దగ్గరికి వచ్చేస్తున్నాడు.

ఆమె హృదయం మేఘం చూసిన నెమలిలా పురి విప్పి ఆడింది. మిఠాయి చూసిన పేద పిల్లాడిలా ఉవ్విళ్ళూరింది. మొదటిసారి ఇష్టమైన వ్యక్తిని వరుడిగా చూడబోతోన్న కొత్త పెళ్ళికూతుర్లా మేను పులకించింది.

అతను నవ్వేడు.

ఆ నవ్వే తనని మోసం చేస్తోంది.

ఆ నవ్వే తనని మంత్రించేస్తోంది.

ఆ నవ్వు ఒక హిప్నటైజింగ్ మీడియా.

ఆ నవ్వుకే తను చాలాకాలంనించీ బందీగా బతుకుతోంది.

ఏమైనాసరే తను ముందుగా మాట్లాడ కూడదు అనుకుంది లలిత.

కానీ, తనే ముందుగా-

"రమ్మని ఇంత ఆలస్యమా....?"





అంది బుంగమూతిపెట్టి.

మమకారానికి మంచి ముహూర్తం! బుంగమూతి ప్రేమకు సిగ్నల్.

భాస్కరం మనసు తేలికపడింది. ఆమెకు కోపంలేదని తేలిపోయింది.

"రమ్మన్నానని రాత్రికేవచ్చి ఇక్కడ కూర్చుంటావని అనుకున్నానా? అనుకుని వుంటే..." మళ్ళీ అదే మంత్రం.

అవును...అదీ నిజమే.కాని తన ఆత్రుత అతనికేం తెల్సు? రెండునెలల్నుంచీ ఈ అవకాశం కోసమే వేచివుంది.

"పద.... కిందికి వెడదాం"

మెట్లు దిగేడు భాస్కరం. అతని వెనకాలే కిందికి దిగింది తను కూడా.

పచ్చగడ్డిమీద మంచుపడి తడి తడిగా వుంది. గడ్డిపోచలమధ్య అడ్డంపడ్డ మంచు బిందువులమీద సూర్యకిరణాలుపడి బల్బుల్లా మెరుస్తున్నాయి. చీరకు తడి అంటకుండా కుచ్చెళ్ళు పైకి పట్టుకుని నడుస్తోంది లలిత.

"ఈ తడిలో ఎక్కడ కూర్చోవాలని?"

"కూర్చోవద్దులే..." అంటూ నే ముందుకు నడిచేడు. యాంత్రికంగా అతన్ని వెంబడించింది లలిత. ఒక పొద పక్కకి వెళ్ళి ఆగేడు. ఆమె అతనికి ఎదురుగా ఆగి నిలబడింది. ఎయిర్‌బేగ్ లోంచి పూలగుత్తి తీసి ఆమె చేతికిచ్చేడు

"విష్ యూ హేపీ న్యూ ఇయర్ లల్లీ"

"విష్ యూ ది సేమ్ భాస్కర్...."

అంది తన్మయంగా.

మరో విడిగులాబీ తీసి పట్టుకున్నాడు ఆమె వెనక్కి తిరిగింది. ఇంకా సరిగా తడియారని నల్లని ఆ వుంగరాల జుట్టు చిక్కుల్లో దాన్ని కూర్చోబెట్టేడు.

"నాకు ఇలాంటివి బొత్తిగా తెలీవు" అంది లలిత.

"ఏవిటి?"

"అదే....నువ్వు చూడు, చక్కగా పూలు పట్టుకొచ్చేవు.మరి నేనేం తెచ్చేను?"

"ఎందుకు తేలేదు? నూతన సంవత్స రపు కానుకగా నాకు నిన్ను తెచ్చేవుగదా" అన్నాడు.

గతాన్నంతా తృటిలో విస్మరించి, ఆనందంతో గాలిలో తేలిపోయింది. ఆప్యా యంగా అతని ముఖంలోకి చూసింది! తర్వాత వేలినున్న వుంగరం కళ్ళకి అద్దుకుని ముద్దుపెట్టుకుంది.

"ఏం...నేను లేనూ...." అన్నాడు కొంటెగా.

"ఛీ....పో..." అంది బుంగమూతి పెట్టి. ఆమెకూ అలాంటి అనుభవం కావాలనే వుంది. కానీ అది నైతిక దృష్టిలో మంచిది కాదని ఆమె గట్టి నమ్మకం. అవ కాశం దొరికితే అందుకోటానికి అతను సిద్ధంగానే వున్నాడు. కావాలనే ఆమె దూరంగా ఉంటోంది.

"అలాగే వుండు. విసిగెత్తి ఎప్పుడో అతనే దూరంగా వెళ్ళిపోతాడు" అంటుంది ఆమె స్నేహితురాలు. అయినా ఆమె విశ్వాసాల్ని ఆమె వదులుకోలేదు. పోతేపోనీ, ఏమీకాకుండా విడిపోయినా ఇబ్బందిలేదుగాని అంతా అయ్యేక విడి పోవటం మగవాళ్ళకయితే తేలికే కాని వాళ్లని నిలబెట్టుకోవటం మాత్రం ఆడ వాళ్లకి చాలా కష్టం అనుకుంది లలిత.

"ఏవిటి మూగనోము పట్టేవు?" అడిగేడు భాస్కరం.

"ఏం లేదు'' అని తప్పుకుంది.

గాలి కొంచెం శీతలత్వాన్ని కోల్పోయి వెచ్చగా, నులివెచ్చగా ఒళ్ళు నిమురుతోంది. పూలుపవనస్పర్శకు తలలూపుతున్నాయి.





తలపులు తలుపులు తెరుచుకుని ప్రణయ లోకానికి ప్రయాణం చేస్తున్నాయి.

రక్తం వేడెక్కుతోంది. ఊపిరి బరువు పెరుగుతోంది. అస్తిత్వానికి ఆనవాళ్లు చెరిగిపోతున్నాయి.

అరరరె...ఏవిటిది? నాగార్జునసాగర్ తలుపులెత్తేసేరా... నయాగరా దారి మళ్ళిందా...? ఏవిటా శబ్దం....సుడులు, మోత...తీపి...భయం...నరాల సాగతీత భార రాహిత్యం, ఏమోమ్ మన్మధా .... విల్లు లాగకు నాయనా...

"వెళదామా?" అంది గట్టిగా, బరువుగా వూపిరి తీసుకుని.

"ఎక్కడికి?"

"నువు ఎక్కడికి రమ్మంటే అక్కడికి" అంది ఆత్మార్పణ చేసుకున్న దాన్లా.

కాస్సేపు ఆలోచించేడు.

"సరే... మా ఆఫీస్‌కు వెడదాం పద"

"అదేవిటి? ఇవాళ కూడా ఆఫీసేనా?"

"నిజమే లల్లీ! కానీ తప్పదు. ప్రయివేట్ కంపెనీల్లో పనిచేసేవాళ్ల జీవితాలు ఇలానే వుంటాయి. అందుకే నేమో ప్రతి వాళ్లూ ప్రభుత్వ వుద్యోగాల కోసం వాకులాడ్తారు"

"అదేం లేదులే! అక్కడుండే సమస్యలు అక్కడా వున్నాయి"

"కాని ఇంత పోటీ వుండదు. బాస్‌ల మెప్పుకోలు కోసం ప్రైవేటు కంపెనీల్లో వుండే భజన ప్రభుత్వ కార్యాలయాల్లో వుండదు. పనిచేయించుకోటానికి వాళ్ల ఎత్తుగడలు కూడా గమ్మత్తుగా వుంటాయి. ఇవాళ నాకో పని అప్పజెప్పేడు మా రీజనల్ మేనేజరు. ఆ పని విజయ వంతంగా చేయగలిగితే నాకో తాయిలం పెడతానన్నాడు"

"ఏమిటది?"

"చెప్పుకో చూద్దాం"

"ఇంకేం వుంటుంది? మరో పని రోజు సెలవు కోమకోమని వుంటాడు. లేకుంటే కాడ్బరీస్ చాక్లెట్ కొనిపెడతాడా, ఐస్క్రీం తినిపిస్తాడా?"

"ఉహూఁ... పప్పులో కాలేసేవు"

"అదేమిటో మరి నువ్వే చెప్పేయరాదూ..."

"మా అకౌంటెంటుకు మరో చోట మంచి అవకాశం వచ్చింది. అతను వెళ్లిపోతున్నాడు"

"అయితే....?"

"అందుకు నాకో అగ్ని పరీక్ష పెట్టేడు మా బాస్. ఇవాళ గనక ఆ అకౌంట్సన్నీ నీటుగా రాసేయగలిగితే నన్నా కుర్చీలోకి తరలిస్తానన్నాడు"

"మంచి అవకాశమేనే!"

"అందుకే మరి..."

"అయితే పద"

మెట్లెక్కి ఇద్దరూ రోడ్డుమీద గేటు వైపు నడుస్తున్నారు.

"ఇన్నాళ్లూ నన్ను ఏడిపించినందుకు నీకెన్నివేల గుండెలుండాలి?" అన్నాడు భాస్కరం.

"నాకున్నది ఒక్కటే గుండె. అది కూడా నా దగ్గర్లేదు. అంచేత నేను ఏడిపించేననే అభియోగానికి ఆధారాల్లేవు" అంది లలిత లాయర్లా.

"అయితే నేనే ఏడిపించి వుండాలి"

"కాకపోతే నువు రావచ్చుగా... లొంగిపోవటం ఆడదానికే జన్మహక్కా?"

"ఒహో! మాట్లాడితే లొంగిపోయినట్టు కాబోలు"

"కానప్పుడు మరెందుకు రాలేదు?"

"రావాలనే అనిపించింది... కాని తీరా వచ్చేక తిప్పికొడతావేమోనన్ని భయం వేసింది"

"ఆ మాత్రం భయం వుందిగా! మంచిదే... మరెప్పుడూ నాకు అవమానం తలపెట్టకు. నాకు అభిమానం జాస్తి..." అంది.

"తెలుస్తోనే వుందిగా...."

"ఎందుకైనా మంచిదని మరోసారి చెబుతున్నాను"

ఆమెకు పాత విషయాలన్నీ గుర్తుకొచ్చేయి. అందుకే ఆ మాటలు సీరియస్‌గానే అంది. కాని ఆ మూడ్‌లో అతనిది అంతగా పట్టించుకోలేదు.

ఇద్దరూ బస్టాప్ చేరుకున్నారు.



## జనవరి : 1 ఉదయం 9.40

ఎన్నో యుగాలుగా బంజారా కొండల మీదనించి వర్షం నీరు జారి, కింద లోయలో చేరి, మాసబ్‌టేంకుగా మారి ఇప్పటి పొట్టి శ్రీరాములు నగర్ వరకూ విస్తరించుకుని, కాలం వేసిన మెట్టకు వెనక్కు జరిగి, బంజారా హిల్స్ పాదాల దగ్గర ఒదిగి కూర్చుంది. జనం ఓ తిడికి తట్టుకోలేక నగరం సాగి, మాసబ్‌టేంకు మెట్టమీదికి విస్తరించుకుని శాంతినగర్‌గా వెలిసింది.

ఆ శాంతినగర్‌లో ఓ చిన్న పార్కు.

దానికి ఎదురుగా బేంక్. దాని పక్కనే రెండంతస్తుల అందాల భవంతి. ఖాసింఖాన్ అనే ఓ కమీషన్ వ్యాపారస్తుడిది ఆ భవంతి. ఆ భవంతిలో భారతదేశం అన్ని మూలలకీ విస్తరించుకున్న ఒక అంతర్జాతీయ వ్యాపార సంస్థ తాలూకు ప్రాంతీయ కార్యాలయం. ఆ కార్యాలయం ముందు నించి పోయే రోడ్డు సరాసరి పౌల్ట్రీ మార్కెటింగ్ సెంటర్‌లోకి పోతుంది.

ఆ భవంతి మొదటి అంతస్థులో 'అల వైకుంఠపురంబులో' అన్నట్టు ఆ మూల గదిలో ఓ పెద్ద టేబిలు ముందు పెద్ద పెద్ద పద్దుల పుస్తకాలు పరచుకుని దీక్షగా అంకెలు పేరుస్తున్నాడు భాస్కరం.

"నేను కూడా సాయం చేసేదా?" అనడిగింది లలిత.

"అక్ఖర్లేదు. అలా ముందు కూర్చో. చాలు" అన్నాడు తల పైకి ఎత్తకుండానే.

లెక్కల్లో తాదాత్మ్యం చెంది, ఏకాగ్రతతో రాసుకుంటో కూర్చొన్న భాస్కరం ముఖంలోకి చూస్తూ కూర్చొంది లలిత.

మౌనం... గంటల తరబడి మౌనం. మౌనంలో భరించలేని బరువై కాలం సాగుతోంది లలితకు.

'మానవుడు సంఘజీవి'. అబ్బ! ఎంత గొప్ప సత్యం. ఒంటరితనం ఎంత ఘోరమైన శిక్ష! మనిషిని ముందు పెట్టుకుని మౌనంగా కూర్చోటం మరెంత ఘోరమైన శిక్ష!! పోనీ పలకరిద్దామంటే పని పాడవుతుందేమోనని భయం.

లేచి బాల్కనీలోకి వెళ్లి కింద రోడ్డు మీదికి చూడసాగింది.

శీతాకాలం....!

పొద్దు పైకెక్కినా చక్కిలిగింతలు పెడుతూనే వుంది చలి. ఆ చలిలో ఓ ముసలమ్మ ఆ రోడ్డు వెంబడి నడిచి పోతోంది.

కేన్ బేస్కెట్ ఒకటి చేత్తో పట్టుకుని భారంగా అడుగులు వేసుకుంటో నడుస్తోందామె.

బహూశా పౌల్ట్రీ మార్కెటింగు సెంటర్ నుంచి వస్తున్నదల్లే వుందామె. బుట్ట నిండుగా వుంది. మనిషి అసలే అర్భకురాలు. దానికి తోడు వయసు ముదిరింది. సన్నని కొమ్మకు భారం కట్టినంతగా ఒంగిపోతోందామె వళ్లు.

ముసలమ్మ వంగి, వడలిన దేహం ఊపుకుంటో నడుస్తోంటే లలిత బాల్కనీలో నిలబడి ఆసక్తికరంగా ఆమెను పరిశీలిస్తోంది. పదినిముషాలకు కూడా ఆమె పట్టుమని రెండడుగులు ముందుకు వెయ్యలేకపోతోంది. చేతుల్తో బాటు చేతిలోని బేస్కెట్ కూడా గజగజా వణికిపోతోంది. నిండుగా వున్న బుట్టను ప్రతిక్షణం సర్దుకోవల్సి వస్తోంది. బటన్స్ లేని స్వెట్టరు ఆమె ఒంటి చర్మంలాగే వదులుగా వేళ్లాడుతోంది. ఆమె భుజవైశాల్యం దానికి చాలక అస్తమానం కిందికి జారుతోంది. అన్ని బాధల్లో అదో బాధ! ఒక చేత్తో స్వెట్టర్ని భుజాల మీదికి లాక్కుని సర్దుకోవటం, మరో చేతిలో వున్న బరువు బేస్కెట్‌ను ఒరిగి పడిపోకుండా బేలన్స్ చేసుకోవటం! నిజంగా ఆమెకదో అసిధారా వ్రతంలా పరిణమించింది. అలా అవస్థపడుతూనే అలిసిపోయిన పాదాలని ముందుకు నెడుతోంది. ఆమె ఎంత ముందుకు నడిచినా దూరం మరింత సాగి ఆమెను గేలి చేస్తున్నట్టుగా అనిపిస్తోంది లలితకు.

రోజూ కాకపోయినా తరచుగా ఆమె ఆ రోడ్డు మీద కన్పిస్తూవుంటుంది. ఆమె పనిచేసే ఇంటితో ఆమెకువున్న సంబంధం




లాంటిదే పౌల్ట్రీ సెంటర్తో ఆమె అనుబంధం కూడాను.

దిక్కులేని ఆమె బతుక్కి ఓ సైనికాధి కారి ఇల్లు చుక్కానిలా చిక్కింది. అక్కడే ఆయాగా ఎన్నో అగచాట్లనీ, అవమానా లనీ భరిస్తో పన్జేస్తోంది. ఆ ఇంట్లోకి నిత్యం అవసరమయ్యే గుడ్ల కోసమూ, చికెన్ కోసమూ తరచు ఆమె అటు వెడుతోవుంటుంది.

ఆరోజు నూతన సంవత్సరారంభం కాబట్టి యజమాని ఇంటికి ఎందరో అతి థులు వస్తారు. తిని, తాగి ఖుషీ చేస్తారు. అసలురాత్రి జరిగిన అల్లరికే అంతులేదు. మళ్లీ ఉదయమే బుట్ట చేతికిచ్చి తోలేరు. ఇవాళ చికెన్తోబాటు గుడ్లు కూడా కొని ఆ చిన్ని బుట్టలో అన్నీ జాగ్రత్తగా సర్దింది. అదిజారి పడిపోకుండా ప్రతి క్షణం జాగ్రత్తపడుతోంది. ఆ స్వెట్టరొకటి అస్తమానం జారుతోనే వుంటుంది. జారినప్పుడల్లా ఒక చేత్తో దాన్ని సర్దుకుంటోనే వుంటుంది. ఆ క్రమంలో బుట్ట కొంచెం పక్కకి ఒరిగింది.

ఆమెను పరిశీలిస్తోనే వూరికే జాలి పడిపోతోంది లలిత.

—పాపం ఆ వయసులో కూడా ఎంత శ్రమ పడుతోంది. తనైతే అసలే లేప లేకపోయేదేమో!

—ఆ(.... లేవకేం చేస్తాంలే! అవస రమే లేపుతుంది!!

—అరె!! .... !! అదేవిటి? ఆ బుట్టలో గుడ్లు పడిపోయాయే....!! రాసుకుంటూ వెళ్తున్నట్లు వెళ్ళిన ఓ ఆటో చప్పుడుకి, బెదిరిన ముసలమ్మ చేతిలోని బుట్ట లోంచిగుడ్లు కిందపడ్డాయి.

ముసలమ్మ కెవ్వున అరిచింది. భయంగా అరిచింది. అదే క్షణంలో లలిత కూడా అసంకల్పితంగానే గట్టిగా అరిచింది. సగం అసంకల్పితంగానూ, సగం సానుభూతి పూర్వకంగానూ ఆ కేక వెలువడింది. శ్రావ్యమైన ఆ కంఠంనించి అతి భీతావహంగా ఆ కేక వెనక్కి విని పించింది.

నల్లని తారు రోడ్డు గుడ్లు పడి పగిలిన మేర తెల్లగా, పచ్చగా అయిపోయింది. నలుగురైదుగురు చేరేరు.

"ఏవిటి కాటికి కాళ్లు చాపుకున్న ముసల్దాన్ని ఇంకా శ్రమ పెడుతున్నారు ఎవరోగాని"

"ధ....దిక్కులేని బతుకు..."

"పాపం! ఇవాళ ఎన్ని చివాట్లో? చెప్పుదెబ్బలో?"

అక్కడి దృశ్యం, ఆ సంభాషణలు అలా సాగుతున్నా వృద్ధురాలి ముఖంలో మాత్రం ఏ భావమూ కన్పించటంలేదు. నిశ్చలంగా, అయోమయంగా ఉండిపో యింది. భీతి, అసహనం, విహ్వలత అన్నీ కలిసిపోయి ఆమె ముఖంలో పోలిక లేకుండా వున్నాయి.

ఆమె నిస్సహాయ.

* * *

అనుకున్నదానికంటే పని వేగంగా సాగుతోంది—ఎకౌంటు పుస్తకాలు దీక్షగా రాసుకుంటున్నాడు భాస్కర్. ఒట్టి దీక్ష మాత్రమేకాదు. తను చేసే పనిలో నైపుణ్యం, శుభ్రత కన్పించాలనే తపన కూడా అతన్లో కన్పిస్తోంది. తన భవిష్య త్తంతా ఆనాటి పనిమీదనే ఆధారపడి వుంది మరి!

ఓ పుస్తకం పూర్తయింది. వోచర్లూ, బిల్లు పుస్తకాలూ పక్కన పెట్టి ఫేసెట్ మిషన్ తీసుకుని కూడికలు వేయసాగేడు. ఆ మొత్తం కింద అందంగా గీతలు

కొట్టాలని అంకెల కింద రూలర్ పెట్టి ఎర్రసిరా పెన్ను కోసం జేబులు వెతికేడు.

వెధవది ఎర్రసిరా పెన్ను మర్చి పోయినట్టున్నాను అని స్వగతంగా అనుకుని అవతల టేబులు మీదున్న ఎర్రసిరాబుడ్డీ, కలమూ తెచ్చుకున్నాడు. కలం సిరాలో ముంచి, తీసి కాగితంమీద కారకుండా కొంచెం విదిలించి కలాన్ని రూలర్ వెంబడే పెట్టి గీత కొట్టబోయేడు.

సరిగ్గా అదేక్షణంలో వరండాలోంచి లలిత కేక భీతావహంగా వెలువడింది. భాస్కరం ఉలిక్కిపడ్డాడు. ఆ వులికి పాటుకు కలం రూలర్ వెంబడే నడవక పుస్తకానికి అడ్డంగా పరుగెత్తింది. పైగా కలం అతని చేతిలోంచిపట్టు తప్పించుకుని, ఆయాసంగా పుస్తకంలో ఒరిగి నురుగులు కక్కింది.

కాని, అవేవీ అతని దృష్టిలోకి రాలేదు.

"ఏవిటి లల్లీ..." అంటూ పరుగెత్తాడు భాస్కరం. లలిత మేడమీంచి కిందికి పడిపోలేదుగదా అని హడలి పోయేడు అతను. 'సిరికింజెప్పడు శంఖ చక్రముల్ చేదోయి సంధింపడు...' అన్నట్టు - ఆ వరండాకు గ్లాస్ ఫెన్సింగ్ వుందని తెల్సికూడా ఆరాటపడి పరుగెత్తేడు.

లలిత అక్కడే వుంది. అంతేకాదు... హాయిగా వుంది. అతని ఆరాటాన్నే గమనించకుండా బయట రోడ్డు మీదికి చూస్తోంది. అతని దృష్టి కూడా రోడ్డు మీది దృశ్యంపై పడింది.

"ఏవిటి? ఏమైంది??"

ఆమె భుజాలు పట్టుకుని వెనక్కి తిప్పి అడిగేడు. ఆమె ఏం మాట్లాడలేదు. అలాగే చూస్తూ నిల్చుంది.

"నీకేం పన్లేదు" అంటూ తిరిగి తన స్థానంలోకి వెళ్ళిపోయేడు.

తిరిగి సీటుకు చేరుకోగానే అక్కడి పరిస్థితి అర్థమైంది భాస్కరంకు. జరిగింది చూసి స్థంభించిపోయేడు. పుస్తకానికి అడ్డంగా ఎర్రగీతలు తన నుదుటి రాతల్లా అనిపించాయి.

అంకెలనిండా ఎర్రసిరా మరకలు తన గుండె పగిలి రాలిన నెత్తుటి చుక్కల్లా వున్నాయి.

అతనికి బుద్ధి స్తిమితం తప్పింది. రూలర్ తీసి మూలకి విసిరేడు. అది తగిలి మూలనున్న కూజా పగిలి నీళ్ళన్నీ వరదలా పారేయి. కింద పెట్టిన వోచర్ల కట్టని పూర్తిగా తడిపేశాయి.

వళ్ళుమండి కలంతీసి విరగ్గొట్టి కిటికీ లోంచి బైటికి విసిరేసేడు.

"అమ్మా"

బయటినించి పెద్ద అరుపు విన్పించింది. కాని అవేమీ అతని తలకెక్కలేదు. తల చేత్తో పట్టుకుని కూర్చుండిపోయేడు.

ఛీ.... దీనికి పిచ్చి పట్టినట్టుంది. భవిష్యత్తంతా బండపాలు చేసింది... జీవితం మంట కలిపింది అని వాపోతున్నాడు.

తల రెండు చేతుల్లో పెట్టుకుని అలాగే నేలవైపు చూస్తూ ఉండిపోయేడు భాస్కరం. కొంతసేపటికి ఎదురుగా హైహీల్స్ చెప్పులూ, ఫాల్ కుట్టిన చీర కుచ్చెళ్లూ కన్పించేయి.

అతను కోపంతో పిచ్చెత్తిపోయేడు. బాధలో విచక్షణ కోల్పోయేడు. బుద్ధి గతి తప్పింది.

ముఖం పైకెత్తి చూసేడు. లలిత హాయిగా నిండుగా నవ్వుతోంది.



అతను మరింత పిచ్చివాడైపోయేడు.

"సిగ్గులేదూ నవ్వుతున్నావ్. యూ బిచ్..." అన్నాడు కోపంతో.

ఆమె ఒక నిముషం పాటు స్థాణువులా అయిపోయింది.

అతని కళ్లు ఎర్రగా చింత నిప్పుల్లా వున్నాయి. పెదాలు గాలికి అదుర్తోన్న ఎండుటాకుల్లా వున్నాయి. అతని వాలకం చూస్తే ఆ మాటలు ఏదో సరసానికి అన్నట్టుగా అన్పించలేదు లలితకు. పాత జ్ఞాపకాలన్నీ తోసుకు ఒక్కొక్కటే పైకి వచ్చేయి.

"ఏవిటి భాస్కర్! నువ్వేనా నన్నా మాటన్నది??"

"ఏం...నువ్వేం స్వర్గాన్నుంచి వూడిపడ్డావా? మళ్లీ అంటాను. యూ డర్టీ క్రీచర్.. బిచ్...."

మరోసారి కిందున్న పుస్తకం వైపు దీనంగా చూసేడు. సిరాబొట్లు కోప్పడుతోన్న ఆఫీసరు కళ్లలా వున్నాయి. అంకెలు సంకెళ్లలా అల్లుకుపోతున్నాయి. అవి చూస్తూ పిచ్చివాడిలా అయిపోయేడు. కన్నీళ్లు ఒక్కటే తరువాయి.

అసలు ఏం జరిగిందో, అలా ఎందుకు జరిగిందో, ఆ జరగటానికి తనెంతవరకు బాధ్యురాలో లలితకు బొత్తిగా తెలీదు.

"ఎంత లోకువైపోయేను. నన్నంత మాటంటావా?" అంది.

"ఏం ....నువ్వంత గొప్పదానివా?"

"అర్థమైందిలే. నీతో పెళ్లయితే నా గతి ఎలా వుండేదో బాగానే తెల్సి వచ్చింది" అంది. ఆమె గొంతు ఏడుపునకు దగ్గరగా వణుకుతోంది.

"పెళ్లా...నిన్నా... డర్టీ రాస్కెల్. నిన్నెవడు పెళ్లాడేది? నా బతుకు నాశనం చేసేవు"

మాటమీద మాట పెరిగింది.

"నువ్వొక్కడివే మగాడివి కాదు. నువ్వు పెళ్లాడకపోతే నాకసలు పెళ్లే కాదనుకుంటున్నావా?"

"అసలు పెళ్లి చేసుకునే అలవాటు మీ వంశంలోనే లేదుగా... నీ అక్క..."

"నోర్ముయ్! నా అక్క పేరెత్తే అర్హత నీకు లేదు" అని చేతినున్న ఎంగేజిమెంటు వుంగరం తీసి నేలకేసి కొట్టింది. ఆ వుంగరం నేలకు గట్టిగా కొట్టుకుని, ఓ ఎగురు ఎగిరి జాగ్రత్తగా పాకి వెళ్ళి తన ఆసామి పాదాల దగ్గర కూర్చొంది.

ఉంగరాన్ని చేతిలోకి తీసుకున్నాడు భాస్కరం. అదే వుంగరం, కాని నేలకు విసిరికొట్టడంవల్ల వుంగరంనుంచి రాయి రాలిపోయి లొట్టకన్నులా అనిపించింది.

అతనికి మాట్లాడే అవకాశం ఇవ్వలేదు లలిత. చకచకా మెట్లు దిగి కిందికి వచ్చేసింది.

క్రాసురోడ్డునుంచి మెయిన్‌రోడ్డుమీది కొచ్చింది లలిత. పాలిటెక్నిక్ హాస్టలు మిద్దె మీదినుంచి ఓ పక్షి ఈలవేసింది. ఆమెకు విన్పించలేదు. పక్షి గుర్రంగా మారి సకిలించింది. అది కూడా విన్పించలేదు. ముందునుంచి ఒక రిక్షా వెళ్ళింది. అదీ కన్పించలేదు.

రోడ్డువెంబడ విజయనగర్‌కాలనీ వేపు నడక సాగించింది.

లలిత అటు వెళ్ళగానే, భాస్కరం పనిచేస్తోన్న ఆ భవనం యజమాని ఓ పిల్లదాన్ని చేత్తో పట్టుకుని పైకి వచ్చేడు. అతనుముస్లిం. ప్రైవేటు కంపెనీకి అద్దెకిచ్చి కింది భాగంలో వుంటున్నారు వాళ్లు.

ముస్లింల ఘోషా గురించి ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. అయినా వయసులో




వున్న ఆ పిల్లని చెయ్యి పట్టుకుని పైకి లాక్కొచ్చేడు.

"ఇది ఇల్లనుకున్నావా లేక నీ బాబుగారి జాగీరనుకున్నావా బేవకూఫ్" అంటూ రావడమే తడవుగా మొదలెట్టేడు.

నిశ్చేష్టుడయి నిలబడిపోయేడు భాస్కరం.

"పిల్ల గార్డెన్‌లో కూర్చుంచే కలం విసిరికొడతావా?" అంటూ పిల్ల బుగ్గ చూపించేడు.

కాశ్మీర్ ఏపిల్‌లాంటి ఆ కన్నెపిల్ల బుగ్గ కత్తితో గంటుపెట్టినట్టుగా వుంది.

జరిగిందేవిటో అర్థమైంది భాస్కరానికి.

ఒణికిపోయేడు.

"నేను ఇంట్లో లేకపోవటం చూసి ఇలాంటి అఘాయిత్యం చేస్తావా? అసలు సెలవురోజు ఆఫీసుకు ఎందుకు వచ్చావ్? ఆడపిల్లల్ని వంటరిగా చూడవచ్చునా?"

"క్షమించండి. నాకా వుద్దేశం లేదు" అన్నాడు చేతులు జోడించి.

డాడీకి ఎందుకు చెప్పేను అని వాపోతోంది ఆ అమ్మాయి.

"రానీ మేనేజర్ని...నిన్ను డిస్మిస్ చేయిస్తాను" అని ఎలా వచ్చేడో అలాగే దిగిపోయేడు ఆ ఆసామి చిందులు తొక్కుతూ.

* * *

రిషా ఎక్కి ''పోనీయ్'' అంది లలిత.

"ఎక్కడికమ్మా?"

"అదుగో ఆ కొండమీది పాత బంగ్లాకి"

ఆ పాత బంగ్లా చాలా పెద్దది. పెద్దది మాత్రమే కాదు-చాలా అందంగా ఆంగ్లేయ వాస్తుశిల్పం అచ్చుగుద్దినట్టు కన్పిస్తో వుంటుంది. కాని అది ఆంగ్లేయ,పర్షియన్ వాస్తుకళా సమ్మేళనం అంటారు ఆధునికులు. ఒకప్పుడు ఓ నవాబుగారు తన ఉంపుడుగత్తెకు కట్టించి ఇచ్చిన భవనం అది. నవాబుగారు సామాన్యుడుగా మారిపోయి ఆ తర్వాత అవతలికి దాటుకున్నాక అది ఒక మార్వాడీ అధీనంలోకి వచ్చింది. ఆయన ఓ పెద్ద టూరిస్టు హోటలుగా దాన్ని మార్చాలనుకొన్నాడు. కాని అది నగరానికి మారుమూల ఉండిపోవటంవల్ల ఆ సంకల్పం ఇంకా కార్యరూపం దాల్చలేదు. అంచేత ఆ మార్వాడీయే అందులో మకాం చేసేడు సకుటుంబంగా.

ఆ ఇంట్లోనే వుంటోంది లలిత, ఓ గదిలో.

అదెలా దొరికిందంటే...

హైదరాబాదు వచ్చిన కొత్తలో లలిత ఇల్లు కోసం గాలించటం మొదలెట్టింది. ఒకరోజున తన స్నేహితురాల్తో ఇంటి కోసం వెతుకుతూ ఓ పెద్ద భవంతి ముందు నిలబడి వున్న ఓ ఆసామిని అడిగేరు_

"అద్దెకు పోర్షన్ ఏమైనా దొరుకుతుందా?" అని.

"ఎక్కడ?"

"మీ ఇంట్లో..."

వాళ్ళను చూసి పకాల్న నవ్వేడు ఆ ఆసామి.

వాళ్ళకు మతిపోయింది. అమాయకంగా అతని ముఖంలోకి చూస్తూ వుండిపోయారు.

అతను తమాయించుకుని—

"ఇక్కడ లేదుగాని, అదుగో ఆ కొండమీద పెద్ద బంగ్లా వుంది చూడూ.... అక్కడికి వెళ్ళి అడగండి" అన్నాడు.

వాళ్ళు వెళ్ళేరు.

ఆ ఇల్లు చూడగానే అడగటానికి భయం వేసింది.

అదో పెద్ద కోటలా వుంది.




ఆ కోటక చుట్టూ ఎత్తయిన గోడ వుంది. గేటు మాత్రం విరిగిపోయి పక్కన పడివుంది.

లోపలికెళ్లారు.

సిపాయిలెవ్వరూ కన్పించలేదుగానీ, అంతఃపురం తాలూకు ఓ ఆవిడ మాత్రం ముద్దమందారాలు తెంపుతూ దర్శన మిచ్చింది.

భయపడ్తూ దగ్గరికెళ్లారు.

"ఎవరు మీరు...?"

చెప్పేరు.

"ఏం కావాలి?"

చెప్పేరు.

"ఇక్కడ ఇల్లు అద్దెకిస్తారని ఎవరు చెప్పేరు?"

అదీ చెప్పేరు.

"మేం ఇల్లు అద్దెకిచ్చి బతికేంత గతి లేనివాళ్ళం అనుకున్నాడా వాడు?" అని ఎగిరిపడింది.

"క్షమించండి. మాకు తెలీదు. అతను చెబితే నమ్మి వచ్చాం" అన్నారు.

ఆమె ఏం అనుకుందో ఏమో –

"మీరిద్దరూనా వుండేది?"

"లేదు. నేనొక్కతినే వుంటాను" అంది లలిత.

"మగాళ్ళెవరైనా వస్తారా?"

"రారు. ఎప్పుడైనా ఒస్తే మా నాన్నగారొస్తారు"

"అయితే ఇస్తాంలే. మేం ఇల్లు కిరాయి కివ్వం. కాని నాకు వంటరితనంతో ఏమీ తోచటం లేదు. ఆడపిల్లవు కదాని ఇస్తున్నాను" అంది.

"థాంక్స్..."

"ఫర్వాలేదు...నా పక్క గదే ... వేరుగానే వుంటుంది. బాత్రూం, లేవట్రీ అటాచ్డ్..."

అలా ఆ ఇంట్లోకి చేరింది లలిత. ఆ గదికే వచ్చింది లలిత ఇప్పుడు.

రిక్షా దిగి గబగబా మెట్లెక్కింది లలిత.

"అమ్మా! పైసలు...."

మళ్ళీ వెనక్కి దిగివచ్చి రెండు రూపాయలిచ్చి చిల్లర అడక్కుండా మెట్ల మీదికి పరిగెత్తింది. కర్ర మెట్ల మీద ఎత్తుమడమల చెప్పులు చప్పుడు చేస్తోంటే గుర్రాలు పరుగెడుతున్నట్టు అనిపిస్తోంది.

గది తాళం తీసింది. విసురుగా తలుపులు ముందుకు తోసి లోపలికి వెళ్ళగానే ఎవరో తరుముతున్నట్లుగా బలంకొద్దీ తోసింది. అంతే! తలుపులు దబాల్న కొట్టుకుని బాంబు పడ్డంత శబ్దం చేశాయి. ఆ భీకర ధ్వనికి లలిత బెదిరిపోయింది. నీరసంగా మంచంమీద కూలిపోయింది.



## జనవరి 1 :
## మధ్యాహ్నం 12.10

ఆ క్షణంలో ఆ ఇంటి యజమానురాలు షాపింగుకు వెళ్లే ప్రయత్నంలో వుంది.

ఆమె వయస్సు నలభైకి దగ్గర పడుతున్నట్టుగా అనిపిస్తుంది. ఆమె జుట్టులో అక్కడక్కడా తెల్ల వెంట్రుకలు సాగినా, అవి రంగులో దాక్కుండిపోయేయి. ఆమె బొద్దుగా వుంటుంది. కళ్ళు పెద్దవేగాని కళ వుండదు. చర్మం తెలుపేగాని తేజస్సు

కన్పించదు. మనిషి పొట్టి, అందులోనూ కడుపుతో వుంది.

ఆమెకు అలంకారం మీద మక్కువ ఎక్కువ.

ఆమె భర్త నగరంలో పెద్ద బిజినెస్ మాగ్నెట్. జంట నగరాలలో అతనికి నాలుగైదు పెద్ద పెద్ద భవంతులున్నాయి. వాటన్నిటిలోనూ ఉన్న ప్రభుత్వ కార్యాలయాల వల్ల అద్దెలే పదివేలకు పైగా వస్తున్నాయి.

అతను చేయిపెట్టని వ్యాపారం లేదు. వ్యాపారం మీద అతనికొచ్చే ఆదాయం అతనికే తెలియాలిగాని పుస్తకాల్లో కన్పించదు. అంచేత ఆదాయపు పన్నువాళ్ల అంచనాకి కూడా అది అందదు.

అతనికి ఖర్చంటూ వుండదు ఒక్క ఆడవాళ్ల మీద తప్ప. అదీ ఒకప్పటి మాట. ఇప్పుడు మహా బుద్ధిమంతుడు ఆయన.

ఒకప్పుడు.... భార్య బిడ్డువోడుతో, రేయింబవళ్లూ పూజా పురస్కారాలతో అతన్ని వేధిస్తున్న రోజుల్లో...వ్యాపారం పేరు చెప్పి తరచూ బొంబాయి వెళ్లిపోయే వాడు. అక్కడ పదిరోజులు మకాం వేసి నచ్చిన అమ్మాయిల్తో కాలక్షేపం చేసి వచ్చేవాడు.

ఈ వూళ్ళోనే మరో అధునాతన భవంతిలో అతని ఆఫీసూ, అందులో అతని కోసం అతి సుందరంగా తీర్చిదిద్దిన సమశీతలపు గదీ వుంది. అది వ్యాపారపు కార్యాలయం అన్నమాటేగాని అక్కడ విలాసాలకు అనువైన హంగులు అన్నీ వున్నాయి.

సేట్జీకి సంతానం లేదు. అందుకు అతని చెడుతిరుగుళ్లే కారణం అని డాక్టరు చెబుతాడు. అది విన్నాక అతనికి డాక్టర్ల మీద బొత్తిగా నమ్మకం లేకుండాపోయింది. ఎంచేతనంటే ... ఆమధ్య పెళ్లికాని ఆయన బెపిస్టుకి....

పిల్లలేని కొరత సేట్జీని ఈమధ్య మరీ వేధిస్తోంది. ఇంతకు ముందైతే 'ఆ పోనెద్దూ ... ఇంకా బోలెడు వయసుంది మన ముందు' అనుకుని సంతృప్తిపడే వాడు. ఇప్పుడిహ అది లేదని అద్దంలో చూసుకున్నప్పుడల్లా వెంట్రుకల్లో పాకుతోన్న వెండి తీగలు మొహం మీద గుద్ది మరీ గుర్తుచేస్తున్నాయి.

మరో పెళ్లి చేసుకొమ్మని మిత్రులు చాలామంది సలహాయిచ్చేరు. దానికేం... పెళ్లిళ్లు ఎన్నయినా చేసుకోవచ్చు. డబ్బుంటే ఎంతమందైనా సిద్ధపడతారు చేసుకోడానికి. వయసుతో నిమిత్తం లేదు. కాని అసలు అంతవరకూ ఎందుకు వెళ్లాలి? చేసుకున్న పెళ్లాం వుండనేవుంది. ఆమెకు ఆ అవకాశం ఇవ్వలేదే అని అకస్మాత్తుగా ఒకసారి గుర్తొచ్చింది సేట్జీకి.

ఆడదిగదా! ఆమె ఇంకా ఎక్కువగా బాధపడుతూవుండచ్చని అకస్మాత్తుగా తట్టింది ఆ మానవుడికి.

బేంకుల్లో ప్రత్యక్షంగానూ, బయట పరోక్షంగానూ మూలుగుతోన్న ఆ కోట్లు ఏం చేసుకోవాలి ? వాటిని అనుభవించటానికీ, మరింత పెంచటానికీ ఒక్క కొడుకైనా ఉండొద్దా.

అది అతని అభిప్రాయం.

పవిత్ర భారతదేశంలో గొప్ప గొప్ప కుటుంబాలు (?) కున్న చెడ్డ పేరు క్రిమినల్స్‌కు కూడా లేదేమో! అందుకైనా ఓ పాప కావాలి.

అది ఆమె బాధ!

ఇది ఈయన బాధ!!

మొత్తం మీద చాలా కాలానికి ఇద్దరిదీ ఏకాభిప్రాయం అయిందీ విషయంలో.

ఆమె వేదనని మొదట పసిగట్టింది





ఆమె నౌకరు పోచమ్మ.

"అమ్మగారూ! మీరిలా వుండే లాభం లేదండీ" అంది ఒకరోజున సందు చూసుకుని చనువుగా.

ఆవిడ ఓ క్షణం తెల్లబోయింది.

"మరెలా వుండాలే?" అంది ఆలోచించాక.

"అదేంటండమ్మగారూ! తెలియనట్టే అడుగుతారు? మీరు సరిగా వుండే అయ్యగారు బైట ఎందుకు తిరుగుతారు సెప్పండి...?

"అంటే....?"

"మీరు అందంగా కన్పించాల. అయ్యగారు దగ్గరున్నప్పుడు నవ్వుతూ సక్కగా మాటాడాల. ఆరు కావాలన్నప్పుడు మీరు కాదనకుండా ఉండాల..."

"అదెల్లాగే? నేను నోములు నోచుకున్నప్పుడు కూడా..."

"ఊరుకోండమ్మగారూ..ఎందుకొచ్చిన నోములు సెప్పండి. నోములు నోసుకుంటే మొగుళ్లేకపోయినా పిల్లలు పుడ్తారేంటండమ్మా?"

ఆలోచనలో పడింది ఆవిడ.

అవును....అదీ నిజమే కావచ్చు. ఇన్నేళ్లనించీ ఎన్నో నోములు నోస్తోంది. ఎన్నో వ్రతాలు చేస్తోంది. కాని.. ఏదీ ఫలితం? భర్త తనకు దూరంగా పారిపోయాడు తప్ప...

అంతే! ఆమె మారిపోయింది.

ఇప్పుడామె గదినిండా అలంకరణ సామగ్రి చేరింది. గది తీరే మారిపోయింది. ముస్తాబు ఎలా కావాలో ముచ్చటించే పుస్తకాలు తెప్పించుకుంది. చదివి అనుకరించింది. బ్యూటీ క్లినిక్కులన్నీ సర్వే చేసింది.

సరిగ్గా సేట్జీ మనసు మార్చుకుని ఆమె గదికి వెళ్లిన రోజునే ఆవిడ ఇవన్నీ పూర్తిచేసి చక్కగా అలంకరించుకుని అతని కోసమే ఎదురుచూస్తున్నదాన్లా కూర్చొని వుంది. అంతకు ముందు చూసిన అవతారంతో అంచనా వేస్తే ఆమె జగదేక సుందర్లానే కనిపించింది సేట్జీకి. తన కళ్లను తానే నమ్మలేకపోయాడతను.

ఫలితం! ఆమె గర్భవతి అయింది.

సలహాయిచ్చి వృద్ధరించినందుకు పోచమ్మకి ప్రమోషన్ ఇచ్చింది. ఇప్పుడు పోచమ్మ పని చేయనక్కర్లేదు. చేయిస్తే చాలు. ఎప్పుడూ తనతో వుండాలి. అయ్యగార్ని ఆకర్షించటానికి ఎప్పటికప్పుడు సరికొత్త చిట్కాలు మనవి చేస్తూ వుండాలి. భర్త లేనప్పుడు తనతో కూర్చొని కబుర్లు చెబుతూ వుండాలి.

అదీ ఆమె నౌకరీ.

అలాంటి ఆమె ఇపుడు డ్రెస్సింగ్ టేబిలు ముందు కూర్చొనివుంది.

పోచమ్మ అలంకరణ సామాను ఒక్కొక్కటే అందిస్తో సలహాలిస్తోంది. సలహాల అవసరం లేనప్పుడు తనకు తెల్సినవేవో పూళ్లో కబుర్లు చెబుతోంది.

పోచమ్మ అలా చెబుతోంది.

యజమానురాలు ఇలా వింటూ అలంకరణ సాగిస్తోంది.

"నిన్న నాంపల్లిలో దొంగలు పడ్డారంట అమ్మగారూ...తెల్సా?"

"తెలీదే..."

"ఇంట్లోకొచ్చి ఆడోళ్లకి కత్తిసూపించి నగలూ, డబ్బూ ఎత్తుకుపోయారంట" అని చెబుతోంది.

నాలుగు రోజుల్రకితం అలాంటిదే ఒక సంఘటన చెప్పింది.

"చిక్కడపల్లిలో కాబోలు రాత్రి పది

 

గంటలప్పుడు తలుపు కొట్టేరుట. ఆ ఇంట్లో ఆలు మగలు తప్ప మరెవరూలేరు.

భర్త తలుపు తీసేడు.

అమాంతం అతన్ని పట్టుకుని కాళ్లూ చేతులూ కట్టేశారు. భార్య నిద్దరోతోంటే లేపి భోజనం పెట్టమన్నారట.

'లేదు...మేం భోంచేసేశాం' అన్నది పాపం ఆ ఇల్లాలు.

'లేచి వంటచెయ్!' అని కత్తి చూపించేరుట. పాపం ఆ అపరాత్రి వేళ ఆమె లేచి వంటచేసి పెట్టిందిట! సుష్టుగా భోంచేశాక ఆమెను స్థంభానికి కట్టేసి ఇంట్లో వున్న డబ్బూ దస్కం దోచుకు పోయేరుట"

ఇదీ ఆమె చెప్పిన విషయం.

"ఎప్పుడూ ఇలాంటి కబుర్లే మోసు కొస్తుంటావు" అని కసురుకుంది ఆ ఇల్లాలు.

పోచమ్మకి అకస్మాత్తుగా గుర్తొచ్చింది.

"అమ్మగారూ! అయ్యగారికి మల్లీ కారు వాపసు పంపించాలి" అని గుర్తు చేసింది.

ఆమె కాస్సేపు అవన్నీ మర్చిపోయి మళ్లీ అలంకరణలో పడింది.

సిగకి ఆఖరి మెరుగులు దిద్దుకుంటో "ఎలా వుందే?" అనడిగింది.

"భేషగ్గా వుందండీ" అని సర్టిఫై చేసింది పోచమ్మ.

సిగ ముడి అందంగా కుదిరినందుకు మురిపెంగా అద్దంలోకి చూసుకుంటో ముఖానికి అద్దుకోటానికి బ్యూటీక్రీం తీసుకుంది. మూత తీసి కాస్త చేతిలోకి తీసుకోబోతోంది.

"ఇంతకీ అసలు సంగతి చెప్పనే లేదు"

"ఏ సంగతే?"

"అదేనంటమ్మా... ఇందాక సెప్పిన నాంపల్లి సోరి సంగతి"

"ఊ..."

అద్దంలోకి చూసుకుంటో ఊ కొడు తోంది.

"బంగారం ఇమ్మని అడిగారంటం డమ్మా... అవిడగారేమో ఇవ్వనన్నా రంట. అంతే..."

మెట్లమీద ఎవరో పరుగెత్తుకు పైకి వస్తున్న శబ్దం వినిపించింది. ఆమె అలంకరణ మానేసి ఆలకిస్తోంది.

మరుక్షణమే పెద్ద శబ్దమై ఇల్లంతా ఊగిపోయినట్టనిపించింది. క్రీం సీసా చేతిలోంచి జారిపోయింది.

ఆమె పూనకం వచ్చినట్టు ఒణికి పోతోంది. ఫిట్స్ వచ్చి కుప్పగా కూలి పోయింది.

పోచమ్మకి ఏం చేయాలో తోచక అలాగే వుండిపోయింది. యజమానురాలు కిందపడి కాళ్లూ చేతులూ కొట్టుకుంటో, గుప్పెట బిగబట్టి వజవజా వణికిపోతో వుంటే పోచమ్మ కంగారుపడిపోయింది.

"ఏమయింది అమ్మగారూ" ఆత్రతగా అడిగింది పోచమ్మ.

ఆమె జవాబు చెప్పే స్థితిలో లేదు.

కిందికెళ్లి ఒకళ్లిద్దరు నౌకర్లని పిల్చు కొచ్చింది. అంతా కల్సి ఎలాగో ఆమెను పక్కమీదకి చేర్చేరు.

ఆమె ఒళ్లంతా చెమటతో తడిసి ముద్దయిపోతోంది. నోటినించి నురగలు కారుతున్నాయి. ఆమె పరిస్థితి చూసి నౌకర్లంతా భయపడిపోయేరు. యజ మానిని పిలవమని తొందరచేసేరు.

అప్పటికే డ్రైవరు కారు తీసుకుని డాక్టర్ కోసం వెళ్లిపోయేడు.

• • •

నగరంలోని హోల్సేల్ మర్చెంట్స్ సమావేశం జరుగుతోంది. సమావేశం అన్న పేరేగాని అక్కడ వున్నది ముగ్గురే ముగ్గురు.

నిజానికి మార్కెట్ అంతా వీళ్లు ముగ్గురే కంట్రోల్ చేస్తున్నారు. మిగిలిన వాళ్లు అవసరమైనప్పుడు అడిగిన చందాలిచ్చేసి గుట్టుగా వ్యాపారం చేసుకోవటం తప్ప రాజకీయాల జోలికి పోరు.

ఇప్పటి ఈ సమావేశం చాలా ముఖ్యమయినది.

ఇటీవల పంచదార వ్యాపారంలో లాభాలమేర రోజు రోజుకీ తరిగిపోతోంది.

"రోజు రోజుకీ రూపాయివిలువ పడిపోతోంది. దాంతోపాటు వస్తువులధర కూడా పెరగాలిగా" అన్నాడు బదరీనాథ్!

"పెరుగుతూనే వున్నాయిగా" అందుకున్నాడు సేఠ్ రూప్‌లాల్.

"మిగిలినవాటి గురించి కాదు నేను మాట్లాడుతున్నది. పంచదార విషయం"

"పంచదార ధరని అదుపులో పెట్టటం ప్రభుత్వం లక్ష్యంగా పెట్టుకుంది మరి" అడ్డొచ్చేడు సేఠ్ దమ్మీలాల్.

"అందుకే ఇప్పుడు ఏం చేయాలీ అని"

"ధర పెంచమని అడగాలి. ధర పెంచకపోతే కనీసం కంట్రోల్ అయినా పెట్టమందాం" అన్నాడు దమ్మీలాల్.

"అవును. లేకపోతే లాభాలెట్లా వస్తాయి. లాభాల్లేకపోతే అయిదేళ్లకోసారి వీళ్ల ఎదాన లక్షలు ఎక్కణ్నుంచి తెచ్చి గుమ్మరించగలం" అన్నాడు రూప్‌లాల్ ఆమాత్రం మాట్లాడినందుకే తెగ ఆయాసపడిపోతున్నాడతను.

కుర్చీలో గోనె బస్తా కూలేసినట్టు కూర్చొన్నాడు రూప్‌లాల్. నెత్తిమీద తెల్లటోపీ, మెళ్లో బంగారుగొలుసు, దానికి ముత్యాల పథకం. చేతి వేళ్లకి విలువైన రాళ్ల వుంగరాలున్నాయి. కూర్చున్నప్పుడు అతని ఒంటిమీది కండరాలు ఖడ్గమృగం చర్మం వేళ్లాడినట్లు వేళ్లాడుతున్నాయి. నోటినిండా కారాకిళ్లీ మాట్లాడితే జారిపోయేంత ప్రమాదకరంగా వుంది.

గది అంతా చల్లగా హాయిగా వుంది. అయినా రూప్‌లాల్ టోపీ కిందనుంచి చెమటలు ప్రవహిస్తూనే వున్నాయి.

"మన లాభాలతో వాళ్ళకేం పని? వాళ్ళకి కావల్సింది వాళ్ళ లాభం. ఏదో చేసేస్తున్నట్లు వాళ్ళకి ప్రజల్లో ప్రచారం కావాలి. అందుకు మనల్ని వాళ్ల చదరంగంలో పావులుగా వాడుకుంటారు"

"ఇంతకీ ఏం చేయాలంటారు?"

"కంట్రోల్ పెట్టమందాం"

"ఎలక్షన్లు మొన్ననేగా అయిపోయేయి. ఇప్పుడు మనం చెప్పినట్టు వింటారా వాళ్లు?"

"డబ్బు ఎలక్షన్లకే కాదు భాయ్! వాళ్ల సొంతానికి కూడా అవసరమే"

"అవుననుకోండి. కాని అవినీతిని రూపుమాపేస్తామని ఈమధ్య ప్రగల్భాలు పలుకుతున్నారుగా"

"అవన్నీ ప్రకటనలవరకే. నిన్నగాక మొన్న ఏంజరిగింది? సిమెంటు పంపిణీ కట్టుదిట్టం చేయటం కోసం సరఫరా పథకాన్ని ప్రభుత్వమే చేపట్టాలనీ, అందుకు అనువుగా ఒక నోట్ ప్రభుత్వానికి సమర్పించమనీ డిపార్టుమెంటును ఆదేశించేరు. ఆ పథకం వివరాలు ఒక పత్రికా ప్రకటన ద్వారా వివరించారు కూడానూ. తర్వాత ఏంజరిగిందో మీరంతా ఎరిగిందేగా. మనవాళ్ళంతా బరువుగా వెళ్ళేరు మంత్రిగారి దగ్గరికి. అటుతర్వాత




నోట్ అయితే మంత్రిగారికి వెళ్ళిందిగాని మరి వెనక్కి తిరిగిరాలేదు. ఎప్పటికో ఆరు నెలలకి తిరిగివచ్చింది. అప్పటికే స్టాక్ అంతా బ్లాక్‌లో చెల్లిపోయింది. పైగా ఆ ఆలస్యానికి కారణం ఉద్యోగస్తులేనని అసెంబ్లీలో ప్రకటించేరు"

"ఎప్పుడూ అట్లా జరుగుతుందనేముంది?"

"జరక్కపోతే చావమను. మన స్టాక్స్ మాత్రం మార్కెట్టుకు వదలకుండా దాచేద్దాం...." అని దమ్మీలాల్ అంటునప్పుడే సరిగ్గా ఫోన్ మోగింది.

రూప్‌లాల్ ఎత్తేడు.

"బదరీ...నీకే..."

టెలిఫోన్ చేతికి తీసుకున్న మరుక్షణంలోనే అతని ముఖం మాడిపోయింది. ముచ్చెమట్లు పోసేయి. మనిషి కంపించిపోతున్నాడు.

ఫోన్ పెట్టేసి—

"క్షమించండి..నేనిప్పుడు అర్జంటుగా ఇంటికి వెళ్ళాలి" అన్నాడు బదరీనాథ్.

ఎవరూ అతని మాటలు పట్టించుకున్నట్టు లేదు. వాగ్యుద్ధంలో వున్నారు.

"మీ అంచనా తప్పు..." అంటూ కుర్చీలోంచి లేచేడు రూప్‌లాల్.

"నేను వెళ్లాలి" అంటున్నాడు బదరీనాథ్.

"...ఎంచేతనంటే..." ఒదిలేసిన చోట మళ్ళీ అందుకున్నాడు రూప్‌లాల్— "కంట్రోల్ పెట్టినంత మాత్రాన సరుకు నిశ్చింతగా బ్లాకులో అమ్ముకోగల అవకాశాలున్న రోజులు కావివి. అదురు బెదురుగా ఎంతని అమ్ముతాం? పోనీ, ఏదో చేసి బ్లాక్‌మార్కెటింగ్‌లోకి దిగేమే అనుకో. వీళ్లని ఎవళ్లు నమ్మేరు? ఎప్పుడో ఒకసారి వచ్చి పట్టేసి పేపర్లలో ప్రకటనలు చేసేస్తారు"

"ఎలా పడతారు? ఎందుకు పడ్తారు?? ఇటు పోలీసువాళ్లకి,అటు ప్రభుత్వోద్యోగులకి, ప్రభుత్వానికీ సమర్పించుకుంటూనే వున్నామాయె"

"మీరెన్నయినా సమర్పించుకోండి. పోలీసువాడికి నెల నెలకీ కొన్ని కేసులు కావల్సినట్టే ప్రభుత్వానికీ అప్పుడప్పుడూ పబ్లిసిటీ కావాలి. వీళ్ల సొమ్మేం పోయింది. ఫర్వాలేదు అమ్ముకోండని మనకు చెబుతూనే పట్టేసి పేపర్లలో ప్రకటించుకుంటారు. అభాసుపాలయ్యేది మనం"

"అలా చేయకపోతే వాళ్ళు అభాసుపాలవుతారు మరి! ప్రతి వ్యాపారానికీ కొన్ని చిట్కాలుంటాయి.వాళ్లది మాత్రం వ్యాపారం కాదూ? దేశంలో సోషలిస్టు సమాజాన్ని నెలకొల్పుతామనీ, పేదరికాన్ని తరిమి కొడ్తామనీ డప్పాలు చెప్పుకుని అప్పుడప్పుడు ఇలాంటివైనా చేయకపోతే వాళ్లకి ఓట్లెలా వస్తాయి?"

"అలాంటప్పుడు మనకి లేనిపోని భ్రమలు కల్పించటం ఎందుకు తిరిగి అభాసు పాల్జెయ్యటం ఎందుకు??"

"మీరుకూడా అంత అన్యాయంగా మాట్లాడ్డం ఏం బావుండలేదు. వాళ్లని ఆడిపోసుకోవాలని కాకపోతే మనకి మాత్రం ఏంతక్కువ చేసేరు చెప్పండి. అసలు చేయాల్సిందంతా మనకే చేసేరు"

"ఏం చేసేరు? బేంకులు జాతీయంచేసి మన నెత్తిన చేతులెట్టేరు"

"అలా మాట్లాడకండి. బేంకులు జాతీయం చేయటం వల్ల మనకెంత మేలైసేరో మీకూ తెల్సు? కావాలంటే వడ్డీ వ్యాపారం చేస్తోన్న ధనమల్‌ని అడిగి చూడండి. బేంకుల్లో తక్కువ వడ్డీకి

తెచ్చుకుని లక్షలకు లక్షలు బయట వడ్డీకి తిప్పుతున్నాడు. కడుపులో చీమ కదల కుండా సంపాయిస్తున్నాడు... అంతదాకా ఎందుకు...? ఇంతకుముందు ఎప్పుడైనా ఇంత సులువుగా పెట్టుబడి దొరికిందా? నీ సొమ్మంటూ పైసా పెట్టకుండానే ఇప్పుడు కోట్లలో వ్యాపారం చేయవచ్చు"

"బాబూ... మీరు తర్వాత తీరిగ్గా కొట్టుకుందురుగాని. కొంచెం నా మాట



వినండి. నా భార్య..." అంటూ చెప్ప బోయేడు బదరీనాథ్. దమ్మిడిలాల్ అతని చెయి పట్టుకు కూర్చోబెట్టి మళ్ళీ రూప్ లాల్‌తో వాదనకి దిగేడు.

"పేపర్లు చూసి మోసపోవటం సామాన్యుడి లక్షణం. అసలు పబ్లిసిటీ లక్ష్యం కూడా ఇదే అనుకోండి. కాని మనం భయపడాల్సిన అవసరం మాత్రంలేదు. మనం ఫీల్డులో వున్నాం. అక్కడున్న వాళ్ళంతా మనవాళ్ళు. ఇంతకు ముందైతే వ్యాపారదృష్ట్యా వెనకా ముందూ ఆడే వాడు. ఇప్పుడా భయం లేదు. నష్టం అంటూ ఏదయినావస్తే అది గవర్న

మెంటుదే..."

"ఓహో....గవర్నమెంటుదా? అసలా గవర్నమెంటు ఎక్కడిదో? మళ్ళీ టేక్సుల రూపంలో దాన్ని మన నెత్తినే రుద్దుతారు"

"ఇంత తెలివిమాలినవాడివి వ్యాపారంలో అంత బాగా ఎలా సంపాదిస్తున్నావో అర్థంకాకుండా వుంది. టేక్సు అందరూ కడతారటండీ...కట్టేవాడి మీద పడేపడనీ..."

వీళ్ళ వాదన ఇలానే సాగుతోంది. ఇది పని కాదని వాళ్ళకు చెప్పకుండానే బయటికి వచ్చేసేడు బదరీనాథ్.

లిఫ్టు దిగి కిందికి రాగానే నౌకర్ సలాం కొట్టేడు.

అతని కారు పార్కు చేసేచోటు ఖాళీగా వుంది.

"కారు అమ్మగారికి పంపించేరు'' అని గుర్తుచేసాడు నౌకరు.

"ఆఫీసు కారు?"

''ఇన్కంటేక్సు ఆఫీసర్‌గారి ఫేమిలీ పిక్నిక్‌కు ఎల్లంపంట. తీసుకెళ్లారు''

''ఛీ...వీళ్లాకళ్లు? చేసేదిలేదు పెట్టేది లేదు. పంచదార బస్తాలదగ్గర్నుంచి పెళ్లాలకు కార్ల వరకూ సప్లయిచేయాలి" అని విసుక్కున్నాడు.

''టేక్సీ పిలు...''

టేక్సీ వచ్చింది. ఎక్కికూర్చొన్నాడు.

"మూడు రూపాయలు జాదా ఇవ్వాలి సర్" అన్నాడు టాక్సీవాడు.

అంత దిగుల్లోనూ డబ్బు విలువ మర్చిపోలేదు బదరీనాథ్.

"ఏఁ...ఎందుకు? మీటర్లేదా?" అనడిగేడు.

"మీటర్ జమానా పోయింది సర్! పెట్రోలు ధర బాగా పెరిగిపోయింది"





"అయితే మీటరెందుకు! పీకి పారెయ్యరాదు?''

''అదెట్లా సార్! మీటర్ లేకుండ టేక్సీ నడిపి సమా?"

''అలాంటప్పుడు మీటర్‌కే నడిపించాలి గాడీ. మళ్ళీ జాదా మూడు రూపాయలంటావెందుకు?"

"చెప్పాను కదా సర్! అయినా మీకు తెల్వందేముంది సర్! పెట్రోలు రేటు ఆకాశానికి లేచిపోతంది. పాత రేట్లతో ఎలా బతగ్గలం సర్? అందుకే మినిమం రేటు పెంచమని మా అసోసియేషన్ పోరాడతంది సర్"

ప్రతి పనికిమాలినవాళ్లకీ అసోసియేషన్ అని తిట్టుకున్నాడు.

అసలు సంఘాలు పనికిమాలినవాళ్ల నుంచే పుట్టేయనీ, వాళ్లకే వాటి అవసరం అనీ ఆ హోల్సేల్ మర్చెంట్స్ అసోసియేషన్ అధ్యక్షులయిన ఆయనకు తెలియకపోలేదు.

వెధవ రోజులు.పూర్వం ఇలావుండేదా? నిజాం వర్తకులకు అలివిమాలిన గౌరవం ఇచ్చేవారు. ఏదేనా కంప్లెయింట్ చేస్తే పోలీసులు గెద్దల్లా వాలేవారు. వెధవ ప్రజా ప్రభుత్వం అందర్నీ చెరుగ్గెకలా ఆడేయటం తప్ప మరో పనిలేదు. పోలీసు కంప్లైంటు ఇద్దామా అనే ఆలోచన రాగానే, అదేం ఉపయోగంలేని వృధా ప్రయాస అని గుర్తించి అలా వాపోయేడు.

అతని మౌనం చూసి -

"పోనిమ్మంటారా?" అనడిగాడు టేక్సీ డ్రయివర్.

"మీటర్ కెతే పోనీయ్..."

"లాభంలేదు సార్" 'ఇస్తే అదనంగా ఇవ్వు, లేకుంటే దిగు' అన్నట్టుగా వుంది అతని ధోరణి.

'నేనెవర్నో తెల్సా?' అన్నట్టు చూస్తు

న్నాడు బదరీనాథ్.

'నీవెవడివైనా నాకనవసరం, నా అవసరం పైసలవరకే' అన్నట్టు అతని చూపుల జవాబు.

ఇక లాభంలేదని కిందికి దిగి వచ్చేసేడు సేఠ్.

కిందికి దిగేక మళ్ళీ భార్య గుర్తొచ్చింది.

వాచ్‌మన్‌ని పిల్చి-

"మరో టేక్సీ పిలు" అని తరిమేడు.

అతను వెంటనే తిరిగొచ్చి-

"అందరూ అలానే అడుగుతున్నారు సర్" అన్నాడు.

ఆ టాక్సీ ఇంకా అక్కడే వుంది.

"పోనీ ఒక రూపాయి అదనంగా తీసుకో" అంటూ బేరం మొదలెట్టాడు.

"చూడండి సార్...మేం బతకలేక మిమ్మల్ని అదనంగా అడగటంగాని లేకుంటే మీ మూడు రూపాయల్తో మేం మేడలు కడ్తామా, మిద్దెలు కడతామా సార్! మీలాంటివారే పరిస్థితులు అర్థం చేసుకోపోతే ఎట్లా చెప్పండి"

అదేం సేఠ్జి వ్యాపారపు బుర్రకి ఎక్కినట్టులేదు.

అవతల భార్యకు ఎట్లా వుందో ఏమోననే ఆందోళన. ఇవతలేమో మూడు రూపాయలు వృథాగా పోతున్నాయి. అదీ అతని బాధ. అయినా మరో టాక్సీ వాడు మాత్రం మీటరు రేటుకు వస్తాడనే గ్యారంటీ ఏమిటి? వ్యాపారం విషయం తనకు తెలీసిదా?

"పోనీలే! మరో యాభై పైసలు... ఊ...పోనీయ్" అని మళ్ళీ టాక్సీ ఎక్కి కూర్చున్నాడు.

"ఏమిటండీ ఈ వంకాయల బేరం?" తల తీసేసినట్టయింది బదరీనాథ్‌కు. ఏవిటి వీడు రోడ్డుమీది బికారిగాడితో మాట్లాడినట్టుగా మాట్లాడుతున్నాడు, అనుకున్నాడు. అయినా మూడు రూపాయలు ఇవ్వటానికి అతని అంతరాత్మ అంగీకరించటంలేదు. అలా అయితే చిన్న బడ్డీ వ్యాపారం దగ్గర్నుంచి ఇంత ఎత్తుకు ఎదిగివుండేవాడా?

అందుకే అంతరాత్మ ఎదురుతిరుగుతోంది.

"పోన్లే మనిద్దరికి మధ్యగా రెండు రూపాయిలు" అన్నాడు.

రాజీ కుదిరింది.

డ్రైవర్ స్టీరింగ్ పుచ్చుకున్నాడు.

టాక్సీ వేగంగానే వెడుతోంది.

అయినా-

"పోనీయ్... తొందరగా పోనీయ్" అని తరుంతున్నాడు. అతన్ని ఏడిపించటానికా అన్నట్టు టాక్సీ బంకులోకెళ్ళింది పెట్రోల్ కోసం. అప్పటికే అక్కడ పది కార్లు కాచుక్కూర్చున్నాయి. ఇతనికి అవకాశం ఎంతకీ రాదు.

"మరో బంకులో ప్రయత్నించవచ్చు పద" అన్నాడు బదరీనాథ్.

"లాభం లేదు సార్...ప్రెషర్ బొత్తిగా లేదు"

బదరీనాథ్ ఆత్రుత తారామండలం తాకుతోంది.

డ్రైవరు తన ఆత్రుత కనిపెట్టి మరీ ఆలస్యం చేస్తున్నాడా అనిపిస్తోంది.

ఛీ...ఈ వెధవకి నా బాధ ఏం తెల్సు?

ఆ టాక్సీ దిగేసి, మరోటి పట్టుకుని వెళ్ళిపోదాం అనిపించింది. కాని...మళ్ళీ బేరాలు మొదలెట్టాలి.

వెధవ ప్రభుత్వం. టేక్సీవాళ్ళను కూడా అదుపులో పెట్టలేకపోతోంది. ప్రతివాడూ ఇలా మీటరుకు పైన మూడూ

నాలుగూ అంటూ వుంటే...ఇక ఆ మీటరెందుకు తగలెట్టనా?

ఎంత విసుక్కున్నా ప్రయోజనం లేదు. తన మామూలు పద్ధతిలోనే టేక్సీ మీటర్లు నింపుకుని బయల్దేరింది.

"బాబ్బాబూ....!నా భార్య చావు బతుకుల్లో వుంది. కాస్త తొందరగా పోనీ" కాళ్ళ బేరానికొచ్చేడు.

చిన్నగా నవ్వుకున్నాడు డ్రైవరు.

ఎంత వేగంగా వెళ్ళినా వెధవది ఈ కాస్త దూరం తరగటమేలేదే? లేక తన మనో వేగాన్ని కారు అందుకోలేక పోవటం వల్ల అలా అన్పిస్తోందా??

కారు కొంచెం వేగం తగ్గింది.

వెధవ వేపుకు తింటున్నాడే. తన బాధ వీడికేం తెల్సు? లేకలేక తల్లి కాబోతోంది. సంతానం కోసం తనెంత తపించి పోయేడు. ఆర్జించిన కోట్లన్నీ ఏట్లోకి పోతాయని వాపోయేడు. ఎట్టకేలకు తన ఐశ్వర్యానికి వారసుడంటూ ఒకడు పుట్టబోతున్నాడని అనుకుంటుండే ఈ విపత్తు ఒకటి వచ్చి పడింది. ఇవన్నీ ఈ డ్రైవరు వెధవకి ఏం తెల్సు?

ఆలోచనల్లో వుండగానే ఇంటిముందు కారాగింది.

టాక్సీకి డబ్బులిచ్చి మెట్లెక్కుతుండే గుండెలు దడదడలాడేయి. తూలి పడబోయేడు. ఎలాగో కాళ్ళని కూడదీసు కుని వెళ్ళి భార్య మంచం ముందు కూల బడ్డాడు.

భార్య పరిస్థితి ఏమీ బాగోలేదు. పది నిముషాలకి ఒకసారి కాళ్ళూచేతులూ పూరికే కొట్టుకుంటోంది. ఆమె కదిలి నప్పుడల్లా కడుపులోని పిండం ఏమవు తుందోనని తల్లడిల్లిపోతున్నాడు.

"సాబ్...డ్రైవరుతిరిగొచ్చేడు. డాక్టర్సా బింటి దగ్గర లేడంట'' అని చెప్పింది పోచమ్మ.

మళ్ళీ ఫోన్జేసి చూసేడు ఫేమిలీ డాక్టరుకి. ఇంకా ఇంటికి రాలేదుట. ఇంకా నలుగురైదుగురు డాక్టర్లకి ఫోన్ చేసి చూసేడు. ఒక్కడు మాత్రం చిక్కేడు. అతను వస్తున్నానని చెప్పేక ఫోన్ పెట్టేసేడు. వెంటనే మళ్ళీ మోగింది.

హమ్మయ్య... ఫేమిలీ డాక్టర్ కావచ్చు. ఆయన వస్తే అంతా సవ్యంగా జరిగి పోతుంది అనుకుని,

ఫోన్ ఎత్తేడు. అవతల్నించి దమ్డీ లాల్ కంఠం విన్పిస్తోంది. బదరీనాథ్ ముఖం మళ్ళీ నల్లగా మారిపోయింది.

"బదరీనాథ్! ఈ సమస్య ఏమీ తేల్లేదు. ఉన్న స్టాకంతా మూసెయ్యాలని తీర్మానించేం"

"చావండి..." అని విసుక్కున ఫోన్ పెట్టేసేడు.

అరగంట తర్వాత డాక్టరొచ్చేడు.

"డాక్టర్! ఏమైనా ప్రమాదమా?" ఆతృతగా అడిగేడు బదరీనాథ్.

"తల్లికి ప్రమాదం వుండకపోవచ్చు"

"నేనడిగేది బిడ్డ విషయమే డాక్టర్"

"నేను చెప్పేది కూడా అదే. అనుమానమే"

బదరీనాథ్ ప్రాణాలు పైనే పోయేయి. రాకరాక వచ్చిన గర్భం విచ్చిత్తి కాకుండా కాపాడమని డాక్టరు కాళ్ళమీద పడి వేడుకోవాలనుకున్నాడు. కాని అతనా అవకాశం ఇవ్వకుండానే ఏదో ఇంజక్షనిచ్చి వెళ్ళిపోయేడు.

ఒకగంట తర్వాత బదరీనాథ్ ఫేమిలీ డాక్టరొచ్చేడు. పరీక్ష చేసి—

"ఇక్కడ లాభం లేదు సేట్జీ... నర్సింగ్ హోంకి పంపించండి" అన్నాడు.






## జనవరి 1 : రాత్రి 11.50

భార్యని హాస్పిటల్లోచేర్పి ఇంటికొచ్చేడు బదరీనాథ్. జీవితంలో ఏదో పెద్ద లోటు ఏర్పడినట్టుగా అశాంతిగా పక్కమీద దొర్లుతున్నాడు. అకస్మాత్తుగా జరిగిన ఈ విపత్తుకు కారణం అతనికి అర్థం కాకుండావుంది. డాక్టర్ మాత్రం ఏదైనా షాక్ వల్లగాని లేదా విపరీతమైన భయాందోళనల వల్ల గాని ఈ రకమైన వ్యాధి రావచ్చని అన్నాడు. జరిగిన అసలు విషయం మాత్రం పోచమ్మ ఎక్కడా పొక్కనివ్వలేదు.

అతనికి మనస్తిమితం లేదు. ప్రస్తుతం కావల్సింది కాస్త నిద్ర, తర్వాత మనశ్శాంతి.

ఎలా?

విస్కీ సీసా తీసేడు. గ్లాస్‌లో ఒంపుకుని తాగుతూ కూర్చొన్నాడు.

సీసా సగం ఖాళీ అయింది. దాని ప్రభావం తలలోకి, నరాల్లోకి పాకిపోయింది. ఇక స్వర్గ ద్వారాలకి చేరువగా వున్న సమయంలో ద్వారం దగ్గర ఓ చిన్నది నిలబడి దగ్గింది.

"ఎవరూ?" భారంగా కనురెప్పలు పైకెత్తి అడిగేడు.

"నేనండి..." అంది ఆ అందాల చిన్నది.

"అంతే....?"

"మీ ఇంట్లో కిరాయికి వుంటున్నానండి" అంది.

"మాఇంట్లో ఎవరూ కిరాయికి వుండటంలేదే...ఎవరిచ్చారు నీకు కిరాయికి?"

"ఆశాదేవిగారే ఇచ్చారండి"

తలబరువు కొంచెం తగ్గినట్లు అనిపించింది. కళ్లు మళ్లీ భారంగా పైకెత్తి ద్వారంవైపు చూసేడు. అమ్మాయి అయివుండి, ఇంత అందంగావుండి, తన ఇంట్లోనేవుంటూ, ఇంతకాలం తనదృష్టిని పడకుండా ఎల తప్పించుకుందా అని తనలోతనే ఆశ్చర్యపోయేడు. మరోసారి చూసి 'రంభ' అని చప్పరించేడు. స్వర్గానికి చాలాచేరువలో వున్నాడు అతనాక్షణంలో

"ఆశాగారికి బాగోలేదని పోచమ్మ మీకు ఫోన్జేసిందిగదండీ ఆవిడ ఎలావున్నారిప్పుడు?"

"... ..."

"నిద్రరావటంలేదు. లైటు వెలుగుతుంటే మేల్కొనేవున్నారేమో పలకరించిపోదామని..."

"రండి లోపలికి"

సీసా, గ్లాసూ టీపాయ్ కిందికితోసేసి ఆహ్వానించేడు. అతనిబుర్ర స్పీడుగా పనిచేస్తోంది.

తటపటాయిస్తూనే లోపలికి ఒచ్చిందామె.

"చూడవచ్చాండి? ఏగదిలో ఉన్నారు"

"కూర్చోండి చూద్దురుగాని"

సోఫాలో చతికిలబడింది.

అతను బాత్‌రూంవైపు వెళ్లేడు. ముఖంశుభ్రంగా కడుక్కొని, తువ్వాలుతో ఒత్తుకుంటో లోపలికొచ్చేడు.

"చూస్తారా?"
"అవునండి"
"రండి...."
అతని వెనకనే వెళ్లిందామె. పడకగది ద్వారంముందు నిలబడి-
"అదే....వెళ్లండి..." అన్నాడతను
ఆమె లోపలికి వెళ్లింది.
ఆమె వెనకాలే లోపలికెళ్లి చటుక్కున తలుపువేసి బోల్టుపెట్టేసేడు.
"అదేవిటి?" అంటోందామె అప్పటికే తువ్వాలు అవతలికి విసిరేసి ఆమెమీదికి విరుచుకు పడ్డాడు.
అనూహితమూ, ఆకస్మికమూ అయిన ఆ ప్రమాదానికి ఆమె అలిసిపోయిన మనస్సు తట్టుకోలేక స్పృహను కోల్పోయింది. పడిపోతున్న సమయంలో పట్టుకుని పక్కమీద పారేశాడు.
గంటకో, ఆపై మరో అరగంటకో స్పృహవచ్చింది ఆ అమ్మాయికి. మెత్తటి పరుపు. నీలంరంగు మంద్రకాంతి...పైన తిరుగుతోన్న ఫేన్...అంతా అయోమయంగావుంది. మొలమీద చీరలేదు. ఒంటిమీది జాకెట్టు రొమ్ముల్ని కప్పటంలేదు.
లేవబోయింది...ఒళ్లంతా నొప్పిగా పిరగ్గొట్టినట్టు అన్పించింది. పొట్టలోఎవరో చేయిపెట్టి దేవుతున్నట్టుంది నడుం విరిచేస్తున్నట్టు చిటపటలాడుతోంది.
బిగువుగా నిలుచున్న రొమ్ములు చూసుకుంది. ఎర్రటి, కందిన మచ్చలు కన్పించేయి. ఒళ్లంతా ఏదో అపస్త్రంగా కంపరంగా వుంది.
ప్రస్తుతం తనువున్న స్థితి, స్థలం గుర్తుకువచ్చి, జరిగిన జరగకూడనిదేవిటో తెలివికివచ్చి కెవ్వుమని అరిచింది.




పక్కమీదనుంచి దూకి పరుగు లంఘించుకుంది.



## జనవరి 2: ఉదయం 6 గం

హాస్పిటల్...
కేజువాల్టీ వార్డు క్షతగాత్రులు విడిదిలా వుంది. ఏడుపులూ, మూలుగులూ, ఆర్తనాదాలతో వార్డు ప్రతిధ్వనిస్తోంది. అలికిడిలేని ఆ తెల్లవారుఝామున ఈ నాదాలు మరింత భీతావహంగా విన్పిస్తున్నాయి.
ఆ రాత్రి ఓ ఆర్టీసీ బస్సుకి ప్రమాదం జరిగింది. ప్రయాణీకులు కొందరు చనిపోయారు. చావగా మిగిలినవారిని హాస్పిటలుకు చేర్చేరు. ఆ తర్వాత మరో గంటకు పోలీసులు ఒక అమ్మాయిని ఏక్సిడెంటు కేసంటూ పట్టుకొచ్చేరు. ఆ అమ్మాయి కూడా ఆ వార్డులోనే వుంది.
తెల్ల గౌనుల్లో నర్సులు దేవతల్లా అటూ ఇటూ తిరుగుతూ ప్రమాదగ్రస్థులకు సేవచేస్తున్నారు. డాక్టర్లు తమ శక్తివంచనలేకుండా వారికి ప్రాణాలు పోయటానికి యాతనపడుతున్నారు. అయినా ఆరేడుమంది శవాలుగా మారిపోయేరు. ఆ దశకి దగ్గర్లో వున్నవారు ఇంకా కొందరు వున్నారు.
ప్రమాదం లేదనుకున్నవారిని వారి వైద్య అవసరాలనిబట్టి ఆయా వార్డుల్లోకి

తరలిస్తున్నారు.

పోలీసులు చేర్చిన ఆ అమ్మాయిని స్త్రీల శస్త్ర విభాగానికి తరలించేరు.

సూర్యోదయం అవుతోంది.

ప్రాతఃకాలపు బంగారు లేతకిరణాలు తెల్లటి హాస్పిటలు బుగుజుల్ని స్పృశిస్తోంచే, మంచులోంచి హాస్పిటలు కొత్త సొగసులో దర్శనం ఇస్తోంది.

స్త్రీల వార్డులో ఆ అమ్మాయి అచేతనంగా పడివుంది. ఆమె తలకి తెల్లటి కట్టు వుంది. ఆ కట్టులోంచి పైకి స్రవిస్తోన్న నెత్తురు తెలిమేఘాల్లో సూర్యోదయంలా స్ఫురిస్తోంది. మంచం పక్కన స్టేండుకి నెతురు సీసా వేలాడుతోంది. దాంట్లోంచి జీవం ఆమె నరాల్లోకి పాకుతోంది.

ఉదయకిరణాలు కిటికీలోంచి ఆమెమీద వాలుతున్నాయి. ఆ లే ఎండలో ఆమె ముఖం నెత్తురూ, పాలూ కలిసి గడ్డ కట్టినట్టుంది.

ఉన్నట్టుండి ఆమె పెదాలు కదిలేయి. శబ్దం లేకుండానే పెదాలు పలుకుతున్నాయి.

నైట్ డ్యూటీ చేసిన సిస్టరు డ్యూటీ ముగించుకుని ఇంటికి వెళ్ళబోతోంది. ఆమె కదలటం చూసి...

"డాక్టర్... ఈమెకు స్పృహవస్తోంది" అని చెప్పింది.

డాక్టర్ వచ్చి చూసేడు. ఏదో ఇంజక్షన్ కోసం అడిగేడు.

"అదుగో మాధవి సిస్టర్ వస్తోంది" అంటూనే ఆమె వెళ్ళిపోయింది.

మాధవి ఇంకా వార్డులో కాలు మోపకమునుపే డాక్టరు ఇంజక్షన్ ఆర్డరు చేసేడు.

ఆమె సణుక్కుంటూనే ఇంజక్షన్ సిద్ధం చేసుకొచ్చింది.

"సిష్టర్"

"ఎస్ డాక్టర్"

"మీరే ఇచ్చెయ్యకూడదూ"

"అలాగే" అతని చేతిలోని సిరంజ్ అందుకుంది.

మాధవి పేషెంటు దగ్గరికెళ్ళింది. ఒక చేతి నరంలోంచి నెత్తురు ఎక్కుతోంది. మరో చేయికోసం అవతలి పక్కకెళ్ళింది మాధవి.

పేషెంటు మూలిగింది.

మాధవి అనుకోకుండానే పేషెంటు ముఖంలోకి చూసింది.

"అయ్యో లలితా..." అంది. అనటం కాదు. అరిచినంత పనిచేసింది. ఇంజక్షన్ ఇవ్వటం మర్చిపోయి అలాగే వుండి పోయింది.

"ఏవిటి సిస్టర్... పేషెంటు మీకు తెలుసా?" అనడిగేడు డాక్టర్.

"తెలియటం ఏవిటి డాక్టర్....మేం ప్రాణస్నేహితులం"

"ఎక్కడ వుంటారు?"

"టెలిఫోన్ ఎక్చేంజీలో మానిటరుగా పనిచేస్తోంది. ఇక్కడ ఒక్కతే వుంటోంది"

డాక్టరు ఆమె చేతిలోని సిరంజి పుచ్చుకుని తనే ఇంజక్షనిచ్చేడు.

"ప్రమాదమా డాక్టర్?"

"ఉహుఁ .... ఇప్పుడలాంటిదేంలేదు. తలకు తగిలిందేమో కొంచెం సీరియస్ గానే అనిపించింది. ఇప్పుడు ఆ దశకూడా దాటిపోయినట్టే. ఇంక మరేం ఆందోళన పడాల్సిన అవసరంలేదు"

మళ్ళీ మూలిగింది లలిత.

మాధవి మంచంమీద కూర్చొని ఆమెను పొదివి పట్టుకుంది.







"సిష్టర్!"

"ఎస్ డాక్టర్"

"ఆమెకు ఇక్కడ ఎవరూ లేరా?"

"ఎందుకు లేరు. కాబోయే భర్తే వున్నాడు. కాని ఈమధ్య బెడిసిపోయినట్టుగా చెప్పింది"

"అయినా పిలిపించండి. నా అన్నవాళ్లు ఒక్కరైనా ఇక్కడ వుండటం అవసరం. పైగా కేస్ షీట్‌లో వివరాలన్నీ రాయాలి. ఆపరేషన్ అవసరం అయితే డిక్లరేషన్ మీద సంతకం చేయించాల్సి వుంటుంది"

"ఎందుకు? వాళ్ళ నాన్నగారికే టెలిగ్రాం ఇస్తేపోలా"

"మీకు అడ్రస్ తెలిస్తే అది మరీ మంచిది"

వార్డు బాయ్‌ని బతిమాలి బామాలి టెలిగ్రాం పంపించింది మాధవి.

ఇంజక్షనిచ్చిన పది నిముషాలకు 'అమ్మా' అంటూ మూలిగింది లలిత.

"లల్లీ....లల్లీ....ఇటుచూడు. నేను... నేను మాధవిని లల్లీ..." భుజాలు పట్టుకుని పిల్చింది మాధవి. లలిత

షకలేదు. కన్నెత్తి చూడలేదు.

"సిస్టర్...డోంట్ డిస్టర్బ్ హెర్, షి విల్ఆల్రైట్. నా రూంలో కూర్చుంటాన అవసరం పడితే పిలవండి" అని వెళ్లిపోయాడు డాక్టర్.

పదంటల ప్రాంతంలో భాస్కరంకు ఫోన్‌చేసివిషయం చెప్పింది మాధవి.

"ఆః ఏమైతే నాకెందుకు? ఆమెకూ



నాకూ ఏవిటి సంబంధం?''

అప్పుడే ఆఫీసర్ రూంలోంచి బయటి కొచ్చేడు భాస్కరం.

భాస్కరానికి ఆశించిన ఎకౌంటెంట్ పోస్ట్ మాట ఎలావున్నా చివాట్లు మాత్రం పుష్కలంగానే లభించేయి మేనేజరునించి. ఆ చిరాకులో చెప్పిందేవిటో కూడా విన్పించుకోకుండానే ఫోను పెట్టేసేడు.

"ఛీ .... వెధవ జాతి. మానవత్వం బొత్తిగా లేదు" అని తిట్టుకుంది మాధవి.

మేనేజరు ఆఫీసుకు వచ్చి కూర్చు న్నాడో లేదో ఇంటాయన కంప్లయింట్‌తో హాజరయ్యాడు.

"ఆఫీసుకి ఇల్లు ఇచ్చినందుకు మాకు బాగా బుద్ధిచెప్పారు" అంటూ మొద లెట్టేడు.

''ఏవిటి సర్! ఏం జరిగింది?''

"నిన్న మీ వుద్యోగి ఒకతడు కలం విసిరి మా అమ్మాయిని కొట్టేడు. ఆమె బుగ్గ ఇంత గంటుపడిపోయింది"

"అలాగా. సారీ సర్...ఎవరతను?"

''నాకెలా తెలుస్తుంది?"

"నేనుకనుక్కొని తగిన పనిష్మెంటిస్తా లెండి. జరిగిందానికి కంపెనీ తరఫున నా క్షమాపణలు తెల్పుకుంటున్నాను'' అని ఇంటాయన్ని పంపించేసి సెలవు రోజున ఆఫీసుకొచ్చిందెవరో వాచ్‌మన్‌ని పిల్చి తెలుసుకున్నాడు. వెంటనే భాస్కరానికి కబురెళ్లింది.

జరిగిందంతా చెప్పేడు భాస్కరం.

"ఎకౌంటు పుస్తకాలు పట్టుకురా" అని ఆజ్ఞాపించాడు.

ఎకౌంటు పుస్తకాలు చూసి మేనేజరు మండిపడ్డాడు.

"నిన్ను డిస్మిస్ చేస్తాను'' అని విరుచుకుపడ్డాడు.

భాస్కరం మేనేజరు కాళ్లపడి బతిమాలుకున్నాడు.

ఎస్టాబిష్‌మెంటు క్లర్కుని పిల్చి—

"ఇతన్ని రివర్టుచేసి స్టాచ్‌లో వేయండి'' అని ఆజ్ఞాపించేడు.

ఇది జరిగిన వెంటనే మాధవి నుంచి ఫోన్ వచ్చింది.

లలిత వల్లనే తన భవిష్యత్తంతా పాడయిపోయిందని అతని నమ్మకం.

* * *

మెల్లగా రెప్పలు విప్పిచూసిందిలలిత. పక్కన దేవతలా నిలబడివుంది మాధవి.

''లల్లీ...ఎలావుది లల్లీ?"

లలిత అయోమయంగా చూస్తోంది.

"నేను లల్లీ...మాధవిని"

''నే...నే...ను ఎక్కడున్నాను?" అనడిగింది లలిత.

"హాస్పటల్లోవున్నావు" అని చెప్పి, "నేనెవర్ని...నేనెవర్నో చెప్పగలవాలల్లీ?" అని అడిగింది మాధవి.

మళ్ళీ అదేచూపు.

"నేను మాధవిని లల్లీ ... గుర్తు రావటంలా?"

ఆమె చేయి గట్టిగా పట్టుకుంది లలిత.

"ఇక్కడెందుకున్నాను?"

''మాట్లాడకు పడుకో. అంతా తర్వాత చెబుతాలే"

"ఊహూ....ఇప్పుడే చెప్పాలి"

''ఏం లేదు. ఏక్సిడెంటులో తలకు కొద్దిగా గాయాలు తగిలేయి"

మాధవి చెయ్యి ఒదిలేసి ఆలోచించటం మొదలెట్టింది లలిత.

జరిగిన సంఘటనలన్నీ ఒకొక్కటే గుర్తుకురాసాగేయి.

''నేను ఎందుకు చావలేదు...నేనింకా ఎందుకు చావలేదు? నేను బతక్కూడదు..




చంపెయ్యండి....నన్ను చంపెయ్యండి'' అంటూ కాళ్ళూ చేతులూ కొట్టుకుని ఏడుస్తోంది.

ఇద్దరు ఆయాలొచ్చి ఆమె చేతులు పట్టుకున్నారు.

మాధవి డాక్టర్ని పిల్చుకొచ్చింది.

"మీరలా అల్లరిచేయకూడదు. తలకి బలమైన గాయం తగిలింది. అల్లరిచేస్తే మళ్ళీ అది రేగుతుంది"

''చంపెయ్యండి డాక్టర్ .... నన్ను చంపెయ్యండి'' అని ఏడుస్తోంది లలిత.

"సిస్టర్...''

''యస్ డాక్టర్...."

''మార్ఫియా...."

మాధవి మార్ఫియా ఇంజక్షనిచ్చింది. లలిత మళ్ళీ మత్తులోకి వెళ్ళిపోయింది.

''ఏవిటి సిస్టర్ ఈమె ధోరణి?'' అడిగేడు డాక్టర్.

"ఏదో బాధ వుండివుంటుంది.అందుకే ఎందుకు చచ్చిపోలేదా అని విచారిస్తోంది"

''ఆమెకు బాధలేవిటండీ?"

"అదేవిటి డాక్టర్! బాధలనేవి మనుషుల్ని ఎంచుకుని వస్తాయా ?"

"అదికాదు. ఆమె చిన్నపిల్లకదా!"

"చిన్నపిల్ల కాబట్టే...? వయసులో వున్న ప్రతి ఆడపిల్లకి ఏదో బాధవుంటూనే వుంటుంది"

"ఏదో బాధ!!"

"అవును డాక్టర్! ఇంతమంది మగవాళ్ళున్న ప్రపంచంలో ఆడదానికి బాధలు లేకుండా ఎలావుంటాయి చెప్పండి?"

ఈ ప్రపంచంలో స్త్రీల సకలకష్టాలకి మగవాడే కారణం అన్నట్టు మాట్లాడి,మగజాతిమీద తనకున్న అక్కసంతా వెళ్ళబోసుకుని, సిరంజి చేత్తో పట్టుకుని వెళ్ళిపోయింది మాధవి.

డాక్టర్ నవ్వుకున్నాడు.



## జనవరి 4: ఉదయం, 10.30

టెలిగ్రాం అందుకున్న లలిత నాన్నగారొచ్చేరు.

ఇప్పుడున్న వాళ్ళలో పెద్ద సంతానం లలిత. తను ఉద్యోగవిరమణ చేసేక సంసారం బరువూ బాధ్యత లలితే స్వీకరించి గుట్టుగా నెట్టుకొస్తోంది. వయసు మళ్ళేక కలిగిన సంతానం. అందులోనూ ఆడపిల్లలే పెద్దవాళ్ళు. మగపిల్లలు చేతికి అందిరాలేదు. ఇంకా లలిత పెళ్ళి, వెనక వాళ్ల చదువులూ, తర్వాత పెళ్ళిళ్లూ మిగిలివున్నాయి. తనకేమో వార్ధక్యం ముంచుకొస్తోంది.

లలితను చూడగానే కన్నకడుపు దుఃఖం ఆగిందికాదు. తువ్వాలు ముఖానికి అడ్డుపెట్టుకుని ఏడ్చాడు.

తర్వాత—

"భాస్కరానికి కబురు చెయ్యలేకపోయేవా తల్లీ" అని అడిగేడు మాధవిని.

జరిగిందంతా చెప్పేసింది మాధవి.

వృద్ధుడి మనస్సు పరిపరి విధాలపోయింది. ఇది కూడా చేయి జార్చే సేవా భగవంతుడా అనుకున్నాడు.

భాస్కరం తండ్రీ, తనూ ఆబాల్యమిత్రులు. ఒకేచోట ఇద్దరూ కల్సి చాలా

కాలం పనిచేసేరు. ఆ కుటుంబానికి తను ఆర్థికంగా చాలా సహాయం చేసేడు. భాస్కరం చదువుకూ తను ఎంతగానో తోడ్పడ్డాడు. భాస్కరం పుట్టినప్పుడే అన్నాడు అతని తండ్రి—

'ఒరే... ఇంకో కూతురు గనక నీకు పుడితే,తప్పక నా కోడల్ని చేసుకుంటాను' అని.

అది నిజమే అయింది. లలిత పుట్టింది. వాళ్లిద్దరూ మొగుడూ పెళ్లాలుగానే చిన్నప్పట్నుంచీ ప్రచారంలోకి వచ్చింది. చిన్నవాళ్ల మనస్సుల్లోకూడా అవే భావాలు బీజాలు వేశాయి.

ఈ పదిహేనేళ్లలో వాళ్లు ఆర్థికంగా కొంచెం ఎదిగారు. తను కొంచెం కిందయాక వాళ్లకు చిన్న చూపయిన మాటవాస్తవమే. కాని చిన్నవాళ్ళు మాత్రం మాటమీదే వున్నారు. ఆ సంతోషంతోటే, ఆ సంతృప్తితోటే తను బతుకు నెట్టుకొస్తున్నాడు. ఇప్పుడు ఈ మాట విన్నాక ఆయనకి ఆవేశం ముంచుకొచ్చింది.

"అంత మాటన్నాడా? అందుకే నా బిడ్డ కావాలని కారు కిందపడివుంటుంది" అన్నాడు కంట తడి పెడుతూ.

"కాదు బాబాయ్..ఇది ముందే జరిగింది. ఇది ఏక్సిడెంటే. పోలీసులే 'తీసుకొచ్చి ఇక్కడ అడ్మిట్ చేసేరు. కారు కింద పడిందిట"

"ఆ కారు ఎవర్లో పట్టుకోలేదా?"

"ఎందుకు పట్టుకోరు? పోలీసులు పట్టుకునేవుంటారు"

"ఇంత గట్టిదెబ్బ తగిలిందికదా ... పోలీసులు కేసు రిజిస్టరు చేయకుండా వుంటారంటావా అమ్మాయ్?"

"ఏమో బాబాయ్ తెల్సుకోవాలి"

కేస్ షీట్ మీద అడ్మిషన్ వివరాలన్నీ వున్నాయి. వాటి ఆధారంతో పోలీస్‌స్టేషన్ కెళ్లేడు లలిత తండ్రి.

"ఇన్‌స్పెక్టర్ గారూ! జనవరి ఒకటో తేదీ రాత్రి ఒకమ్మాయి కారు ఏక్సిడెంటులో దెబ్బలు తింటే మీరేకదా ఉస్మానియాలో అడ్మిట్ చేసేరు?" అనడిగేడు ముసలాయన.

"కావచ్చు"

"ఆ కారెవరిది?"

ఆయన ముఖంలోకి తీక్షణంగా చూస్తూ "ఏఁ... ఎందుకు?" అని ఎదురు ప్రశ్న వేసేడు ఇన్‌స్పెక్టరు.

"ఆ అమ్మాయి నా కూతురు. తెల్సుకోవాలనే ఆతృత నాకు వుండదంటారా?"

"తెల్సుకుని ఏం చేస్తావు?"

"ఏం చేయలేం బాబూ... మేమే చేయగలిగితే మీ దగ్గరకెందుకొస్తాం. కనీసం కేసయినా పెట్టారో లేదో తెల్సుకుందామని"

"ఉహూఁ... పెట్టలేదు"

"ఎందుకని?" ఆవేశంగా అడిగేడు.

కాస్సేపు ఆయన ముఖంలోకి చూస్తూ, వుండిపోయేడు ఇన్‌స్పెక్టరు.

"ఎందుకలా చూస్తారు? నా బిడ్డ చావు బతుకుల్లో వుంది. కేసెందుకు పెట్టలేదని అడుగుతున్నాను''

ముసలాయన మాటలకు పోలీసాఫీసర్ దర్పం బుసకొట్టింది.

"ఏవిటా జబర్దస్తీ ? కేసు పెట్టాలో పెట్టకూడదో మాకు తెల్సు ... నువ్వెవడివి అడగటానికి?'' అన్నాడు పోలీసు కంఠంతో.

"నేనెవణ్నో ముందే తమకు మనవి చేసుకున్నాను. ఏక్సిడెంటయింది నా కూతురని ఏకరువు పెడ్తూనే వున్నాను. ఇంకా ఎవడివంటారేమిటండీ?''





"ఇక్కడ ఏమీ చెప్పరు. వెళ్లు అవతలకి వెళ్లకపోతే మెడ పట్టుకు గెంటిస్తా..."

కోపంతో, అవమానంతో బయటికి వచ్చేసాడు ముసలాయన.

* * *

బందరు మిఠాయికి ఎంత పేరుందో కాకినాడ కాజాకు కూడా అంత పేరూ వుంది. వాటి రుచీ, శుచీ వాటికవే సాటి.

అదుగో ... అలాంటి కాజాలు చేయటంలోనే పార్వతి మంచి ప్రావీణ్యం సంపాదించుకుంది. ఆమె చేత్తో చేసిన కాజాలు నోట్లో వేసుకుంటే కమ్మగా కరిగిపోయి తేనె సోనల్లా అలా అలా గొంతులోకి జారిపోతాయని ప్రసిద్ధి. అంచేతనే తెలిసినవాళ్లు కాజాలు తినాలని అనుకున్నప్పుడల్లాపార్వతినిపిల్చిచేయించు కుంటారు. అలాగని ఆమె వంటలక్క కాదు.

ఆమె రామ్మూర్తిగారి సహధర్మ చారిణి.

రామ్మూర్తి ఎవరంటే... ఎరగని వారెవరు- ఎవరో కోర్టుకి ఎప్పుడూ వెళ్లనివారు తప్ప. ఈరోజుల్లో కోర్టు కెక్కని వారెవరు గనక !! న్యాయశాస్త్ర పాండిత్యంలోగాని, న్యాయ నిర్వహణలో గాని ఆయనకు ఆయనే సాటి. నిప్పు తాకితే చురుక్కుమంటుంది. ఆయనకి ఉద్యోగం ఇచ్చిన మంత్రిగారే ఎప్పుడూ దేనికీ ఆయనకు సిఫార్సుచేయరు. అంతటి నికార్సయిన మనిషి ఆయన. ఆ పబ్లిక్ ప్రాసిక్యూటర్ రామ్మూర్తిగారి అర్ధాంగే పార్వతి.

ఆ పార్వతి పరిస్థితి అడకత్తెరలో పోకచెక్కలా వుందిప్పుడు. ఏం చేయాలో తోచక కాలు కాలిన పిల్లిలా తిరుగు తోంది.

మంత్రిగారి ముద్దుల ప్రేయసి పద్మజకి కాజాలంటే మహా మోజు. ఆ మాటకొస్తే తేరగా వచ్చేది ఏదైనా దాని మీద ఆమెకు మోజే. మంత్రిగారి ఇలాకా లోకి వచ్చేక మరీను.

పద్మజకు పార్వతి చేతికాజాల రుచి బాగా తెల్సు.స్కూల్లో చదువుకు నేరోజుల్లో వాళ్ల అమ్మ చేసిన కాజాలు మెచ్చుకుంటూ–

"మళ్ళీ ఎప్పుడు తెస్తావే?" అనడిగేది.

"ఎప్పుడో మళ్ళీ చేసినప్పుడు. రోజూ తెచ్చేందుకు మేమేం మిఠాయి దుకాణం పెట్టేమనుకుంటున్నావా?" అనేది పార్వతి.

"ఎందుకమ్మా అంత కోపం"

అది కోపం కాదని పద్మకి తెలుసు. కాని బులిపించి పనులు చేయించుకునే కళ ఆమెకు చిన్నప్పట్నుంచీ అలవడింది. అదిప్పుడు లలిత కళగా ఆమె స్థాయితో బాటుగా మెరుగులు దిద్దుకుంది.

చిన్నప్పుడు పద్మజ పార్వతి వెంట బడి తిరిగేది. కాని పార్వతి ఎప్పుడూ ఆమెను లెక్క చేసేది కాదు.చిన్నప్పట్నుంచీ పద్మజ తన అందంమీద ఎంతో అభిమానాన్ని పెంచుకుంది. పార్వతి ఆమెకంటె అందమైందని అనలేంగాని ఆమెలో ఒకతరహా ఆకర్షణ వుంది. అభిమానం, స్వోత్కర్ష, మాటకారితనం పార్వతి సొత్తు. అందుకే వారి మిత్ర బృందంలోనివారు పార్వతినే ఎక్కువగా మెచ్చుకునేవారు...అభిమానించేవారు. అది పద్మజకు కంటగింపుగా వుండేది. చేసే దేమీలేక ఆమె కూడా తిరిగి మిగతా అమ్మాయిల్నుంచి వేరుచేయటానికి ప్రయత్నించేది.

స్కూలు వదిలేసేక చాలాకాలం వరకూ పద్మజను చూళ్ళేదు పార్వతి. ఆమె పునర్దర్శనం కూడా చాలా

విచిత్రంగా సంభవించింది.

"ఇవాళ మంత్రిగారు మనింటికి వస్తున్నట్టుసెలవిచ్చారు" అన్నాడు రామ్మూర్తి ఒకరోజున.

"ఆవిడ కూడా వస్తున్నారా?"

"ఆఁ...వస్తున్నారు. కాని ఎప్పుడూ వచ్చే ఆవిడ కాదు"

కాస్సేపు అలా అమాయకంగా రామ్మూర్తి ముఖంలోకి చూస్తూ వుండి పోయింది పార్వతి.

"ఎందుకలా చూస్తావు?"

"మీ మాటలు వింటుంటే ఇక వినడం మానేసి చూడాలనిపిస్తోంది"

"నన్ను చూస్తే ఏముంది? ఎప్పుడూ చూసే అవతారమేగా ఇది. ఆనక ఆ వచ్చే ఆవిణ్ని చూడ్డానికి నీ కళ్ళే చాలవు మరి!"

ఇప్పుడు మరీ ఆశ్చర్యపోయింది పార్వతి.

"ఏమైందండీ ఇవాళ మీకు?"

"ఏవిటి?"

"సరసమాడటం చాతగాదనుకునేదాన్ని మీకు. ఫర్వాలేదు... ఎదిగేరు"

"ఇది సరసంగాదే సతీమణీ... సత్యం... పరమ సత్యం"

"అంటే...?"

"అంటే, మన అమాత్యులవారు మరో ఇల్లు ఏర్పాటు చేసుకున్నారు. ఇప్పుడు వస్తున్నావిడ ఆ చిన్నింటావిడ"

ఆమె తలకి ఇప్పటికిగాని ఎక్కలేదు అసలు సంగతి.

"ఏం మగాళ్ళండీ!" అంది ఎంతో దిగులుగా—ఆ పరిస్థితి తనకు కలగకూడదన్నట్టుగా భర్త ముఖంలోకి చూస్తూ.

"అందరు మగవాళ్లూ అలా వుండరు గాని, కాస్త ఆ వచ్చేవాళ్ళకి ఏమైనా ఏర్పాట్లు చూసేది వుందా లేదా?"

"ఏం చూడమంటారు? ఆయనగారు ఎవరో ఉంపుడుగత్తెను వెంటబెట్టుకు వస్తుంటే.... మనుగుడుపు దంపతుల్లా ఆహ్వానించి పిండివంటలతో ఆతిథ్యం ఇమ్మంటారా?"

"పద్దామరి? ఆడవిడ్డవుకదా?"

"చాల్లెండి...నేనేం చెయ్యను. ఆ వచ్చే వేళకి ఆ పక్కింటికి వెళ్ళిపోతాను"

అలా అన్నదేగాని, ఆ రాబోయే చిన్నింటి ఆవిడను చూడాలనే కుతూహలం లోలోనపెరుగుతూనే వుంది.

అంచేత, పక్కింటి పిన్నిగారింటికి వెళ్ళి దాక్కోలేకపోయింది.

తన తల్లి తర్ఫీదిచ్చిన కాజాలు చేయకుండా వుండలేకపోయింది.

తీరా వచ్చిన ఆ చిన్న ఇంటావిడ తన చిన్నప్పటి చదువుల సహచరి అయి కూర్చునేప్పటికి, ఆమెకు ఇరకాటం వచ్చిపడింది.

ఆదిలక్ష్మిలాంటి ఆ ఇల్లాలి (పెద్దింటావిడ)కి ద్రోహం చేసిందని ఈసడించాలా? చిన్ననాటి స్నేహితురాలని ఆప్యాయంగా ఆహ్వానించి పలకరించాలా??

మొదటిది అతిసహజం అయినా, రెండోది అత్యవసరంగా వచ్చి మీద పడింది పార్వతికి.

రామ్మూర్తిని లోపలికి పిలిచి_

"ఏవండీ... ఆమె ఎవరనుకుంటున్నారు?"

"రామ్మూర్తి రెండో భార్య...."

"చాల్లెండి. అది మీరు చెప్పగా చాలా సార్లు విన్నాగాని, ఆమె చిన్నప్పుడు నా క్లాస్‌మేటండీ... పద్మజ. ఇద్దరం కల్సే హైస్కూల్లో చదువుకున్నాం."





"ఓహో.... మరింకేం..."

"అంటే, అందుకని పొంగిపొమ్మంటున్నారా?"

"అదేగా నువ్విప్పుడు చేస్తున్నది..."

"సరేగాని పదండి..."

ఇద్దరూ ప్రథమ దర్శనంలో ఆశ్చర్య 'పోయినమాట నిజమే. కాని, పలకరింపు దగ్గర మాత్రం మహా ఇబ్బంది పడిపోయింది పార్వతి-'ఒసే పద్మా'అనాలా. లేక 'ఏవండీ పద్మగారూ' అనాలా?

రెండోదే ఎన్నుకుని పలకరించింది.

పద్మజ మాత్రం అలా వద్దని వారించలేదు.

మంత్రిగారి ప్రథమ కళత్రంలాగే హాయిగా, గీరగా ఆమె ఆతిథ్యం స్వీకరించింది.

కాజాలు కడుపునిండా తిన్నది.

'దీనికి కాజాల కుతి తగ్గలేదన్న మాట!' అనుకున్నది పార్వతి.

కానీ 'కాజాలు తింటుంటే మన చిన్ననాటి రోజులు గుర్తొస్తున్నాయి' అంటుందేమో అనుకుంది. అలా అనకపోయేప్పటికి పార్వతి మనస్సు కించిత్తు చిన్నబోయింది. మరింక ఆమెకు ఆ అవకాశం ఇవ్వరాదనుకున్నది. కాని మంత్రిగారికీ, రామ్మూర్తిగారికీ మధ్య, వున్న గాఢానుబంధంవల్ల ఆమెకా అవకాశం చిక్కింది... చిక్కుతూనే వుంది.

ఆమెకు, అంటే మంత్రిగారి చిన్నావిడ పద్మజకు జిహ్వాచాపల్యం పుట్టినప్పుడల్లా పార్వతికి ఫోనులో కబురొస్తుంది. పొడవాటి పడవ కార్లో వచ్చి, కాజాలు తిని, తృప్తిగా వెనక్కిపోతూ వుంటుంది. ఆమెను అందుకు అభినందించాల్సిందే. కాజాలుచేసి ఇంటికి పట్టమ్మని తాఖీదులు పంపలేదు ఏనాడూ!

ఆరోజున కబురొచ్చింది టెలిఫోన్లో కబురు విని రోజంతా ఆ టెలిఫోన్ కని పెట్టిన వెధవని నోరారా తిట్టుకుంది పార్వతి. వాడి పేరేవిటో ఆమెకు తెలీదు గాని, లేకుంటే పేరుపెట్టి మరీ తిట్టేదే.

అయినా వాడెవడో ఫోను కనిపెట్టకపోతేమాత్రం ఆమెకేం మనుషులుకొదవా కబురెట్టడానికి?

చచ్చేంత దిగులుగా వుంది పార్వతికి.

బజార్లో పంచదార చిక్కటంలేదు. తగినంత పంచదార లేకపోతే కాజాకు రుచేం వుంటుంది. వెధవది పంచదార తెద్దాం తెద్దాం అనుకుంటూనే ఆలస్యం చేసింది. ఈలోగా ఏదో మంత్రించినట్టు బజారులో పంచదారంతా ఏమైపోయిందో ఏమో మాయమైపోయింది. పోనీ ఇంట్లో పంచదార లేదని చెప్పేద్దామా అనిపించింది. అమ్మబాబోయ్! ఇంకేమైనా వుందీ? ఆమెకు కోపం రాదూ? అసలు ఆమె అందమైన ముక్కుకి అదే అలంకరణ! ఆవిడగారికి గాని కోపంవస్తే ఇంకేమైనా వుందీ? మంత్రిగారితో చెప్పి శ్రీవారి ఉద్యోగం కాస్తా పీకించెయ్యదూ? వారికి ప్రాక్టీస్‌లేక ఇబ్బందిపడుతున్న రోజుల్లో పిల్చి మరీ ఈ ఉద్యోగంలో పెట్టింది ఆ మారాజేగా! ఇది గనక ఆవిడ మంత్రిగారి చెవిలో వేసిందా అదికాస్తా గోవింద! పిల్లా జెల్లాతో నడివీధిలో పడాలి. పోనీ, ఇంట్లో పంచదార నిండుకుంది కాస్త దుకాణంవాడికి ఫోన్ చెయ్యండి అని ఈయన్తో అందునా, ఏముందిలెండి! ఆయన వ్యవహారం తెలీనిదా?

'ప్రజలకులేని పంచదార మనకెట్లా వస్తుంది?' అనేస్తారు.

మరి ఆయనట్లా కాదే?

'ఏవండీ... పార్వతమ్మ నాకు చప్పిడి

కాజాలు పెట్టిందండీ' అని గుణుస్తూ, ముద్దు ముద్దుగా చెప్పిందనుకోండి.... ఇంకేం వుంది? ఆయనగారు లా సెక్రటరీకి ఫోనెత్తరూ...? ఇలా ఆలోచిస్తూ ఏమీ తోచక కాలుగాలిన పిల్లిలా ఇల్లంతా కలియతిరుగుతోంది.

"ఏంటండమ్మగారూ....ఏదో ఇదిగా వున్నారు?" అనడిగింది పనిమనిషి.

"ఏం చెప్పమంటావే..." అంటూ మొదలెట్టి, తన గోడంతా వెళ్ళబోసుకుంది పార్వతి.

"ఎందుకండమ్మగారూ, తెల్లబెల్లవే కాత్త ముదురుపాకవెట్టి సేసేత్తేపోలా" అని సలహా ఇచ్చింది ఆమె అనుంగు సేవిక.

"చ చ్చే వ్ లే పో! వెధవ సలహా నువ్వూనూ" అని కసిరింది.

"పోన్లెండమ్మగారూ....అంత కోపవెందుకు? నాకు తోసిందేదో సెప్పాను" అంది నర్సమ్మ.

కసురుకుందన్న మాటేగాని, ఆమె ఆశలన్నీ నర్సమ్మమీదనే వున్నాయి.

"ఏవే నర్సమ్మా"

"ఏంటండమ్మగారూ"

"ఓ చిన్న సాయం చేసిపెట్టవే"

"సెప్పండమ్మగారూ"

"ఆ పక్కింట్లో ఏమైనా దొరుకుతుందేమో కొంచెం కనుక్కొరావే!"

"అమ్మో .... పక్కింటికే! నానెల్లనమ్మా... నానెల్లనంటే యెల్లను.ఆ ఇంటిగలోళ్ళ బుల్లోడికే గదండమ్మగారూ మొన్న అయ్యగారు జెయిలెయ్యించారు. అక్కడికెల్లి అడిగానంటే ఇంకేమైనా వుందా ? ముందు నన్ను సంపేత్తారు" అంది నర్సమ్మ - భయాన్ని అభినయిస్తో.

పార్వతికి కూడా ఆ క్షణంలో అలానే అనిపించింది. ఆ సంఘటన ఆమె స్మృతి పొరల్లోంచి సింహాచలం సంపెంగలా గుప్పున గుబాళించింది.

అప్పుడు ఆ రాయబారం కూడా







నర్సమ్మే నడిపింది.

"అమ్మగారూ ....మీరా సాయంజేసి పెద్దే పదేలిత్తారంటండి" అంది నర్సమ్మ.

ఆ కేసేవిటో విన్నాక, చెప్పాలనే కోరిక పోయి, చచ్చినోడికి శిక్షపడ్తేనే బావుండును అనుకుంది పార్వతి.

ఆ ఇంట్లో వాచీ ఒకటి పోయింది. అది పని కుర్రాడు తీసాడని అనుమానం, అనుమానమేగాని తీసేడనేంత నమ్మకంగా చావబాదేరు. కొట్టినప్పుడు చావలేదుగాని, తిండిలేకుండా చీకటికొట్లో వేసి బంధించేక వాడి ప్రాణంకాస్తా గుటుక్కుమంది.

ఆ చచ్చినవాడి తల్లి ఓ పోలీస్ ఇన్స్పెక్టరుగారింట్లో అంట్లావిడగా పన్జేస్తుంది.అంచేత అమ్మగారి సిఫార్సుతో అయ్యగారు కేసు కొంచెం గట్టిగా బిగించేరు.

"ఆయనగారి చేతిలో ఏముంటుందే. అంతా జడ్జీలే చెయ్యాలి" అంది పార్వతి.

"అవునంటండి. ఆ దిగూడ ఆరే సెప్పారండి. అయ్యగారేం సెయనక్కర లేదంటండి. సూసీసూడనట్టూరుకుంటే సేనంటండి" అని ఆయన ఏం చెయ్యాలో కూడా సూచించింది నర్సమ్మ.

పార్వతికి కూడా ప్రలోభం పుట్టిన మాట వాస్తవమే. కాని ధైర్యంచేసి భర్తని అడగలేకపోయింది.

"వాళ్ళలా అడగమన్నార్టండీ" అని మాత్రం అంది.

రామ్మూర్తి ఉగ్రుడయిపోయేడు. కాని పైకి కన్పించకుండా ప్రశాంతంగా అన్నాడు.

"ఇలాంటి విషయాల్లో భార్యలే భర్తల్ని అదుపులో పెట్టాలి పార్వతీ. అలాంటిది నువ్వే...."

"చాలండీ చాలు, ఇంకేమీ అనకండి" అని రెండు చేతులూ జోడించింది పార్వతి.

భర్త అన్న ఆమాత్రం మాటకే ఆమె మండుటెండలో వంగోబెట్టి కొరడాతో బాదినట్టుగా బాధపడిపోయింది.

"తప్పేనండీ...ఇంకెప్పుడూ ఇలాంటి పాడు మాటలు మీతో మాట్లాడను" అని చెంపలు వాయించుకుంది.

ఆ తర్వాత ఆ పక్కింటివాళ్ల బ్బాయికి జైలుశిక్ష పడినట్లుకూడా నర్సమ్మే చెప్పింది.

అది గుర్తుకువచ్చి మరింత సిగ్గుగారి పోయింది పార్వతి. కాని ఎలాగోలా పని జరగాలి.

"మరెలాగే నర్సమ్మా....మా తల్లివి కదూ....నువ్వే ఆదుకోవాలే!"

"సరేలెండి...పేదముండని నాకెందుకు అభిమానం? అల్లనే అడిగిసూత్తా..." అంటూ వెళ్లింది నర్సమ్మ.

పక్కింటివాళ్లు నర్సమ్మను చంపలేదు గాని, పంచదార మాత్రం ఇవ్వలేదు.

ఒట్టిచేతులు ఊపుకొంటూ తిరిగొచ్చింది నర్సమ్మ.

తాడిలోతు నీళ్లలో నేలవైపు దిగిపోతున్నట్టనిపించింది పార్వతికి. ఆమె పరిస్థితి చూసి మనసు అదోలా అయిపోయింది నర్సమ్మకు.

"మా గుడిసెలో కాత్తంత సేకరీనుంది తెమ్మంటారేటి?" అని మునిగిపోతోన్న పార్వతిని కాస్తంత పైకి నెట్టి ఊపిరిపీల్చుకునే పరిస్థితి కల్పించే ప్రయత్నంచేసింది నర్సమ్మ. కాని అంతస్థుల అభిమానం ముంచుకొచ్చింది పార్వతికి. నర్సమ్మని ఆశ్రయించటం తమ పరువుకేమైనా భంగమా? ఇది పద్మజకిగాని తెలిస్తే....? ఇలా చాలాసేపు ఆలోచించింది. మునిగి పోతుంటే అందించిన చేయి ఎవరిదని ఆలోచించే సమయం కాదది. అంతకంటె





పసు ప్రమాదం పార్వతి నెత్తిమీద విరుచుకుపడబోతోంది.

"ఏదో ఒకటిలేవే ... తేచూద్దాం" అంది చివరకు.

సేకరీన్ తెచ్చింది నర్సమ్మ. అదయినా కప్పుకు మించిలేదు. నర్సమ్మ మొగుడు ఏ నల్లబజార్లోనో బస్తాలు మోసి సేకరించిన నల్లసరుకై వుంటుందది.

"తక్కువయిందని బాధపడకండమ్మా సేకరీన్ పంచదారకంటె తీపి" అని ఓదార్చింది నర్సమ్మ.

కాజాలు చేయటం అంటూ ఒకపని ముగిసింది. కాని ఆ పని ఎంత సవ్యంగా జరిగిందనేదే ఆమెబాధ, దిగులు.

పద్మజ అవి తింటుందో లేదో, ఒకవేళ తిన్నా ఏమంటుందో? తమ బతుకంతా ఆ కాజాల రుచిమీదనే ఆధారపడివుంది. భర్త వుద్యోగం తన కాజాలమీదే నిలుపుకొస్తున్నట్టుగా వాపోతోంది పార్వతి.

ఆమెగారు మెచ్చుకుంటుందా సరేసరి. మరో టెరంపాటు ప్రాసెక్యూటర్ పదవి నిలుస్తుంది లేదా టెరం ముగింపు కాక మునుపే...

ఆ పైన ఆలోచించలేకపోయింది పార్వతి.

ఇంతలో కారు శబ్దం విన్పించింది.

పరుగెత్తికెళ్లి కిటికీ తెర తొలగించి చూసింది.

అదుగో ఒచ్చేసింది,

పుష్పక విమానం లాంటి పాలపిట్ట రంగు పడవ కారొకటి ఆమె ఇంటిముందు ఆగి ఆ దారినంతా కప్పేసింది.

అదేవిటి, ఇంకెవరో....ఆవిడ కూడా వస్తోంది.

తలుపు తీసి సాదరంగా ఆహ్వానించింది పార్వతి. అతిలోక సుందరిననుకునే ఆ అమాత్యప్రియ అప్పుడే మార్కెట్‌లోకి దిగిన కొత్తరకం చీరని బొడ్డుకింద కట్టుకుని, ఎత్తు మడమల చెప్పులు వేసుకుని అతి నవీనంగా నడిచివచ్చింది.

పార్వతిని చూసి లిప్స్టిక్ ఎర్రటి పెదాల మధ్యనించి తెల్లగా, సన్నగా నవ్వింది పద్మజ.

పార్వతి గుండెలు ప్రెషర్ కుక్కర్లోని కూర ముక్కల్లా కుతకుతలాడుతున్నాయి.

పద్మజ వెనకనే ఆమె నేస్తం ఆమె కంటే నవీనంగా కన్పించాలన్నట్టు నడిచి వచ్చింది. ఆమె ముఖం మీద సెంటీమీటర్ మందం మేకప్ వుంది. కళ్లకి తీర్చిదిద్దిన కాటుక వుంది. అయినా ఆమె వయస్సుని దాచలేని చర్మం అవస్థ కన్పడుతూనే ఉంది.

"ఈమె నా క్లబ్ ఫ్రెండ్ శ్రీమతి సుందరీ ప్రతాప్. ఈవాళ కాజాం ప్రసక్తి వచ్చింది. మా రసగుల్లాలకంటే బావుంటాయా అంది సుందరి. చూద్దువు గాని రమ్మని లాక్కొచ్చేను" అని ఆ సుందరిని పార్వతికి పరిచయం చేసింది పద్మజ.

అది ఆమెను పరిచయం చేయటమో లేక తన మిత్రురాల్ని తేవటంలోని అంతర్యాన్ని తెలియజేయటమో తెల్సుకోలేని అర్భకురాలు పార్వతి. అమాయకంగా ఆవిడగారి ముఖంలోకి చూస్తూ వుండిపోయింది.

సుందరి నిజంగా సుందరి కాదు. ముఖం మీద ముడతలు వేళ్లాడుతున్నాయి. కళ్లకింది నల్లటి ఛాయలు వార్ధక్యాన్ని స్ఫురింపజేస్తున్నాయి. చెవులకి గాజులంతటి రింగులు. అవి కదిలేలా ముఖం ఆడిస్తో మాట్లాడుతోంది.

"భర్త ఇక్కడ పెద్ద మిల్టరీ ఆఫీసరు.

అన్ని వైభవాలూ వున్నాయి" స్నేహితురాలి గురించి మరో మెట్టు పైకెళ్ళి చెప్పింది పద్మజ.

పెదాల్ని చెంపలదాకా సాగదీసి నవ్వి అప్రూవ్ చేసింది సుందరి.

ఆ సుందరి సుందర మందహాసం చూ శేకనో లేక భయం చేతనో అసలామె వంక చూడ్డమే మానుకుంది పార్వతి.

ఆ రోజంతా ఎంతో అవస్థపడి సర్దింది ఇల్లు. అయినా ఆ వాతావరణాన్ని ఎంతో ఈసడింపుగా పరిశీలిస్తూ కూర్చొన్నారు అతిథులిద్దరూ.

నర్సమ్మ తెల్లని గ్లాసుతో నీళ్ళు తెచ్చి టీపాయ్ మీద పెట్టింది. పార్వతి లోనికెళ్ళి కాజాలు తీసుకొచ్చింది. వాటిని టీపాయ్ మీద పెట్టేక ఆమె రెండు చేతులూ అదిరే గుండెలమీదికెళ్ళేయి.

కాజాలు కళ్ళముందున్నా, వాళ్ళు చాలాసేపు కబుర్లే మేసేరు. వెంటనే తినటం మొదలుపెడితే కస్తూరి బైట పడిపోతుందనో లేక అలా చేయటం పెద్దవాళ్ళ అలవాటో మరి!

కాళ్ళు సర్దుకుంటున్నట్లు చీర పైకి లాగి తన ఖరీదైన చెప్పులు ప్రదర్శించింది పద్మజ.

మాట్లాడుతూ మాట్లాడుతూనే అనవసరంగా ప్రతిసారీ గుండెలమీద చేయి వేసుకుని తన కొత్తరకం లాకెట్టును ప్రదర్శించింది సుందరి.

వీళ్ళంత కష్టపడుతున్నా, దేన్నీ పట్టించుకోలేదు పార్వతి. ఆమె పట్టించుకున్నదల్లా ఛాతీని సగం కూడా కప్పలేని సుందరి జాకెట్టూ, ఆచ్ఛాదనం లేని భుజాలు, అప్పుడప్పుడూ దర్శనమిచ్చే చంకల్లో పొదరూను. పార్వతికి అసహ్యం, జుగుప్స కలిగి డోకు వస్తుందేమోనని పించింది.

అతిథుల కబుర్లు చాలా పెద్ద విషయాల మీదికి పోతున్నాయి.

ఇటీవలి తమ అమెరికా ప్రయాణం గురించీ, అక్కడ తాము ఎంతగా ఎంజాయ్ చేసిందీ చెబుతోంది సుందరి.

"ఓహ్... ఏం దేశం! భూతల స్వర్గం. సైన్సు అక్కడి ప్రజలకు దాసోహమంటోంది. రియల్లీ ఇటీజ్ ప్లేస్ ఫర్ హనీమూన్. పిల్లల్ని తీసుకెళ్ళలేదేమో....చాలా బాగా ఎంజాయ్ చేశాం"

పద్మజ వూరుకుంటుందా?

"ఇంగ్లండులాగే అమెరికా కూడా ఒకప్పుడు గొప్ప దేశమే కావచ్చు. కాని ఇప్పుడు ప్రపంచంలో అగ్రశ్రేణి దేశం రష్యా. మాకు రష్యా రమ్మని ఆహ్వానం వచ్చింది. కాని రాష్ట్ర రాజకీయాల్లో మార్పులు రావచ్చేమోనని మావారు వెళ్ళలేదు. బహుశా వారికి ముఖ్యమంత్రిపదవి రావచ్చు" అంది, ఆయనకు ఈవిడతప్ప తీసుకెళ్ళదగ్గవారు మరెవ్వరూ లేనట్టు.

"మావారికి ఫీల్డ్ మార్షల్ ఇవ్వాలని రాష్ట్రపతి సిఫార్సు చేశారు. కాని ఆ రేంకు ఇండియాలో లేదు. ప్రవేశపెట్టాలని చూస్తున్నారు" అంటూ సుందరి చెబుతోంది.

అలా చెప్పుకుంటూనే ముందున్న ప్లేట్లలోనించి చెరో కాజా చేతిలోకి తీసుకున్నారు.

పార్వతి గుండెలు దడదడలాడేయి.

కాజా నోట్లో పెట్టుకోగానే పద్మజ ముఖం వింతగా మారిపోయింది.

తను నోట్లో పెట్టుకున్నది కాజానా లేక పాత చెప్పు చర్మమా అనుకుంది పద్మజ.

ఆమె స్నేహితురాలు ఒక ముక్క





కొరికి బిగ్గరగా నవ్వి—

"ఓహ్..వండర్‌ఫుల్!వెధవ రసగుల్లా ఎందుకు? దీనిముందు మరే ఉత్తరదేశపు మిఠాయీ పనికిరాదు. అబ్బ! ఇంత తీపి భరించటం ఎట్లా? ఇంక, తిన్లేను తల్లీ" అంది ప్లేట్లోపడేసి పద్మజ ముఖంలోకి చూస్తూ.

దాని అర్థం ఏమిటో పద్మజకి తెల్సు.

అతిథి దేవతలిద్దరూ అదోలా పార్వతి ముఖంలోకి చూసేరు.

పార్వతి కళ్లలో నీళ్లునిండుతున్నాయి.

వెర్రిగా నవ్వింది.

బదులుగా పద్మజ కూడా నవ్వింది. ఆ నవ్వునిండా విషంవుంది.

"పంచదార ధర నానాటికీ ఆకాశం అంటుతోందిమరి..." అంది.

"అవును. షావుకార్లంతా సరుకు దాచేశారుట. కొందామంటే బ్లాకులో కూడా దొరకటంలేదు"

"దీనికంతటికీ కారణం ఎవరంటా?"

"ప్రభుత్వమే"

"నోనో....షావుకార్లు సరుకుదాచేస్తే ప్రభుత్వం ఏంచేస్తుంది?"

"మరి ప్రభుత్వం చేయకపోతే ఇంకెవరు చేస్తారు? ఈ మంత్రులంతా ఉన్నదెందుకు? సరుకు బయటికి తీయించి అందరికీ అందుబాటులో వుండేట్టు చూడద్దూ?"

ప్రభుత్వం అన్నంతవరకూ బాగానే వుంది మంత్రులనేప్పటికి తల తీసేసినట్టయింది పద్మజకు.

"అది మంత్రుల పని కాదు. ఉద్యోగులపని"

"ఉద్యోగులేంచేస్తారు? మంత్రులు షావుకార్లదగ్గర లక్షలు మేసేసి ఆఫీసర్లకి అడ్డు తగుల్తుంటే?"

"చాలా అవమానకరంగా మాట్లాడుతున్నావు సుందరీ. నా భర్తమంత్రి అనే మాట మర్చిపోయావు"

"తెల్సు గనుకనే మాట్లాడుతున్నాను"

"షటప్...నువ్వెవరితో మాట్లాడుతున్నావో తెల్సుకో. మావారు తల్చుకుంటే..."

"దాల్లే...వెధవకోతలూ నువ్వూనూ. ఆయనేదో పెళ్లాడిన మొగుడిలా మాట్లాడేస్తున్నావు! కాజాలకోతలేగాఇవి! మంత్రిట మంత్రి!! వెధవ మంత్రి పదవి ఇవాళ వుంటుంది రేపు వూడుతుంది. మా ఆయన ఆర్మీ ఆఫీసర్ తెల్సా?"

ఇలా మాట మీద మాట పెరిగింది. నువ్వు నోర్మూసుకో అంటే నువ్వు నోర్మూసుకోఅని ఇద్దరూ అసలువిషయం ఒదిలేసి వ్యక్తిగత మైనతగూలాటకి దిగేరు.

పార్వతి ఒణికిపోయింది.

నర్సమ్మ మూలగా నిలబడి ముసిముసి నవ్వులు నవ్వుకుంటోంది.

పద్మజగారి ప్రియతమ నేస్తం కోపంగా టేక్సీ చేసుకుని వెళ్లిపోయింది.

ఎంత అవమానం?

ఎవరికి? పార్వతికికాదు... పద్మజకు.

పద్మజ లేచి నుంచుంది.

"అప్పుడే వెళ్లిపోతారా? కాస్త కాఫీ తాగండి" అనడిగింది పార్వతి బతిమాలుతోన్న ధోరణిలో.

"తిన్న తీపికి కాఫీ తట్టుకోగలదా?" అంది వెటకారంగా.

"క్షమించండి పంచదార దొరకలేదు"

"నీకు పంచదార దొరక్కపోవటం కాదు. నాకు బుద్ధిలేక ఇక్కడికి వచ్చేను. అంతస్తులమాట మరిచి ఇక్కడికి వచ్చినందుకు నాకు తగినశాస్తే చేశావు. నువు అవమానించటమేగాక నా ఫ్రెండ్ చేత



కూడా తిట్టించేవు"

ఇందులో తన తప్పిదం ఏవిటో పార్వతికి బొత్తిగా అర్థంకాలేదు.

"కోప్పడకండి...కొంచెం కాఫీ తాగి మరీ వెళ్లండి"

"అయాంసారీ...ఇవాళ నాకు ఎంగేజ్ మెంటుంది. అర్జంటుగా వెళ్లాలి" అంటూనే వెళ్లిపోయింది పద్మజ.

ఆమె వెళ్లగానే కిసుక్కున నవ్వింది నర్సమ్మ.

పార్వతి అసలే దిగుల్లోవుంది.

"ఎందుకే నవ్వుతావ్ ? నీకు నవ్వులాటగా వుందా?"

"అల్లనిసూత్తే సరకస్సులో గుర్రాలు గురుతొచ్చాయి అమ్మగారూ"

"చాలే...నోర్మూసుకో. నన్ను చూస్తే కోతిలా అనిపించింది కాబోలు"

"ఎందుకమ్మా అంత కోపవూ"

"ఇంక అపు వెధవ సరసవూ... నువ్వూను" అని లోనికెళ్లిపోయింది దిగులుగా.

"పాపం" అనుకుంది నర్సమ్మ.

ఆమెను చూస్తే ఒకవైపు జాలీ, మరోవైపు అసహ్యమూ వేసోంది నర్సమ్మకు.



**జనవరి 4: సాయంత్రం-4గం**

ఖాసింఖాన్ ఇల్లు సందడిగా వుంది. సాయంత్రం జరగబోయే కూతురి పెళ్లిచూపుల తతంగానికి ఉదయంనించే హడావుడి ప్రారంభించేడు ఖాసింఖాన్.

ఆరోజు సెలవుదినం కాకపోవటం కొంచెం ఇబ్బందిగానే వుంది. మేడపైని ఆఫీసులో పనిచేసే ఉద్యోగులంతా కింద జరగబోయే కర్మకాండమీదే దృష్టి నిలిపి వున్నారు.

ఇంటికి పెద్దకూతురి పెళ్లి. పెళ్లిమాట ఎలావున్నా పెళ్లిచూపులే పెళ్లంత సందడిగా సాగుతున్నాయి.

సాయంత్రం జరగబోయే ఈ తంతుకి బంధువులంతా ఉదయంనించే రావటం ప్రారంభించేరు. మేడమెట్లమీంచి వచ్చేపోయే బంధుజనం కన్పించకుండా వుండేందుకు పెద్ద పరదా ఒకటి కట్టించి జాగ్రత్తపడ్డాడు ఖాసింఖాన్.

ఈ తతంగం నలభైరోజుల క్రితమే జరగాల్సింది. కాని పెళ్లికొడుకు తరపు బంధువుల తాలూకు మనిషి ఎవరో మరణించటం వల్ల ఇంతవరకూ వాయిదా పడింది.

సరిగ్గా సాయంత్రం నాలుగ్గంటలకే ఎంబాసిడర్ కారొకటి వచ్చి శాంతినగర్ పార్కు ముందున్న ఆ ఇంటిముందు ఆగింది. ఇంచుమించు పదిమంది స్త్రీలు కార్లోంచి దిగేరు. అందరి మెడలనిండా బంగారంవుంది. అందరూ కాకపోయినా కొందరి పెదాలమీదైనా లిప్స్టిక్ అరుణిమ మెరుస్తోంది. ఇంచుమించు అందరు కట్టుకున్న బట్టలూ తళుక్కుమంటున్నాయి. ఎవరికీ బురఖాలు లేకపోవటం వాళ్ల ఆధునికతని చాటుతోంది.

ఇద్దరు తప్ప అందరూ యువతులే. ఆ తక్కిన ఇద్దర్లో ఒకామె పెళ్లికొడుకు తల్లి కావచ్చు. రెండో ఆమె బామ్మగాని, అలాంటి దూరపుబంధువుగాని అయి

వుండాలి. వాళ్ళతలలు రెండూపండి తెలుపు నించి ఎరుపుకు మారేయి. వాళ్ళిద్దర్నీ నడిపించుకుని మరో ఇద్దరు లోపలికి తీసుకెళ్ళేరు.

పిల్లదాన్ని చూడ్డం ఒక్కటే ఆరోజు కార్యక్రమం. పిల్లనచ్చిందీ లేందీ తేల్చాల్సింది ఆ వచ్చినవాళ్లు. వాళ్లకు నచ్చితే వరుడికి నచ్చినట్టే. తర్వాత కట్నాలూ కనుకలూ మగవాళ్ళే మాట్లాడుకుంటారు.

పిల్లతల్లి ఉదయంనించీ కూతుర్ని ఎంత బాగా తయారుచేయాలా అని తాపత్రయ పడుతోంది. అలాగని పిల్ల అందమైంది కాదనికాదు. నాలుగురోజుల్రకితం జరిగిన ఒక అవాంఛనీయ సంఘటన ద్వారా పెళ్లి కావల్సిన పిల్ల బుగ్గమీద గంటుపడింది. అది కనపడకుండా చేయటంలోనే ఆమె శ్రమనీ, యుక్తినీ ఖర్చు పెడుతోంది.

అమ్మాయిని తీసుకొచ్చి ముందు కూర్చోబెట్టేరు.

"పిల్ల పుత్తడిబొమ్మలా వుంది" అంది ఒక బంధువు.

"జోడు బాగానే వుంటుంది" అని వంత పాడింది మరో ఇల్లాలు.

ఈ మాటలు విని సంబరపడిపోయింది పిల్లదాని తల్లి.

"ఒక్కసారి ఇటురా తల్లీ" అని పిల్చింది ఎర్రజుట్టు ముసలమ్మ.

సిగ్గుపడుతూనే వెళ్లింది అమ్మాయి.

ఒక్కసారి హత్తుకుని–

"ఫర్దా తీయి అమ్మా..." అంది తలమీంచి వేసిన మేలి ముసుగును వుద్దేశించి.

ఎంత ఒద్దనుకున్నా తీయక తప్పింది కాదు పిల్లదాని తల్లికి.

ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకున్నది ముసలమ్మ.

బుగ్గమీది గంటు గరుగ్గా తగిలింది చేతికి.

"ఏంటమ్మా ఇది?"

అమ్మాయి మాట్లాడకుండా వెనక్కి జరిగింది. తల్లి తబ్బిబ్బయింది.

"ఏంలేదు...ఏదో చిన్న దెబ్బ" అంది.

"బుగ్గమీద దెబ్బేవిటమ్మా..." అని సాగదీసింది అవ్వ.

"పైనించి కలం పడి గుచ్చుకుంది" అంది పిల్ల అమ్మమ్మ.

తల్లి ప్రాణాలు పైనే పోయేయి.

"పైనించి కలంపడటం ఏవిటి?" అడిగిందో అమ్మాయి.

ఈలోగా అమ్మాయిని లోపలికి తీసుకుపోయింది తల్లి.

"పైన ఆఫీసువుందికదా... ఒక ఆకతాయి కుర్రాడు కిటికీలోంచి కలంబైటికి విసరేడు. అది అమ్మాయి బుగ్గకు తగిలింది" అని చెప్పింది అమాయకురాలు పెళ్ళికూతురు అమ్మమ్మ.

అతిథులు ఒకరి మొహాలొకరు తేరిపార జూసుకున్నారు. అందరి ముఖాల్లోనూ ఒకటే భావం.

అనుమానం.

ఒకావిడ ఇద్దర్ని అవతలిగా తీసుకెళ్లి "నాకేదో అనుమానంగా వుంది" అన్నది.

"నాకూ అలాగేవుంది. ఆ తల్లి కంగారేవిటి, ఈ పిల్ల అడగ్గానే పారిపోవటమేవిటి?"

"అసలు అబ్బాయి పైనించి కలం విసిరే ఆవసరం ఏం వచ్చింది?"

"అవును ఏదోగొడవ వున్నట్టేవుంది"

ఆ తర్వాత అబ్బాయిఅమ్మకు పిలుపు వెళ్ళింది.

వాళ్ల అసంతృప్తినేఆమెచెవిలోవేశారు.

అక్కడికక్కడే నిర్ణయం జరిగి పోయింది.

అందరూవచ్చి మామూలుగానేకూర్చొన్నారు.

అవతలి గదిలో ఖాసింఖాన్ భార్యతో మాట్లాడుతున్నాడు.

''అనుకున్నదంతా జరిగిపోయింది'' అని వాపోయింది భార్య.

''ఏవిటి... ఏమైంది?''

''అమ్మాయి బుగ్గమీదగాయం గురించి అడిగారు. అంతా చెప్పేసింది అమ్మ''

''అందుకే ఆమెను అక్కడకు వెళ్ళనివ్వవద్దన్నది'' అని భార్య మీద కొప్పడ్డాడు ఖాసింఖాన్.

ఇంతలో కబురొచ్చింది.

అంతా లేచి నిలబడి వున్నారు.

"అదేమిటి? అంతా నిలబడ్డారు. ఇంకా ఏమీ ఫలహారమైనా పుచ్చుకోలేదు" అనడిగింది.

"లేదు....మాకు అర్జంటు పనివుంది" అన్నది కావల్సిన వియ్యపురాలు.

"అమ్మాయి నచ్చిందా?"

"తర్వాత తెలియజేస్తాం" అని ఒకొక్కరే బైటికి నడిచేరు.

ఫలహారాలు తీసుకోకపోవటమే అమ్మాయి నచ్చనట్టు లెక్క.

అయిపోయింది, అనుకున్నది ఆ ఆడపిల్ల తల్లి.

ఇది వీళ్ళతోనే ఆగిపోదు. ఆ నోటా

ఆ నోటా అందరికీ తెలిస్తే ఇక దీనికి పెళ్ళెలా అవుతుంది, అని ఆజ్యంపోసింది ఒక దూరపు బంధువు.

ఇక ఆ తండ్రి మాట చెప్పనే అక్క



ర్లేదు.

కాలుగాలిన పిల్లిలా కల్దిరిగేడు.

పైకెళ్ళి భాస్కరం పీక పిసికి చంపేయాలనుకున్నాడు.

మెట్ల పైకి పరుగెత్తేడు కూడాను.

కాని, అప్పటికే ఆ ఆఫీసు మూసేశారు.



## జనవరి 4 : సాయంత్రం 5.20

ఒక సువిశాల ప్రాంగణంలో... విలాస మందిరంలా రూపొందించిన ఒక విశాల భవంతి.

ఒక గంట్రకితం వరకూ అక్కడ కొత్త థియేటర్ని పాత సిన్మాతార ప్రారంభోత్సవం చేస్తున్నంత సందడిగా వుంది. కరువుకాలంలో రేషన్ కొట్టులా రద్దీగా వుంది. మంత్రిగారు తమకు దొరికిన తీరిక సమయాన్ని ఎక్కువగా అక్కడే గడుపుతూ వుంటారు. అంచేత అక్కడ చాలా సందడిగా వుంటుంది.

ఇప్పుడు–

పేసింజర్లు దిగిపోయిన ఖాళీ కంపార్టు మెంటులా వుంది. మగ పెళ్ళివారు పోట్లాడి వెళ్ళిపోయిన ఆడపెళ్ళివారి ఇల్లులా వుంది.

మంత్రిగారు విదేశీ సిగరెట్టు ఒకటి వెలిగించుకుని లాన్‌లో తీరిగ్గా కూచ్చు న్నారు.6 గంటలకి ఒక కాన్ఫరెన్సుకెళ్లాల్సి వుంది. అంచేత అందర్నీ పంపించేసి ఇష్టంలేని పెళ్ళి చెడిపోయినంత ఆనందంగా వున్నారాయన.

మంత్రిగారి ముందునించే లోపలికెళు తోంది వారి ప్రియురాలు పద్మజ. తనని తప్పించుకుని వెళ్తుందంటే అదేదో పెద్ద విషయమే. అదంతా ఉత్త నటనేనని, నటనా సూత్రధారుడు ఆ రాజకీయుడికి తెలియనిది కాదు. అందుకే సిగరెట్టుని కౌగిలించుకునే సన్నగా నవ్వేయి పెదాలు.

"వాట్సదమేటర్ డాలింగ్?" అన్నారు ముద్దుగా.

ముద్దొచ్చినప్పుడు ఇంగ్లీష్‌వాడి భాషే సరసంగా వుంటుంది కాబోలు! ఆ మాట కొస్తే అసలు తిట్టినట్టే అనిపించకుండా తిట్టుకోడానిక్కూడా ఆ భాష సరదాగానే వుంటుంది. అందుకనే అమాత్యులవారు ఆ భాషని ఆశ్రయించివుంటారు. లేదా, యూనిఫార్మిటీ లేని తెలుగుదేశపు మాండ లికాల్ని వినివిని విసుగెత్తి అందులోకి దూకి వుండొచ్చు. ఎంచేతనంటే అప్పటి వరకూ ఆంధ్రదేశంలో నలుమూలల్నుంచీ వచ్చిన ప్రతినిధుల్తో మాట్లాడివున్నారు.

మంత్రిగారి ఆ ముద్దు భాషని విని మొద్దులా క్షణం నిలబడింది ముద్దుల ప్రేయసి.

మంత్రిగారు లేచి వెళ్ళి ఆవిడ భుజ మీద దక్షిణ నాయకుడిలా శృంగారం చేయి వేసేడు.

"హూ...నన్ను తాక్కండి..." ని హూంకరించింది అసలైన సినీ సత్యభామ వారసురాల్లా.

ఎందుకైనా మంచిదని మం॥గారు ఒక అడుగు వెనక్కి వేశారు. బహుశా ఆ క్షణంలో ఆయనకి 'తాలసోసెం తాంగి' అన్న పద్యపాదం జ్ఞాపకొచ్చి వుంటుంది.





"ఏమైంది డార్లింగ్...?" అనడిగాడు.

"ఏమిటా పిలుపు...నాకు పేరుంది" అంది ఆ రోషనారి.

"అవునూ .... నీకూ పేరుందికదూ! అవున్లే. కుక్కలూ, పిల్లులూ పేర్లు పెట్టుకుంటున్న ఈరోజుల్లో ...నువ్వు... అందులోనూ అందమైన నువ్వు .... అంతకంటే అందమైన పద్మజ అనే పేరు పెట్టుకుంటే... ప్చ్... నేనలా పిలవటం ఎంతమాత్రం బాగోలేదు. అవునా?"

ఆమె అందం ప్రసక్తి రావటం కొంత మనశ్శాంతి.

"నేను చెప్పుదెబ్బలు తినొస్తే మీకు పరిహాసంగా వుంది" అంది కొంచెం తగ్గి.

"ఏమిటి...నిన్ను... చెప్పుతో కొట్టడమే... అమ్మ... ఎవరు సత్యా ఆ శిశుపాలుడు"

"శిశుపాలుడు కాదు....శనీశ్వరుడు"

"అబ్బా... ఎవడో సెలవియ్యమంటుంటే...."

"ఏం చేస్తారేంటి?"

"ఏం చేయాలేమిటి...? అవునూ.... ఏంచేస్తాను? సరే...వచ్చే ఎలక్షన్లకి ఓటడగను...సరా?"

"ఊ ... చాల్లెండి సరసం"

"ఇంతకీ చెప్పేవు కావు"

"ఇంకెవరూ ....మీ స్నేహితుడు. పబ్లిక్ ప్రాసిక్యూటర్" అని దుఃఖంలో వున్నట్లు కళ్లు నలుపుకొని, "అతన్ని డిస్మిస్ చేయించండి" అని అర్థించింది.

ఫలానా అని వినగానే అది ఎంత అసత్యమైన అభియోగమో అర్థమైపోయింది మంత్రిగారికి.

"ఏవిటి... మా రావుడు నిన్ను చెప్పుతో కొట్టాడా?"

"రావుడు కాకపోతే వాడి పెళ్లాం"

"పార్వతి కొట్టిందా? అందులోనూ చెప్పుతో కొట్టిందా?"

"కొడుతుందా... హుఁ. దాని తాహతెంతండీ నన్ను కొట్టడానికి? అసలు దానికి చెప్పుందా అని నన్ను కొట్టడానికి?"

"మరేవిటి నువ్వనేది?" విసిగి కొంచెం సీరియస్‌గానే అడిగేడు.

"కొట్టినా బాగానే వుండేది. అంతకంటె ఘోరమైన పని చేసింది. చప్పిడి కాజాలు పెట్టి నా ఫ్రెండు దగ్గర పరువంతా పీకి పోగెట్టింది"

"ఎవరా ఫ్రెండు?" అని ప్రశ్నించి జవాబు రాకముందే అదెవరో అర్థమైనట్టు, "ఓ... ఆ ముసలి సుందరా?"

"దానిమట్టుకది నన్నెంత చులకన చేసి మాట్లాడిందండీ. మిమ్మల్ని కూడా అవమానించింది. మీకు నేను ఉంపుడుగత్తెనని ఎగతాళి చేసింది"

"ఆ కోపం ఆ అమాయకురాలు పార్వతి మీద చూపిస్తున్నావన్న మాట అత్తపై కోపం దుత్తమీద చూపించినట్టు"

"దీనికంతటికీ కారణం ఆ పార్వతేగా. ఆమె చప్పిడి కాజాలు పెట్టకపోతే ఈ మాటలన్నీ ఒచ్చేవా? ఆ ముసల్ది మనల్ని అవమానపరిచేదా?"

"ఇంతకీ మిమ్మల్ని పార్వతే పిల్చిందా?"

"అయ్యో....దానికామాత్రం ఎటికేసి తెల్సునా... నేనే చెప్పాను"

"మరి పంచదార లేని ఈరోజుల్లో ఎలా చేస్తుందనుకున్నావు?"

"పంచదార లేకపోవటం కాదండీ... దానికి కళ్లు నెత్తికొచ్చేయి. నా పరువు తియ్యాలని కావాలనే అట్లా చేసింది. లేకపోతే పబ్లిక్ ప్రాసిక్యూటర్ పెళ్లాం



అయివుండి ఆమాత్రం పంచదార సంపాయించుకోలేదూ? ఏ షావుకారికి ఫోన్జేస్తే పట్టుకొచ్చి పడేసేవాడు కాదు. ఖచ్చితంగా అది కావాలనే అలా చేసింది. పైగా నవ్వొకటి. ఏం నవ్వు! నా ముఖంలోకి చూసి ఒకటే నవ్వు. వాడి ఉద్యోగం పీకెయ్యాలి.అప్పుడుగాని దాని పొగరణగదు"

"పద్మా... ఇందాకటినుంచి చూస్తున్నాను. వాళ్లని సంబోధించటానికి నువు వాడే భాష చాలా నీచంగా వుంటోంది. కొంచెం నోరు సంబాళించుకోవటం మంచిది"

ఆ మాటతో ఆమె ఖంగుతిన్నది.

"రామ్మూర్తి అంటే ఏవిటనుకున్నావు అతను అందర్లాంటివాడు కాదు. అయివుంటే నువు చెప్పినట్టే పంచదార ఇంటికి తెప్పించుకుని నీకు తీయని కాజాలు వండి పెట్టమని పార్వతిని పురమాయించి వుండేవాడు. తన అభివృద్ధికి నన్ను వాడుకునేవాడు. కాని వాళ్లిద్దరికీ అలాంటి బుద్ధుల్లేవు.

"అతన్ని తీసెయ్యాలని చాలాసార్లు నువు అన్నట్టుగా నాకు లీలగా గుర్తుంది. అతన్ని తీసెయ్యటం అంత కష్టమైన పనేంకాదు. కేవలం నా స్నేహితుడనీ వాణ్ని ఆ వుద్యోగంలో పెట్టలేదు. వాడి నిజాయితీని చూసి మాత్రమే. అలాంటి వాడు పోతే మళ్లీ దొరకటం కష్టం"

"ఊహుఁ.. అదేం కుదర్దు" అంది గట్టిగా. కాని, అప్పటికే అతను నరసింహావతారం దాలుస్తున్నాడు.

"అవును...అదే నేనూ అంటున్నాను. అది కుదర్దు. నువు నోర్మూసుకుని లోపలికెళ్లు" అని గర్జించేడు.

ఆమె స్తంభించిపోయింది.

అంత కఠినంగా అతనెప్పుడూ మాట్లాడి వుండడు. తన నోటి మాటతో ఎన్నో ఉద్యోగాలు వేయించింది. ఎంతో మంది బదిలీలు ఆపుచేయించింది. ఎంతో మందిని బదిలీ చేయించింది. ఇంకా ఎన్నో, ఎన్నో....చేయించింది. కాని, ఒక సామాన్యుడి విషయంలో అభాసుపాలైంది.

ఎంత అవమానం?

మొగుడు కొట్టాడని కాదు బాధ తోడికోడలు చెప్పిందని!

ఇప్పుడు ఆమె బాధ పార్వతి అవమానించిందని కాదు..ప్రియుడు తనని లెక్కచేయలేదని...తను అతనికి ఏమీ కానట్టే ప్రవర్తిస్తున్నాడని.అదే చేసుకున్న పెళ్ళాం అయితే అలా ప్రవర్తించేవాడా?

ఆమె కోపం ప్రస్తుతం ఆయన మీదికి మళ్ళింది.

దుర్మార్గుడు. ఎంత చులకనగా మాట్లాడేడు. ఏం అనుకుంటున్నాడో! నేను తల్చుకుంటే ఏమైనా చేయగలను. మంత్రి పదవినే పీకించేయగలను. నేను కన్ను గీటితే చాలు...ఇలాంటివాళ్లు పదివేలమంది పాదాక్రాంతులవుతారు. అఫ్టరాల్...ఒక మినిష్టరు. అదికాస్తాపోతే బికారి...

ఆమె తనేదో క్రిస్టిన్‌కీలర్ అయినట్టూ, ప్రభుత్వాలనే పడగొట్టేయగల సమర్థురాలైనట్టు ఆలోచించసాగింది.

అందుకు కారణం మూడు రోజుల క్రితం విఠల్ ఎక్కించిన మత్తు.

ఆ మత్తు ఇపుడు ఎగదన్నుకు వచ్చింది.

విసుగ్గా, విసురుగా వెళ్ళి చేతిసంచీ అవతలికి విసిరేసి సోఫాలో కూలబడింది పద్మజ. ఆమె మనస్సు కల్లోలసాగరంలా




వుంది.

ఎదురుగా టీపాయ్ మీద కవరు కనిపించింది. దానిమీద అక్షరాలు చూస్తేనే అర్థమైపోయింది, అదేమిటో, ఎక్కణ్నుంచి వచ్చిందో. వెంకటేశ్వ్రరావు వచ్చి వెళ్ళాడన్నమాట.

పద్మజ మనస్సు వెంకటేశ్వరరావు మీదికి మళ్ళింది. రెండు నెలలుగా విశాల్‌తో సన్నిహితంగా ఉంటున్నా వెంకటేశ్వరరావుతో పోల్చుకుంటే అది ఒక అపరిపక్వ శృంగారము!

ఒక్కోసారి అవన్నీ తల్చుకుంటే తప్పు చేస్తున్నానేమో అనిపించేది. కాని ఇప్పుడలా అనిపించటంలేదు.

భర్తకి తనేం అన్యాయం చెయ్యటం లేదు. అతనే తనను తన్నేశాడు. పడుచు పెళ్ళాన్ని ఎలా వశం చేసుకోవాలో తెలీని మూర్ఖుడు. ముసలి వాసన రాకుండా సెంటుపూసుకుని, తెల్లబట్టలు వేసుకుంటేనే చాలదు. వయసులో వున్న ఆడదాన్ని ఎలా మురిపించాలో, మరిపించాలో తెల్సుకోవాలి అనుకుంది.

వెంకటేశ్వరరావుని ఆమె ఎన్నడూ మర్చిపోలేదు. అతనితో గడిపిన రోజులు ప్రతిక్షణం ఆకళింపుకు వస్తోనే వుంటాయి. అందుకే అతని ప్రోగ్రాం ఉన్నప్పుడల్లా ముందు వరుసలో కూర్చుని మరీ చూస్తుంది. అతడు అసలు తనని ఎరగనట్టే, తను అతనికి ఏమీ కానట్టే వచ్చి నమస్కారం చేసి తీసుకెళ్తో వుంటాడు. తన గురించి ఎంతగానో శ్రద్ధ తీసుకుంటాడు. అది తను ప్రేమ అని విశ్వసించటం లేదు. మోహం అంతకంటే కాదు. నాటకాలవాళ్ళకి ఇవి రెండూ తరచుగా మారే అభిరుచులు. అయితే అది గౌరవమా? అది కూడాకాదు. అభినయం. అంతే! ఇప్పుడామె పెద్ద హోదాలోవున్న ఒక వ్యక్తికి ప్రియురాలు. తన భర్త ముందు ముందు ఇంకా పైకిపోయే అవకాశాలు ఉన్నవాడు. మంత్రిగా ఇప్పటికే మంచి పలుకుబడి, గౌరవం సంపాదించుకున్నాడు. ఇవన్నీ తెలీని వాడు కాదు వెంకటేశ్వరరావు. వెంట్రుక చేతికి చిక్కితేచాలు పట్టుకుని పైకి పాకిపోయే తత్వం అతనిది. అది తనకి మొదట్నుంచీ తెల్సు.

కాలేజీ రోజుల్లో అందాల రాణిగా తనను అందరూ అభినందించేవారు. రానురాను అది తన బిరుదుగా మారిపోయింది. తను వెళ్తుంటే వెనకనుంచి బ్యూటీక్వీన్ అని పిల్చేవారు. నిజం చెప్పద్దూ, అతను ఎన్నడూ అందర్లా చౌకబారుగా ప్రవర్తించలేదు. ఆ చేసేదేదో డిగ్నిఫైడ్‌గా, అందంగా చేసేవాడు.

ఒకసారి అతని నాటకాన్ని టౌన్ హాల్లో వేస్తున్నారు. ఆ నాటకం చూడ్డానికీ, ఆనాటి సభకూ ఓ సినీ నటుడు ముఖ్య అతిథిగా వస్తున్నాడు. అకాడమీ కార్యదర్శి. సభాధ్యక్షుడు ఇవన్నీ విన్నాక అతను చాలాగొప్పవ్యక్తిగా అన్పించింది తనకు. అంత చిన్న వయస్సులోనే పెద్ద పేరు సంపాయించుకున్నవాడిగా, అంత మంది కాలేజీ అబ్బాయిల్లోనూ లేని విలక్షణమైన గుర్తింపు ఏదో తనకు అతన్లో కన్పించింది.

పాస్ చేతికిచ్చి

"మీరు తప్పకరావాలి. లేకుంటే నాకు సంతృప్తిగా వుండదు" అన్నాడు.

తనకంత గౌరవం ఇచ్చినందుకు పొంగిపోయింది.

"తప్పక వస్తాను. మీ ఆహ్వానం నాకు గర్వకారణం" అంది.

ఆరోజున అతనే స్వయంగా వచ్చి తీసికెళ్లేడు. తీసికెళ్లి మొదటి వరుసలో ఆ మహానటుడి సరసన కూర్చోబెట్టేడు. ఆ సంఘటన గుర్తొస్తే ఇప్పటికీ ఒళ్లు గగుర్పొడుస్తూవుంటుంది. ఒక సామాన్య కాలేజీ విద్యార్థినికి అలాంటి అవకాశం సాధ్యమా మరి!

నాటక ప్రదర్శన అయ్యేక అందరూ అతన్ని పొగడ్డమే!

''ఇలాంటి యువ రచయితలు సినీ రంగ ప్రవేశం చెయ్యాలి. అప్పుడు ఆ రంగానికిమరింతవన్నె వస్తుంది. సినిమాల్లో సాహిత్యంలేదనే అపప్రథ కూడా తొలగి పోతుంది'' అన్నాడు ఆ మహానటుడు.

''అవార్డుకు అర్హమైన రచయిత'' అన్నాడు అకాడమీ కార్యదర్శి.

ఇవన్నీ వింటూ, అతనికి జరిగే గౌరవాన్ని చూస్తూకూర్చొంటే పిచ్చెక్కిపోయేది. అతన్ని గట్టిగా కౌగలించుకుని ఒళ్లో వాలపోవాలినిపించేది.

తర్వాతతర్వాత తను పూర్తిగా అతనికి అర్పితం అయిపోయిన తర్వాత కూడా తనకోసం ఎంతగానో తాపత్రయ పడేవాడు. ప్రేమిస్తున్నాననేవాడు. పెళ్లి చేసుకుందాం అనేవాడు. ఈ రెంటి మీద తనకి అప్పట్లో సదభిప్రాయం వుండేది కాదు. అతనిక్కూడా వుండివుంటుందని తను అనుకోదు. తను ఎంతో గొప్పదాన్ని అయిపోవాలనీ, ఆ అవకాశాన్ని పెళ్లికి బలిపెట్టకూడదనీ అనిపించేది. నిజంగా అలాగే జరిగింది. ఇప్పుడు మంత్రిగారితో ఏం సుఖపడుతోంది? సగం కోర్కెల్ని చంపుకుని, మిగతా సగం కోర్కెల్ని విలాస జీవితంతో సరిపెట్టుకుని బతుకుతోంది.

మంత్రిగారితో తన పరిచయంకూడా యాదృచ్ఛికమే.

తను ఉద్యోగాన్వేషణలో వున్న రోజుల్లో ..

మంచి ఉద్యోగానికి పిలుపు ఒకటి వచ్చింది. అందుకు అవసరం అయిన అన్ని అర్హతలూ తనకున్నాయి. అయితే అంతమాత్రం చాలదు. అసలైన అర్హత సిఫార్సు. అది కావాలి. కాని, ఎలా? నిరుత్సాహపడిపోయింది. అలాంటి తరుణంలోనే ఒక స్నేహితురాలు చెప్పింది-

"ఫలానా మంత్రిగారు చాలా మంచి వారుట. స్వయంగావెళ్ళి అడిగితే తప్పక సాయం చేస్తారుట" అని.

అది గీతోపదేశంలా పన్జేసింది పద్మజకి. మంత్రిగారి సంగతి తెలిసిన మరొకరు కూడా అలాగే చెప్పేరు.

మర్నాడు ఇంటర్వ్యూ అనగా సెక్రటేరియట్‌కు వెళ్లింది. అక్కడ గేటు దగ్గర్నుంచీ ప్రారంభమౌతాయి ప్రతిబంధకాలు. లోపలికి పాస్‌సంపాయించటం అంటే స్వర్గానికి అర్హతలు సంపాదించటం అంత ఘనంగా అన్పించింది అప్పుడు. రిసెప్షన్‌లో రిసెప్షనంటే ఏవిటో తెలీని మొరటువాళ్లని పెడతారు. వాళ్లకి ఎవరితో ఎట్లా మాట్లాడాలో తెలీదు. అక్కడకు వచ్చేవాళ్లకు సివిక్ సెన్స్ వున్నట్టుగా కూడా అన్పించదు. తోసుకుని ఎవరు ముందుకు పోగలిగితే వాళ్లకే ముందుగా పాస్ చిక్కుతుంది. స్త్రీలకి ప్రత్యేకమైన కౌంటర్ ఏమీలేదు. మగవాళ్లతోపాటు తోసుకుని ముందుకెళ్లి చిట్టీఇచ్చింది. అతను పాస్‌ఇవ్వలా. పి.ఎ. గారికి ఫోన్జేసి అడిగేడు. అమ్మాయి అయితే పంపించమని అని వుంటాడు. అతను నవ్వుకుంటూ పాస్ చేతికిచ్చేడు.

ఆ మంత్రిగారి గది వెతుక్కుంటూ వెళ్లింది. అదో పద్మవ్యూహం. ఎవరు ఎక్కడ వుంటారో సూచించే బోర్డుకూడా ఏమీ లేదక్కడ. ఏ మంత్రిగారి గది చూసినా జనం కిటకిటలాడుతున్నారు. ఈ మంత్రిగారి గదికూడా అలాగేవుంది. విజిటర్స్‌రూం కిక్కిరిసివుంది. ఏవేవో కబుర్లు-రాజకీయాల గురించీ, రాబోయే బృహత్తర పరిణామాల గురించీ, పార్టీ ముఠాల గురించీ, లైసెన్సుల గురించీ, ఏమేమో వూహాగానాలు చాలా తేలిగ్గాసాగిపోతున్నాయి. అక్కడ తను కూర్చోటానికి స్థలంలేదు. చాలా సేపు అలా బైట నిలబడేవుంది.

రెండు గంటల ప్రాంతంలో...

"మంత్రిగార్ని చూడటానికి వెయిట్ చేస్తున్నారా?" అని అడిగేడు ఒక అబ్బాయి. అందమైన అమ్మాయిల్ని చూస్తే ఎవరికీ కష్టపెట్టనీయబుద్ధేయదేమో!

"అవునండీ" అంది.

"అటెండరుకు అయిదు రూపాయలు పడెయ్యండి. వాళ్లంతా అయ్యేక మీకు ఛాన్సు రావాలంటే అర్ధరాత్రవుతుంది" అన్నాడు.

"అదేదో మీరేకాస్త అరేంజ్ చేసి పెట్టకూడదూ" అనడిగింది ఐదునోటు పైకి తీసి.

అతను ఆ విద్యలో సిద్ధహస్తుడిలా వున్నాడు. వెంటనే ఆమె చేతిలోంచి అయిదు రూపాయల నోటు పుచ్చుకుని అవతలికెళ్లేడు. అయిదు నిముషాల తర్వాత అటెండరుతో తిరిగివచ్చేడు.

"రండి" అని ఆహ్వానించేడు అటెండరు.

అతని వెనకాలే స్వింగ్ డోర్ తోసుకుని లోపలికెళ్లింది.

మంత్రిగారి గది ... అదో మాయ లోకంలా వుంది. ఆ వాతావరణం తనను మత్తులో ముంచేసింది. అక్కడున్న ప్రతి వస్తువూ అపురూపంగానే అన్పించింది. మెరిసిపోయే ఫర్నిచర్, బయటి వాతావరణం తెలీని నీరవం, పగలో, వెన్నెల రాత్రో తెలీని అదో రకం కాంతి, చల్లటి వాతావరణం - అక్కడ అలా కూర్చుని ఉండిపోవాలనిపించింది. కాని మంత్రిగారు తనకా అవకాశం ఇవ్వలేదు. ఆయన అడిగేడు ... తను చెప్పింది. తనెవరో చెప్పింది. తననిక్కడికి ఎవరు పంపేరో చెప్పింది. తన కుటుంబం గురించి సవివరంగా చెప్పుకుంది.

"ఇప్పుడు నేను చాలాబిజీగావున్నాను. సాయంత్రం వస్తే తీరిగ్గా వుంటాను" అని సాగనంపేరు మంత్రిగారు. ఆమెకు ఆశ పొడసూపింది. తనకు విజయం చేకూరగలదనే విశ్వాసం కలిగింది.

సాయంత్రం వెళ్లింది.

ఎక్కడా మానవ సంచారం లేదు. గుమ్మం దగ్గర ఉదయం ఉన్న అటెండరే నిలబడి వున్నాడు.

"ఉన్నారా?" అని అడిగింది.

"ఆఁ.... తమరి కోసమే ఎదురు చూస్తున్నారు .... వెళ్లండి" అని తప్పుకుని దారిచ్చేడు.

లోపలికెళ్లింది.

ఉదయంకంటె సుందరంగా వుంది గది. అక్కడి గాలంతా మధురమైన ఏదో వింత వాసనతో నిండిపోయింది.

తనను చూడగానే మంత్రిగారు లేచి-

"రండి..." అని సాదరంగా ఆహ్వానించేరు.

బహుశా సీజరు కూడా క్లియోపాత్రాని అలాగే ఆహ్వానించి వుంటాడు.





"కూర్చోండి"

అతనికి ఎదురుగా టేబిలు ముందు కూర్చుంది. టేబిలు మీద తన చేతులూ, చేతుల గాజులూ, అవతల మంత్రిగారి నున్నగా గీసిన గెడ్డమూ ప్రతిబింబిస్తు న్నాయి.

మంత్రిగారు చాలాసేపు తన ముఖం లోకే చూస్తూవుండిపోయేరు. తర్వాత...

"ఏం కావాలి?" అని అడిగేరు.

"రిసెర్చి అసిస్టెంటుగా ఇంటర్వ్యూ వచ్చిందండీ ... తమరు చెబితే అవు తుందని చాలామంది చెప్పేరు"

"అలాగా... అయితే రండి. డైరక్టరుకు ఫోన్జేస్తాను" అని పక్కనున్న గదిలోకి నడిచేడు. వెనకాలే తనూ వెళ్లింది. లోపలికి వెళ్లగానే బైట తలుపులు పడి పోయేయి.

తనకు గుండెలు దడదడలాడేయి.

నవ్వుతూ భుజం మీద చేయివేసేడు.

"నీకు ఉద్యోగం కావాలి. తప్పకుండా వస్తుంది. ఇంతకంటె పెద్ద ఉద్యోగం కూడా ఇప్పించగలను. కానీ...."

ఆ తర్వాత ఆయన ఏం అంటాడో, అది ఎలాంటిదో, తన పాలిట ఎంత క్రూరమైన చర్యో అర్థమైంది. తను అనాఘ్రాత పుష్పం ఏమీకాదు. అలా అని ప్రతి వ్యక్తితోనూ...

ఏమనుకున్నా ఏం ప్రయోజనం? సింహం బోన్లో పడ్డాక దాన్తో పోరాడా లనుకోవటం శుద్ధ వెర్రి. ఇప్పుడు ఇక తనెలానూ తప్పించుకోలేదు. ఎందు కొచ్చిన వృథా పెనుగులాట?

ఆమె భుజాలు పట్టుకుని గట్టిగా నొక్కేడు.

మౌనంగా నుంచుంది.

ఆ మౌనం అర్థాంగీకారంగా స్వీకరిం చేడు.

తనతో గొప్ప అనుభూతినీ, సుఖాన్నీ పొందినట్టుగా కన్పించేడాయన. తనకూ ఆ అనుభవం కొత్తగా, ఉన్నతంగా అని పించింది.

మరోసారి దగ్గరికి తీసుకుని ....

"ఉద్యోగం చెయ్యాలా?" అనడిగేడు.

కళ్లుమూసుకునే సమాధానంచెప్పింది-

"చెయ్యకపోతే ఎలా గడుస్తుంది? నా వెనక ఇంకా ఇద్దరు తమ్ముళ్లున్నారు. వాళ్లు చదువుకోవాలి"

"ఆ బాధ్యతలన్నీ నేను స్వీకరిస్తే?"

వెంటనే మాట్లాడలేదు. దాని అర్థం అంత తొందరగా స్ఫురించలేదు.

"ఏమంటావు?"

"మీ మాటలు నాకర్థంకావటంలేదు" అంది. అప్పటికే ఆయన మాటలకి సగం అర్థం తెలిసేపోయింది.

"నన్ను పెళ్ళిచేసుకోడానికి ఏమైనా అభ్యంతరమా?"

ఇది ఊహించని ప్రశ్న. తను ఊహిం చింది వేరు.

కళ్ళు విప్పి అతని ముఖంలోకి చూసింది. వయసు పెద్దదే. అది ముఖంలో అంతగా కన్పించకపోయినా స్పష్టపడు తూనేవుంది. అయినా ఒక ఆడదానికి అవసరం అయ్యేదానికంటే తక్కువతనం తనకేం అన్పించలేదు. మనిషి అందంగానే వుంటాడు. ఆరోగ్యం కూడా బాగానేవుంది. తన వయసుకి సుఖం ఇవ్వగల సత్తువ ఇంకా ఆయన వయసులో వుంది. వెంకటేశ్వరరావుతో మాత్రం ఇంతకంటె ఎక్కువ సుఖం పొందిందా? పైపెచ్చు పదవి, డబ్బు, పలుకుబడి అన్నీ వున్నాయి. అంతకంటె తనకి ప్రస్తుతం కావల్సిందేమిటి?

"పెద్దవాళ్ళు....?"

"అవన్నీ నేను చూసుకుంటాను. మీ నాన్నగారి ఎడ్రస్ ఇస్తేచాలు"

తను మౌనంగా ఎడ్రస్ రాసి ఇచ్చింది. అంతకంటే వేరే అంగీకారం ఏం కావాలి?

మరోసారి గట్టిగా కౌగలించుకుని ముద్దుపెట్టుకున్నాడు.

"ఇంతకాలం నేను నీ కోసమే వేచి వున్నాను కాబోలు" అన్నాడు ముద్దుగా తన బుగ్గలు నిమిరి.

అలా మంత్రిగారి దగ్గర చేరింది.

పెళ్ళిచేసుకుంటానంటే నమ్మిన పద్మజ అతనికి అప్పటికే భార్యవుందని తెలిసి కుంగిపోలేదు. అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని ఉంపుడుగత్తెగానే వుండిపోయింది. తర్వాత తనను ఎంతగా సుఖపెట్టేడో, ఎంత ఆప్యాయంగా చూసేడో తను మర్చిపోలేదు. రాజకీయంగా ఎన్ని చికాకుల్లో వున్నా తనని మాత్రం అశ్రద్ధ చేయలేదు.

కాని....

ఇప్పుడు ఒక అనామకుడి కోసం, ఆ పనికిమాలిన పబ్లిక్ ప్రాసిక్యూటర్ కోసం తనని ఇట్లా చీత్కారంచేయటం తల తీసేసినట్లయింది.

పాత విషయాలన్నీ ఆకళింపుకు వచ్చేక ఆమె మనసు మళ్ళీ విఠల్ మీదికి మళ్ళింది.

విఠల్ మరో మంత్రిగారి అబ్బాయి. కాలేజీ వదిలేసి యూనివర్సిటీకి వెళ్లాలని వృధా ప్రయత్నంచేసి ఊరుకున్న వయసు కుర్రాడు. తను ఎప్పుడు కన్పించినా తినేసేట్టు చూసాడు. ఒకటి రెండు సార్లు పరిచయం చేసుకునేందుకు ప్రయత్నించేడు. పక్కపక్క ఇళ్ళే అయినా ఆ మంత్రిగారికీ, ఈ మంత్రిగారికీ చుక్కెదురు కావటంవల్ల ఆ ప్రయత్నం ఫలించలేదు.

అయితే సన్నజాజులు ఆ లోటు తీర్చేయి.

ఆ మంత్రిగారి పోర్టికోనిండా సన్నజాజి తీగ అల్లుకుని వుంది. అటునించి వచ్చే గాలి రాత్రులు సన్నజాజి పూల వాసన మోసుకొచ్చి మత్తులో ముంచేస్తో వుంటుంది. అసలే తనకి సన్నజాజులంటే విపరీతమైన మోజు.

ఒకరోజు ఉండబట్టలేక పని కుర్రాణ్ణి పంపించింది కోసుకురమ్మని. వాడు కోస్తోంటే అడిగేడు విఠల్....

"ఎవరికిరా పూలు?" అని.

"మా అమ్మగారికి" అని చెప్పాడు.

విఠల్ కనిపెడుతూనే వున్నాడో ఏమో. పిట్టగోడ దగ్గరికి వచ్చి చిన్నగా దగ్గేడు. తను తోటలో నిలబడి తల ఆర్చుకుంటోంది.

మళ్ళీ ఒకసారి దగ్గి గొంతు సరిచేసుకున్నాడు. అటు చూసింది.

"ఆంటీ! అయాంసారీ... మీ పేరు తెలీదు"

"పద్మజ"

"పద్మజగారూ ... మీకు సన్నజాజులంటే చాలా ఇష్టమా?"

"ఊ..."

"నాక్కూడానండీ"

మాట్లాళ్ళేదు.

"రోజూ నేను పంపించేదా?"

"అక్కరలేదు"

"అదేంటండీ .... మీ కుర్రాడికి పని తప్పుతుందిగా"

విసుగా లోపలికెళ్ళిపోయింది. కాని లోపల్లోపల 'అక్కడ నిలబడి ఆ కుర్రాణ్ణి ఏడిపిస్తే బావుండును' అని





పిస్తోనేవుంది.

కానీ మర్నాటినించి అతనే ఏడిపించటం మొదలెట్టేడు. తను సాధారణంగా ఏమీ తోచనప్పుడు సరిహద్దు గోడ వెంబడే వున్న గులాబీ మొక్కల దగ్గర తిరుగుతో వుంటుంది. ఆరోజు వెళ్ళేప్పటికి తను నడిచే దారంతా సన్నజాజులు పరిచివున్నాయి. వెంటనే అర్థమైపోయింది. తనకు పూల మార్గం పరిచిన యువకుణ్ని తల్చుకుని నవ్వుకుంది.

రెండు మూడు రోజులు వరసగా అలాగే జరిగింది. ఆ తర్వాత కావాలనే వెళ్ళటం మానేసింది.

ఒకరోజు...

డ్రాయింగ్ రూంలో కూర్చొని సినిమా పత్రిక చదువుకుంటోంది. ఏం తోచక ఎక్కడికైనా వెళదామా అనుకుంటున్నప్పుడే తలుపు తెరుచుకుంది.

"ఎవరే....?" అని అడిగింది.

"ఆ మంత్రిగారి పెద్దబ్బాయి తమరికి సన్నజాజిపూలు తెచ్చారండి"

"ఎక్కడున్నాడు?"

"ఇక్కడే వున్నారండి" అని పక్కకి తప్పుకుంది. అతను సరాసరి లోపలికి వచ్చేసేడు.

బెల్ బాటం పేంటూ, పువ్వుల చొక్కా, హిప్పీ జుట్టూ, సన్న ఫ్రేం కళ్ళజోడు, తెల్లగా పొడుగ్గా అందంగానే వున్నాడు.

"కోపంగా వుందాండీ"

"ఎందుకు...?"

''ఇలా లోపలికి వచ్చేసినందుకు''

"ఏ... లోపలికి రాకూడదా?"

"థేంక్సండీ.... కోప్పడతారేమో అనుకున్నాను'' అని సోఫాలో కూర్చొని పూలు టీపాయ్‌మీద పెట్టేడు.

"బైట కన్పించటం లేదు. ఒంట్లో బాగుండటం లేదాండి" అని అడిగేడు.

నవ్వింది. లేదన్నట్టుగా మెడ తిప్పి రెండు చేతులూ వెనక్కి వాల్చి సోఫాలో చేరగిలబడింది. అతని చూపులు తన ఛాతీమీద వున్నాయి. లోనెక్ జాకెట్ లోంచి దూసుకుపోతున్నాయా చూపులు.

''ఏం లేదు...కొంచెం అలసిపోయేను! అంతే"

అతని ఛాతీ బరువైన ఊపిరితో లేచి పడుతోవుండటం తను గమనిస్తోనే వుంది. కళ్లు మాత్రం అక్కణ్నుంచి కదల్టం లేదు.

అరగంట అలా గడిచిపోయింది. ఈలోగా ఏమేమో మాట్లాడుకున్నారు. బెరుకుపోయింది. దూరం తగ్గింది.

అప్పుడు చేయి అందించింది. ఏం చేయాలో తోచక క్షణం ఆలోచించేడు. తర్వాత చేయి తీసుకుని పెదాలకి హత్తుకున్నాడు. ఆ చేతిని వెనక్కి తీసుకోక పోవటం చూసి మరింత చనువు తీసుకున్నాడు.

"నా చనువుని లోకువగా తీసుకున్నట్టున్నావు" అంది.

"కాదు మేడం! బలహీనులకి బలం ప్రసాదించే ఇన్స్పిరేషన్ వుంది మీలో.."

"ఉహూ...నువ్వు కవివి కావల్సింది"

"జీవితమే ఒక మహాకావ్యం. అందులో ఒక తీయని కవితలా మనం బతికి పోవాలి'' అన్నాడు ఎక్కడో విన్న డైలాగుని అప్పజెపుతో.

ఆ మాట విన్నాక నిజంగానే తనలో ఏదో వెలితి కొట్టవచ్చినట్టు కన్పించింది. వేడి నిట్టూర్పు వెలువడింది.

"అనుకుంటాంగాని సాధ్యమా?"

"తల్చుకుంటే అసాధ్యమైంది ఏముంది చెప్పండి. అంతా మన చేతుల్లోనే వుంది"





''నిజమా?"

"కాకపోతే ఏవిటి చెప్పండి. జీవితాన్ని జీవం లేకుండా చేసుకుంటే, ఆ జీవితానికి ఇంక పరమార్థం ఏముంది చెప్పండి"

"అబ్బో...మాటల్లో మహాచతురుడివే! మరి చేతల్లో...''

ఆ మాట అతన్ని రెచ్చగొట్టింది.

''అబ్బ! మెడ నొప్పిగా వుంది బాబూ! కొంచెం దిండు తెచ్చి పెట్ట గలవా! ఇక్కడ కాస్త నడుం వాలు స్తాను''

"ఇక్కడెందుకు అసౌకర్యంగా పడుకో వటం? వెళ్లి పక్కమీదే పడుకోవచ్చుగా"

చేయి అందించింది. అందుకుని లేపాడు. ఆ వూపులో కావాలనే అతని మీద పడింది.

"నిల్చోలేకపోతున్నా బాబూ..." విఠల్ నడుం చుట్టూ చేతులు వేసి బెడ్రూం వైపు నడిపిస్తున్నాడు.

మంచం మీద వెల్లకిలాపడి,

''థాంక్స్....'' అంది.

విఠల్ తలకింద దిండ్లు సర్దుతున్నాడు. అతని భుజాలు పట్టుకుని దిండ్లమీద సుఖ భంగిమకోసం అటూ ఇటూ కదిలి సర్దుకుంది.

అన్నీ సర్దిపెట్టి స్కూలు కుర్రాడిలా చేతులు కట్టుకునిచున్నాడు. ఇక తన ఆజ్ఞ అయితే వెళ్లిపోతాడు కాబోలు. కాని అక్కడిదాకా వచ్చినవాణ్ని, అందులోను అంత చురుకైన కుర్రాణ్ని పంపించేయ టానికి మనసెందుకో అంగీకరించటం లేదు.

అతని ముఖంలోకి చిలిపిగా చూసింది.

అతను ధైర్యంగా నవ్వేడు.

చేతులు అందించింది. హుషారుగా అందుకున్నాడు.

బలంగా మీదికి లాక్కుంది.

అదంతా గుర్తు చేసుకుంటూండగానే-

ఎదురుగా టీపాయ్ మీద పెద్దపెద్ద గులాబీల గుత్తి ఒకటి కన్పించింది. పద్మజ ఇంతవరకూ దాన్ని చూడనేలేదు.

సర్వెంటుని పిల్చి అడిగింది.

"విఠల్ బాబుగారు వచ్చారమ్మా! తమరు ఇంట్లో లేరని అక్కడ పెట్టి వెళ్లేరు''

అవును...వాటిని చూస్తేనే తెలుస్తోంది అది ఎవరి పనో! ఎంత శ్రద్ధగా, అందంగా కట్టించేడు!

మొన్న భర్త ఢిల్లీ వెళ్లినప్పుడు, విఠల్ తో గండిపేట వెళ్లింది. అక్కడ గులాబీలు చూసి-

"ఎంతబాగున్నాయి విఠల్" అంది.

"ఏం...కావాలా?'' అనడిగేడు.

"ఊహుం.... అవి అక్కడ ఉంటేనే బావుంటాయి"

"లేదు. నీ జుట్టులో ఇంకా బావుం టాయి''

"ఒద్దులే... అయినా పార్కులో పూలు కోయనివ్వరు"

"మనల్నెవరు ఆపేది?" అంటూ తెంపబోయాడు. తనే చేయి పట్టుకుని ఆపు చేసింది.

ఆ సాయంత్రం ఎక్కడినుంచి తెప్పించేడో ఏమో, గెస్టుహవుస్‌లో పక్క నిండా గులాబీలే.

"ఇంకెప్పుడూ గులాబీలే. సన్న జాజుల మీద మోజు సన్నగిల్లినట్టుంది" అన్నాడు.

ఆ మర్నాడు భర్త ఢిల్లీ నుంచి తిరిగి రావటంవల్ల వీలుచిక్కలేదేమో, ఇప్పుడు ఆయన కాన్ఫరెన్సుకెళ్లిన సందు చూసు కుని తీసుకొచ్చేడు.

అడిగితే ప్రాణం కూడా ఇచ్చేట్టు న్నాడు అనుకుంది పద్మజ.

గులాబీలు చేతిలోకి తీసుకుని గుండె లకు హత్తుకుంది. తర్వాత వాటితో ముఖాన్ని కప్పుకుంది.

ఏదో గొప్ప అనుభూతి.

సినిమాలో హీరోయిన్‌లా ఫీలయింది. ఆమె బుగ్గలు ఎరుపెక్కి గులాబీల్లో కలిసి పోయేయి. కళ్లు మత్తుగా మెరిసేయి.

తలుపు కొంచెం తెరిచి,

"అమ్మగారూ...." అని పిల్చింది సర్వెంటు.

"ఊఁ" అంది మత్తుగా. అప్పుడప్పుడే జరిగిన సంఘటన కలలా కరిగిపోసాగింది.

"వికల్ బాబుగారొచ్చారండి" అని చెప్పింది.

పద్మజ ఉత్తేజంతో లేచి నిలబడింది. ఎదురెళ్లి సాదరంగా ఆహ్వానించాలను కుంది. కాని లౌక్యమూ, శృంగారమూ రెండూ ఎరిగిన వ్యక్తి ఆమె.

"రమ్మను" అంది.

దృష్టి అలవోకగా వాచీ మీదికి పోయింది. అప్పుడే ఏడు కావస్తోంది.

'ఇప్పుడొచ్చాడేవిటి?' అనుకుంది.

అతను రావటం, వెనక తలుపుపడిన చప్పుడు విన్పించటం...అన్నీ జరిగి పోయాయి. ఎప్పటికంటె హుషారుగా వున్నాడు.

"ఇప్పుడొచ్చావేంటి?" అనడిగింది.

"నాకు తెల్సు డార్లింగ్...రాత్రి పది అయినా రాలేరు మీవారు."

ఆమె ఏం మాట్లాడలేదు.

"ఏం...ఆరోగ్యం బాగోలేదా?" అంటూ పక్కన కూర్చున్నాడు.

"బాగానే వుండిగాని, ఆ వ్యవహారం ఏమైంది?" అనడిగింది.

"ఏమవుతుంది. హుషస్! అయినా అది దిక్కులేందిలా వుంది. ఎవరూ కంప్లెయింటు ఇచ్చినట్టు కూడా లేదు" అన్నాడు.

ఆమె నిట్టూర్చింది.

దగ్గరికి తీసుకోబోయాడు. ఆమె వారించింది. కాని వెంటనే భర్త, అతని ప్రవర్తన గుర్తుకొచ్చింది.

"ఇక్కడకాదు...పద" అని లేచింది.



## జనవరి 4 : సాయంత్రం 8.20

పద్మజ మనస్సు తేలిగ్గా వుంది. ఈరోజు ఆమె అనుభవించిన పరాభవం అంతా మర్చిపోయింది.

మంత్రిగారితో పేచీపడ్డాక, ఆ మాట కొస్తే అసలు మంత్రిగారి దగ్గరకు వచ్చేకనే ఇంత సౌఖ్యం ఎన్నడూ తను అనుభవించలేదేమో!

వికల్ చేష్టలూ, అతని కవ్వింపూ గుర్తుకువచ్చి హాయిగా నవ్వుకుంది.

ఇంతలో ఫోన్ మోగింది.

"ఇదొకటి మధ్యలో"

విసుక్కుంటూనే ఫోనెత్తింది.

అవతల్నించి సన్యాసిరాజు మాట్లాడు తున్నాడు.

"అయ్యగారొచ్చేరా?"

"ఊహు....రాలేదు"

"ఇవాళ పెద్దింటిదగ్గరేమో కొలుపు"

అన్నాడు నవ్వుతూ.

పద్మజకు ఒళ్ళు మండింది.

తనను ఉంపుడుగత్తెగానే వీళ్ళంతా భావిస్తున్నారన్నమాట!

"అవును...అక్కడికే వెళ్ళండి"

"అమ్మమ్మ...ఎంత మాటన్నారు? నేనెప్పుడయినా అక్కడికి వెళ్ళానన్న మాట విన్నారా...లేదు లేదు. నా పసంతా మీతోనే"

"సరేలే. చెప్పండి...."

"ఫోన్లో ఎలా చెప్పమంటారు? తమ దర్శనం చేసుకుంటాను....లేకుంటే మళ్ళీ వీలుచిక్కదు. పరిస్థితులన్నీ తారుమారయ్యేట్టున్నాయి"

తన పరిస్థితీ అలానే వుండగా ఎలా చెప్పుకుంటుంది?

"పరిస్థితులు తారుమారయితే నావల్ల మాత్రం ఏమవుతుంది?"

"మీవల్లనే కావాలి. మీరడిగింది ఎప్పుడయినా కాదన్నానా చెప్పండి"

సన్యాసిరాజు విషయం పద్మజకు తెల్సు. అతను ఎలాంటి కేసులు తెస్తాడో ఎలా చేయించుకుంటాడో, పనులు చేయకపోతే ఎలా రాక్షసుడిగా మారిపోతాడో ఆమెకు బాగా తెల్సు.

"సరేలే ... రండి" అని ఫోను పెట్టేసింది.

కొంపదీసి పక్కింటినుంచే ఫోన్ చేశాడో ఏమో...అతను రావడానికి పది నిమిషాలు కూడా పట్టలేదు.

"కులాసాగానే వున్నారు కదా" అని పరామర్శించేడు.

"కులాసాగా వున్నట్టు కనిపించటం లేదా"

"ఫోన్లో మాట్లాడుతున్నప్పుడు అలా అనిపించింది"

"ఇప్పుడు మీకు అలానే అనిపిస్తుందిలెండి... ఏవో చిన్నిల్లు పెద్దిల్లు అంటున్నారు గదా?"

"సహజమేగదమ్మా అది...."

"అంటే మీ వుద్దేశం నేను ఉంపుడుగత్తెననా"

"అలా ఎందుకంటానమ్మా .... మొదటి భార్య వుంది కాబట్టి ఆవిణ్ణి పెద్దావిడ అంటూ వుంటాం"

"చాల్లెండి. నన్ను చులకన చేస్తూనే నాచేత పనులుచేయించుకుంటూవుంటారు"

"ఇందులో చులకన ఏముందమ్మా?"

"ముమ్మాటికీ చులకనే... అలాంటప్పుడు నాచేత పనులు చేయించుకోవటం మానెయ్యాలి"

"ఏవిటమ్మా ఇందాకట్నుంచీ చూస్తున్నాను...పన్లు పన్లూ అంటూ ఒకటే ఏకరు పెడ్తున్నావు. పనులు నాకు ఊరికే చేయించి పెడ్తున్నావా? నాచేతిమీదుగా లక్షలు ఇచ్చిన సంగతి మర్చిపోతున్నట్టున్నావు"

కొంచెం వెనక్కి తగ్గింది. అయినా వేడి తగ్గలేదు.

"నా చేతి మీదుగా కోట్ల విలువ చేసే పనులు చేసిపెట్టానని గుర్తుంచుకుంటే మంచిది"

"కాదన్నానా...నేను అనేదీ అదే. నేను ఊరికే మీకు డబ్బూ ఇవ్వలేదు... మీరు నాకు ఊరికే పన్లూ చేయించలేదు. అంచేత నేను చెప్పేది ఏవిటంటే ఇందులో ఒకరికొకరు కృతజ్ఞత చూపించుకోవల్సిన అవసరంలేదు. వ్యవహారం.... అంతే!!"

"వ్యవహారం అనుకున్నప్పుడు ఇంకెవరిచేతనైనా చేయించుకోవచ్చుగా"

"చేయించుకోవచ్చు. మీవల్ల కాదనుకున్నప్పుడు ఆ ప్రయత్నం ఎలాగూ

చేయక తప్పదు"

ఇలా చాలా సేపు వాగ్వాదం జరిగింది. అసలు పనేమిటో అడిగే ధ్యాస ఆమెకు లేదు. చెప్పే అవకాశం సన్యాసిరాజుకు రాలేదు. మాటల మధ్య మాత్రం మంటలు లేస్తున్నాయి.

సన్యాసిరాజు సంగతి పద్మజకి తెల్సు. ఆమె గుట్టు రాజుకి తెలుసు.

ఇద్దరూ తేలు కుట్టిన దొంగలే!

తను ఎన్ని లక్షలు సమర్పించిందీ అతను లెక్కలు కడ్తున్నాడు.

తను ఎన్ని పన్లు చేయించిందీ ఆమె బేరీజు వేసుకుంటోంది.

ఒకప్పుడు ఆమె తల్లిదండ్రులకి ఉండటానికి ఇల్లు లేదు. ఇప్పుడు భవంతిలో వుంటున్నారు.

కారణం ఎవరు?

ఒకప్పుడు వాళ్ళకి తినడానికి తిండి వుండేదికాదు. పిల్లల చదువుకి డబ్బు వుండేది కాదు. ఇప్పుడు పంచభక్ష్య పరమాన్నాలు భోంచేస్తున్నారు. పిల్లలు ఇంజనీరింగులూ,మెడిసినూ చదువుకుంటున్నారు.

ఎవరి వల్ల?

రెండో కంటికి తెలీకుండా తను అన్ని ఏర్పాట్లూ చేయటంవల్ల కదూ?

ఇది సన్యాసిరాజు అభిప్రాయం.

ఒకప్పుడు ఆయన చుట్టూ పనుల కోసం కుక్క తిరిగినట్లు తిరిగేవాడు.

ఆయన చేయకపోతేనేగా తన చేత చేయించుకోవటం మొదలెట్టేడు.

సన్యాసిరాజు బస్సులు తిరిగే రూట్ జాతీయం చేయబోతే, తనేగా చక్రం అడ్డువేసింది!

ఇప్పుడు కోట్లు సంపాయించేడంటే ఎవరు కారణం?

భూసంస్కరణల వల్ల మునిగిపోతున్నానని గోలచేస్తే తనుగదూ కలగజేసుకున్నది?

జిల్లా రాజకీయాల్లో మురిగిపోతూ వుండే తనుగదూ టిక్కెట్టు ఇప్పించి రాష్ట్ర రాజకీయాల్లోకి దించింది?

ఇలా పద్మజ అనుకుంటోంది.

సన్యాసిరాజు ఏంచేసినా, ఏం చేయకపోయినా ఆమె తల్లితండ్రులకి మంత్రిగారి అండదండలు వుంటనే వుంటాయి. అంత చేయించుకోలేని అసమర్థురాలూ కాదామె.

పద్మజ చేసినా, చేయకపోయినా పనులు చేయించుకోలేని అసమర్థుడు కాదు సన్యాసిరాజు.

రాజకీయాల్లో తలనెరిసినవాడు.

రాచకార్యాల్లో మునకలేసి తేలినవాడు.

"ఇంకెప్పుడూ ఇలా పనుల కోసం నా దగ్గరికిరామాకండి" అన్నది పద్మజ.

సన్యాసిరాజు అహం కొంచెం దెబ్బతిన్నది. కాని ఆమెలా పైకి క్రోధాన్ని ప్రకటించే తత్వం కాదు అతనిది. కాలకంఠుడిలా విషాన్ని కన్పించకుండా దాచేయగలడు. కాదనుకుంటే కాటేసి పగ తీర్చుకోనూగలడు.

"మీరలా అంటే ఏంచేస్తాను?" అని లేచేడు.

సన్యాసిరాజుతో చాలాకాలంగా సాగుతోన్న వ్యవహారం ఇవాల్టితో బెడిసికొట్టింది.

అలా జరగటానికి కారణం పద్మజ మానసిక పరిస్థితే. అది అప్పుడు తెలీలేదు పద్మజకు. సన్యాసిరాజు వెళ్లిపోయాక జరిగిందానికి కొంచెం భయపడింది.



## జనవరి 5 - ఉదయం 7 గం

వేకువనే లేచి మంత్రిగారి సదనానికి వెళ్ళేందుకు సన్నాహం ప్రారంభించారు లలిత నాన్నగారు.

నిన్న ఇనస్పెక్టరు చేసిన అవమానానికి రాత్రంతా ఆయనకి నిద్రపట్టలేదు. హోంమంత్రిగార్ని కల్సుకుని విషయం అంతా మనవి చేసుకోవాలని నిశ్చయించుకున్నాడాయన. అతను మంత్రి అయ్యాక ఎప్పుడూ కలవలేదు. ఏమీ అడగలేదు.

ఆటో ఎక్కి హోంమినిష్టరుగారింటి కంటే అతను మరేం అడగలేదు. తిన్నగా తీసుకొచ్చి ఇంటి ముందే దించేడు. ఆ ఇల్లూ, ఆ పరిసరాలూ చూస్తే ఆ ముసలి మాస్టారి ఆశ్చర్యానికి అంతులేకపోయింది.

భయం భయంగా లోపలికెళ్ళేడు.

రాజకీయం ముఠాల్లో మునిగి తేలుతోంది. ఏ మంత్రి ఇంటిదగ్గర చూసినా సమావేశాలు, సమాలోచనలూను. ఎవరి ముఠాబలం అంచనా వారు వేసుకుని ఎత్తుగడలు నిర్ణయించుకుంటుకున్నారు. తెల్లవారకముందే ఇక్కడా ఓ సమావేశం ప్రారంభమైనట్లుంది.

పేరు, ఇతర వివరాలూ రాసి చీటీ లోపలికి పంపించారు మాస్టారు. లోపలికి పిలుపు రాలేదు.

మంత్రిగారే స్వయంగా వచ్చేరు.

తన చిన్ననాటి ఉపాధ్యాయుణ్ని చూసి ఉప్పొంగిపోయారు మంత్రిగారు.

"రండి మాస్టారూ! ఎంతకాలానికి.." అంటూ సాదరంగా లోపలికి ఆహ్వానించేరు.

అటెండరు స్వింగ్ డోర్ తెరిచి పట్టుకుని నిల్చుంటే ఇద్దరూ లోపలికెళ్ళేరు.

ఆహా... ఏం వైభవం. మయసభే?

లోపల పెద్ద కొలువే తీరివుంది.

"వీరు నా చిన్ననాటి గురువుగారు. పూజనీయులు" అని పరిచయం చేశాడు. అక్కడ వున్న ఎమ్మెల్యేలూ, ఇతర నాయకులూ లేచి చేతులు జోడించి ఆ పేద పంతులుకి నమస్కరించేరు.

ఎంత పుణ్యం!

"వీరు చాలాకాలం తర్వాత దర్శనం అయ్యారు. కాస్సేపు నోరారా మాట్లాడుకోవాలి. మనం మళ్ళీ సాయంత్రం కలుద్దాం" అన్నారు మంత్రిగారు.

ఎంత అభిమానం!!

అంతా బైటికి వెళ్ళిపోయారు. తమ్ములంతా నిష్క్రమించిన సుయోధనుడి సభలా అయిపోయింది ఆ గది.

అక్కడి వైభవాన్ని తిలకిస్తూ ఉండిపోయారు మాస్టారు.

"కూర్చోండి మాస్టారూ! అలా నిలబడిపోయారే"

మంత్రిగారికి ఎదురుగా కుర్చీలో కూర్చున్నారు. కూర్చున్న వెంటనే ఎక్కడికో పాతాళానికి దిగిపోతున్నట్టుగా అనిపించింది.

"ఏమిటి మాస్టారూ చెప్పండి. అంతా కులాసాయేనా?"

"అంతా ఎవరున్నారు నాయ్నా! మాయావిడ పోయి చాలా కాలమైంది.





పెద్దమ్మాయి కూడా అమధ్య కాలం చేసింది బాబూ"

"అలానా... అయ్యో పాపం.... ఎలా పోయిందండి?"

"ఎలా అని చెప్పేది బాబూ.... అంతా కర్మ. ఇక్కడే నర్సుగా పనిచేసేది బాబూ. అప్పుడే ఒక డాక్టరు వల్లో పడింది. పెళ్లీ పెటాకులూ లేకుండా కాపరంపెట్టారు. తర్వాత అతను అమెరికా వెళ్లి మళ్లీ తిరిగి రాలేదు. ఇక్కడ అది బిడ్డ తల్లి కూడా అయింది. తర్వాత అతను ఒక డాక్టర్ని వివాహం చేసుకున్నాడని తెల్సి నిద్ర మాత్రలు మింగి చనిపోయింది బాబూ"

"అయ్యో పాపం"

"అది అలా అయిపోయిందను కుంటే ఇప్పుడు చిన్నమ్మాయి ఇలా అయింది. అందుకే తమరి దగ్గరకొచ్చేను. నేనెన్నడూ ఎవర్నీ ఏదీ యాచించలేదు బాబూ! ఇప్పుడు తమర్ని...."

"ఆగండి...."

అదిరిపడ్డాడు వృద్ధుడు.

"ఏవిటి బాబూ...ఏమైనా....?"

"ఏంలేదు మాస్టారూ... మీరు నన్నలా సంబోధిస్తే ఏం బాగోలేదు. నన్ను తమరు అనకండి. నేను మీ విద్యార్థిని, మీచేత దెబ్బలు తిన్నవాడిని. మీరెంత ప్రయత్నించినా చదువుకోకుండా చెడిపోయాను...."

"చెడిపోవటం ఏవిటి నాయనా?"

"కాకపోతే ఏవిటి మాష్టారూ! ఈ పదవులు శాశ్వతమా ? చదువుకోవాలి మాష్టారూ. దాని అవసరం ఏవిటో ఇప్పుడే తెలుస్తోంది నాకు. నాకు చదువు గనక వుండి వుంటే జాతీయ స్థాయిలో వుండేవాణ్ని"

"ఇప్పుడైతే ఏమయింది. తమరికేం తక్కువయింది చెప్పండి"

"అదో... మళ్లీ అదే పిలుపు. నన్ను పేరుతోనే పిలవండి మాస్టారూ"

ఆ వృద్ధ ఉపాధ్యాయుడి మనస్సు ఉప్పొంగిపోయింది. ఎందుకూ పనికి రాడనుకున్నవాడుమంత్రి పదవినే అలంక రించేడు. విద్యార్థిగా తనని ఎన్నడూ గౌరవించి ఎరగనివాడు, ఇప్పుడు పెద్ద హోదాలో వుండి కూడా ఎంతో భక్తి ప్రపత్తులు చూపిస్తున్నాడు. అయినా ఎవరి స్థానం వారు గుర్తుంచుకోవటం మంచిదనుకున్నారు మాస్టారు.

"తప్పునాయ్నా! మీ ఉదార స్వాభావికత మీచేత అలా అనిపిస్తుంది గాని నా స్థానం ఏవిటో తెలీనివాణ్ని కాదు బాబూ. ఒక మంత్రిని, నాయకుణ్ని పట్టుకుని అలా పిలవలేను"

"పోనీ లెండి. అలా అనకపోయినా బాబూ, నాయనా అనైనా అనండి"

"అలాగే కదా నాయనా పిలుస్తు న్నది"

"ఊ.... ఇప్పుడు చెప్పండి. ఇందాక ఏదో రెండో అమ్మాయి గురించి చెబుతు న్నారు"

"అవును బాబూ... అది ఇక్కడే టెలిఫోన్సులో పనిచేస్తోంది"

"టెలిఫోన్స్ కేంద్ర ప్రభుత్వం ఇలాకా మాస్టారూ"

"దాని ఉద్యోగం గురించి నేనేం అడగటం లేదు నాయనా... కారు ఏక్సిడెంటులో బాగా దెబ్బలు తిని ఉస్మానియాలో వుంది"

మంత్రిగారి చెయి ఫోన్‌మీదికెళ్లింది.

"వాళ్లు సరిగా చూట్టం లేదా? చెప్ప మంటారా??"





"ఉహు... అక్కర్లేదు. వాళ్లు బాగానే చూస్తున్నారు. కాని..."

"చెప్పండి...ఏవిటి?"

"ఆ ఏక్సిడెంటు చేసింది ఎవరో తెలియలేదు. పోలీసులే ఆస్పత్రిలో చేర్పించారుట"

"మరి కేసు పెట్టరా?"

"ఉహూ... ఆ మాట అడిగితేనే 'నువెవడివి అడగటానికి' అని మెడ పట్టుకు బైటికి నెట్టేసేడు నాయనా ఇనస్పెక్టరు"

"అలాగా... ఎవడు వాడు?"

చెప్పేడు.

వెంటనే ఫోనెత్తి పిఏకి చెప్పేడు.

"నాంపల్లి పోలీస్ స్టేషన్‌కి ఫోన్జేసి ఎస్సయిని నాతో మాట్లాడమనండి"

వెంటనే మళ్ళీ ఫోనొచ్చింది.

"ఇన్‌స్పెక్టరు లేడుట సర్..."

"అయితే వచ్చిన వెంటనే వచ్చి నన్ను కలవమనండి"

మరో గంటలో చేతులు కట్టుకు హాజరయాడు ఎస్సయి.

"వీరు తెల్సా?"

"ఎక్కడో చూసినట్టే వుందండి"

"ఎక్కడో కాదు...పోలీస్‌స్టేషన్‌లో. మెడపట్టుకు బయటికి నెట్టేశావుటగా"

"............"

"ఏం... తెలీదూ?"

"ఆయన మీకు..."

"అంటే మంత్రికో, మరో అధికారికో బంధువో, తెల్సినవాడో అయితే తప్ప గౌరవించరన్నమాట మీరు"

"........."

"అంటే సామాన్య ప్రజలకు మీరిచ్చే గౌరవం ఇదేనన్న మాట!"

"క్షమించండి...తప్పయిపోయింది"

"ఊ...ఏక్సిడెంట్ చేసినవాళ్ళని ఎందుకు బుక్‌చెయ్యలేదు?"

"......"

"నేనడిగిందానికి సమాధానంచెప్పాలి"

"చెయ్యలేదు సార్"

"అదే...ఎందుకు చెయ్యలేదనేఅడుగుతున్నాను. పోనీ వాళ్ళెవరో తెల్సా?"

"......."

"అహా...తెలుసుండీ వాళ్ళని బుక్ చెయ్యలేదంటే చేతిలో బరువు పడిందన్న మాట"

"మరీ అంత నీచంగా చిత్రించకండి సర్ మమ్మల్ని"

"అభిమానం దెబ్బతిన్నట్టుందే. అయితే ఎవరో చెప్పటానికి ఏవిటి అభ్యంతరం?"

ఇనస్పెక్టరుకి సహనం చెదిరిపోతోంది.

"చెప్పమంటారా?"

"చెప్పమనేగా అడుగుతోంది"

కాస్సేపు నీళ్లు నమిలి—

"ఏక్సిడెంటు చేసింది విఠల్‌గారే నండి" అన్నాడు.

మంత్రిగారు ఖంగుతిన్నారు.

"ఏవిటీ.... మా పెద్దబ్బాయా?"

"చిత్తం..."

"ఒక్కడేనా?"

"ఇంకా వున్నారండి...."

"ఇంకెవరు?

"పద్మజగారు కూడా వున్నారండి"

"ఓహో... అలాగా..." ఆలోచనల్లోపడ్డారు మంత్రిగారు. కాని ఆందోళన ఇంతకు ముందంతటి తీవ్రంగా లేదు. కొంచెంసేపు తికమకపడ్డాక మెరుపులా ఒక ఎత్తుగడ ఆయన మనసులో తళుక్కుమంది.

"కేసు వెంటనే బుక్‌చేయండి"



మంత్రిగార్ని ఇంకా ఏడిపించాలని పించింది ఇనస్పెక్టరుకు.

"ఇద్దరూ తాగివున్నారండి"

"మరీ మంచిది. కేసుకు మరీ బలం వస్తుంది. ఇక వెళ్లండి ... మీ పని మీరు చెయ్యండి"

ఇనస్పెక్టర్ వెళ్ళిపోయాడు.

వచ్చింది వాడి జుట్టు నా గుప్పెట్లోకి అనుకున్నాడు నరహరి.

పద్మజకీ, తన కుమారరత్నానికీ మధ్య వ్యవహారం సాగుతోందని మంత్రి గారికి తెలియకపోలేదు. ఏ తప్పయినా బయటికి పొక్కనంతవరకూ ఆయన దృష్టిలో తప్పు కాదు. ఒకవేళ పొక్కినా అప్పుడు అవసరాన్నిబట్టి దాన్ని వాడుకో వచ్చు అనుకుని ఉపేక్షించేడు. ఆ అవసరం ఇప్పుడు ఆగమించింది. ఇప్పుడు పాచిక వెయ్యాలి.

"బాబూ...."

"ఏవిటి మేస్టారూ?"

"మిమ్మల్ని అనవసరంగా ఇబ్బందుల్లో పెట్టేనేమో"

"అలా ఎందుకు అనుకుంటున్నారు?"

"అది మన అబ్బాయే అంటున్నాడు ఇనస్పెక్టరు"

"అయితే మాత్రం?"

"ఒద్దు నాయనా! జరిగిందేదో జరిగి పోయింది. ఇంటి పరువు రచ్చకీడ్చటం అంత మంచిది కాదు. ఒద్దని చెప్పండి" అన్నాడు.

రాజకీయాల్లో వుండాల్సిన నైతిక విలువల గురించీ, ముఖ్యంగా అధికారంలో వున్నవారు పాటించాల్సిన నైతిక సాంప్రదాయాల గురించీ ఒక గంటసేపు ఉపన్యాసం దంచేసి, ముసలాయన్ని విసిగించేసి ఎలాగో ఒప్పించేసి మరీ పంపించేడు మంత్రిగారు.

మంత్రిగారి సద్గుణాలనే మననంచేసు కుంటూ హాస్పిటలు దారిపట్టారు మేస్టారు.

ఆయనలా హాస్పటల్ చేరేలోపే పోలీసుశాఖ లివర్సన్నీ కదిలేయి. లలిత ఏక్సిడెంటు కేసు కొట్టుకెళ్లింది.

మర్నాడు ఈ వార్తని ఇంచుమించు అన్ని పత్రికలూ ప్రకటించేయి. ప్రచారం ముమ్మరంగా సాగింది.

"మంత్రిగారి సతీమణితో మరో మంత్రిగారి పుత్రరత్నం ప్రేమయాత్ర. తాగివున్న మైకంలో ఒక అమ్మాయితో దేష్. అధికారుల వ్యవహారం కాబట్టి పోలీసులు కేసు అణిచేసే ప్రయత్నం"

ఈ వార్త వచ్చిన మర్నాడే హోం మంత్రిగారి రాజీనామా వార్త కూడా పేపర్లలో తాటికాయ ప్రమాణంలో వెలువడింది.

ఆ తర్వాత ఆ రాజీనామాకు కారణాలు ఉల్లేఖిస్తూ సుదీర్ఘమైన ఓ ప్రకటన కూడా చేసేరు మంత్రిగారు.



## మార్చి 14:సాయంత్రం 5గం

బేగంపేటలో విమానం దిగగానే పత్రికలవారు ప్రశ్నలవర్షం కురిపించేరు వెంకట్రావు మీద.

"మీరు మంత్రివర్గంనుంచి రాజీనామా



చయర ... 85

చేస్తున్నారా?"

ఆ ప్రశ్న ఎందుకు వేస్తున్నారో వాళ్లకు తెల్సినా ఏం చెప్పాలో మాత్రం వెంకట్రావుకు తెలీకుండా వుంది. మతిచెడి తాను వస్తుందే వీళ్ల దిక్కుమాలిన ప్రశ్న లొకటి.

వెంకట్రావుకి విసుగుపుట్టి-

"నేనెందుకు చేయాలి?" అని విసురుగా ఎదురుప్రశ్నవేసి పెద్దింటికి వెళ్లబోయినవాడు, పద్మజ ఇంటికి మళ్లేడు.

రాగానే నౌకర్ని అడిగేడు-

"అమ్మగారెక్కడ?"

"పడకగదిలో వున్నట్టున్నారండి"

బట్టలు మార్చుకుని వెంటనే పడగ్గదికి వెళ్లేడు.

పద్మజ పక్కమీద బోర్లా పడుకుని వుంది. పక్కనే సినిమా పత్రిక ఒకటి పడివుంది. ఆమె నిద్రపోతున్నట్టు లేదు.

భుజాలు పట్టుకుని పైకి తిప్పేడు. నిజంగానే ఆమె నిద్రపోవటం లేదు. ముఖంలో అలజడి, ఆందోళనా స్పష్టంగా కన్పిస్తున్నాయి. పశ్చాత్తాపం మాత్రం ఎక్కడా ఆమెలో పసిగట్టలేకపోయేడు. కాస్సేపు అలాగే ఆమెముఖంలోకిచూసి-

"ఏవిటిది?" అని అడిగేడు.

మాట్లాళేదు.

"నిన్నే...ఏవిటీ గందరగోళం అంతా"

"ఏముంది?"

"ఏం లేకపోతే ఈ అల్లరంతాదేనికి?"

మళ్లీ మౌనం.

"కారు ప్రమాదం ఒక సమస్యగాదు. ఇలాంటివి సవాలక్ష జరుగుతోవుంటాయి. కాని ఇది పరువు ప్రతిష్ఠలకి సంబంధించిన విషయం. నైతికంగా తల వంచుకో వల్సిన విషయం"

మాట్లాళేదు.

"అది నిజమేనా?"

"మీరు నమ్ముతున్నారా?"

"నేను నమ్మటం నమ్మకపోవటంకాదు ఇప్పటి సమస్య. ఇది దేశం నలుమూలలకి పాకిపోయింది"

మాట్లాళేదు.

"ఒకవేళ అది నిజమే అయినా నేను నిన్ను క్షమించగలను. కాని ప్రత్యర్థులు నన్ను క్షమిస్తారా? చిలవలూ పలవలూ తీసి ఇదో ప్రొఫ్యూమో కేసుగా తయారు చేస్తారు"

"ఇంతకీ ఎక్కడినించి వస్తున్నారప్పుడు?"

"గండిపేటనుంచి"

"అప్పుడే ఎందుకు తాగాల్సివచ్చింది?"

"పక్కమీదికి వెళ్ళేప్పుడు తాగుడు అలవాటుచేసింది మీరేగా"

"అయితే నిజమేనన్నమాట"

"ఏవిటి?"

"అతన్తో నీ సంబంధం"

"నిజమే..."

మాట్లాడకుండా బయటికి వెళ్లిపోయేడు మంత్రి వెంకట్రావు.



మార్చి 14 : రాత్రి 9.15

అరడజను మంది ఎమ్మెల్యేలూ, ఎమ్మెల్సీలు వెంకట్రావుగారి కోసం

ఆయన ఆఫీసు గదిలో ఎదురుచూస్తు న్నారు.

ఆయన రాగానే—

"ఇదెంతవరకూ నిజం?" అంటూ మొదలెట్టేడో ఎమ్మెల్సీ.

వెంకట్రావు గుండెల్లో గునపం గుచ్చి నట్లయి మెలితిరిగిపోయేడు. పద్మజ మీద వచ్చిన అవినీతి ఆరోపణల గురించే అడుగుతున్నాడేమోనని భయపడి పోయేడు. తనకు తెల్సినంతవరకూ అతడు ముఖ్యమంత్రి మనిషి. తనని పరిహసించటానికే పనిగట్టుకు వచ్చేడేమో నని అనుమానం కలిగింది.

"ఏ విషయం?" అని అడిగేడు.

"అదేనండీ...మీరు రాజీనామాచేసిన విషయం"

"ఎవరన్నారు?"

"ఎవరో అనడం ఏవిటండీ!.దేశమంతా కోడై కూస్తుంటేను. క్వార్టర్సులో అంతా ఇదే వార్త చెప్పుకుంటున్నారు. మీరు రాజీనామా చేసేరనీ, త్వరలోనే ఒక ప్రకటన కూడా చేయబోతున్నారనీ అనుకుంటున్నారు"

మంత్రిగారేం మాట్లాడలేదు. వాళ్ల నించి సాధ్యమైనంత సమాచారం రాబట్టా లని మౌనం వహించేరు.

"ఢిల్లీ వార్తలేవిటండీ?" అడిగాడు మరో ఆయన.

"రాష్ట్ర నాయకత్వంలో మార్పు రావాలని సూత్రప్రాయంగా హైకమాండ్ అంగీకరించింది. అయితే ఎవరు అనేది మరో సమావేశంలోగాని తేలదు"

"ఆ 'ఎవరు' మీరేనని ఊహాగానాలు రేగేయి"

ఆయన పలకలేదు.

"ఇలాంటి పరిస్థితుల్లో మీరు రాజీనామాచేయటం అంత మంచిదికాదు" మంత్రిపదవికోసం గుటకలు మింగుతోన్న ఒక ఎమ్మెల్యే సలహా.

"నేను రాజీనామా చేసేనని ఎవరన్నా రండీ" అన్నాడు విసుగ్గా వెంకట్రావు.

"చేయకపోతే మంచిదే. చేస్తేమట్టుకు మనం ఓడిపోయినట్టే. హోం మంత్రి ఎందుకు రాజీనామా చేసేడనుకుంటు న్నారు? మిమ్మల్ని వుసిగొల్పడానికే" అన్నాడు మొదటి ఎమ్మెల్యే.

"ఆయనెందుకు చేస్తాడండీ! అంతా నాటకం...రాజకీయపన్నాగం. ముఖ్య మంత్రీ ఆయనా కలిసి ఆడుతోన్న నాటకం"

ప్రస్తుత పరిస్థితి కొంతవరకు అర్థమైంది వెంకట్రావుకు. ఆ ఎమ్మెల్సీ చాలాకాలంగా ముఖ్యమంత్రికి అనుయా యుడే. కాని ఎంతోకాలంగా ఊరిస్తూ ఎంతకీ మంత్రి పదవి ఇవ్వకపోయేప్ప టికి ఇటీవల దారి మళ్ళేడని విన్నాడు. తను రాష్ట్రనాయకత్వం చేపడుతున్నా డని తెల్సి ఇటు మార్చి వుంటాడు దారి.

"ఏదియేమైనా మీరు మాత్రం తొందర పడకండి. వాళ్ళు కావల్సినంత ప్రచారం సాగిస్తున్నారు. అది మీ సహనాన్ని చంపటానికేగాని మరేం కాదు. అవన్నీ మీరు పట్టించుకోకూడదు"

"కావాలంటే బయట మేమూ మీకు అండగా నిలుస్తాం. మనకు కావల్సినంత బలగం వుంది" అన్నాడు సన్యాసి రాజు.

సన్యాసిరాజుకు మంత్రి పదవి మీద ఆశగాని, ఆసక్తిగాని లేదు. ఆయనకు కావల్సిందల్లా ఏదో కొన్ని చిన్నా పెద్దా పనులూ, లైసెన్సులూ, ముఖ్యంగా తన జిల్లాని అభివృద్ధిపర్చ

కోవటమున్నూ.

సన్యాసిరాజుకు బలగం వున్నమాట వాస్తవమే. ఆయన స్వంత జిల్లాలో మకుటంలేని మహారాజే. కావల్సినంత సాహసం కూడా వుంది. చాలినంత చదువైతేలేదుగాని తెలివికీ, చాకచక్యానికీ కొరతేం లేదు.

జిల్లా అంతా సన్యాసిరాజంటే హడలి ఛస్తారు. అతనికి అరడజను నూనె మిల్లులున్నాయి. అతనికి ఎదురు తిరిగిన వెధవల్ని నూనె మరలో వేసి గానుగాడేస్తాడుట.

సన్యాసిరాజు మొన్న మొన్నటివరకూ జిల్లాపరిషత్ ఛెయిర్మన్‌గా వుండేవాడు. ఆ కుర్చీకి 'జిల్లా బోర్డు ప్రెశిడెంటు' అని పేరున్నప్పట్నుంచీ ఆయనే అందులో కూర్చుంటున్నాడు. ఈమధ్యనే రాజకీయాల్లో కొంచెం వెసులుబాటు కలిగి ముఖ్యమంత్రి తన అనుయాయుణ్ని అందులో కూర్చోబెట్టేడు. సన్యాసికి మంత్రిపదవి ఆశపెట్టి ఆ కుర్చీలోంచి దించేసిన మాట వాస్తవమే. అది తెలగానే ఆయన చేసిన ప్రతిజ్ఞ ఏమిటంటే తన రాజకీయ ప్రత్యర్థి అయిన ముఖ్యమంత్రి మనిషిని జిల్లా రాజకీయాలనుంచి తొలగించటం.

అందుకుగాను తాను రాజకీయంగా బలపడాలి. తనవాళ్ళు అడిగిన పనులు కాదనకుండా చేసిపెట్టాలి. అలా జరగాలంటే ముఖ్యమంత్రిగా తనవాడురావాలి.

సన్యాసిరాజు ప్రణాళిక ఎలాంటిదైనా, ప్రస్తుత పరిస్థితుల్లో వెంకట్రావుకు అతను ఉపయోగపడే వ్యక్తిలానే కనిపించాడు.

"సరే...అయితే నన్ను కూడా కొంచెం ఆలోచించుకోనివ్వండి" అని అప్పటికి బైటపడ్డాడు.

"అయితే మేం వెళ్తొస్తాం" అన్నారు.

"అలాగే" అని లేవబోయేడు వెంకట్రావు.

"కూర్చోండి వెంకట్రావుగారూ ... లేవబోకండి" అని ఆయన్ని కూర్చోబెట్టి, "మీరు వెళ్ళండి..నేను నెమ్మదిగావస్తాను" అని లెజిస్లేటర్లని సాగనంపేడు సన్యాసిరాజు.

వాళ్ళు వెళ్ళిపోయేక-

"గదిలోకి ఎవరూ రారుగదా?" అని అడిగేడు.

"ఉహూ...ఎవరూ రారు చెప్పండి"

"ఏముందీ...మీ పద్మజగారు కొంప ముంచేసేరు" అన్నాడు.

"ఏవిటి?" అడిగేడు అమాయకంగా.

"మీ గుట్టంతా రచ్చకెక్కింది. మీ రహస్యాలన్నీ వాళ్ళకి చేరిపోయేయి"

"మీరు చెప్పేది అర్థంకావటంలేదు"

"మీరేమీ అనుకోపోతే అర్థమయ్యేట్టు చెబుతాను"

"ఏమనుకోన్లెండి...చెప్పండి" అని అభయంగా సన్యాసిరాజు చేయి పట్టుకున్నాడు.

"ఆడజాతిని నమ్మకూడదండీ ... మనం ఎంత నమ్మి వాళ్ళకి రహస్యాలు చెప్పినా వాళ్ళ దగ్గర దాగదు"

"ఇంతకీ ఏమిటండీ మీరు చెప్పేది?"

"ఏముంది... ఆవిడగారు ఆ నరహరి కొడుకు విఠల్‌ని మరిగింది. ఆ వేడిలో మీ విషయాలన్నీ అతనికి చెప్పేసింది. అదే అదననుకుని ఆ క్రూరవెధవ అంతా దేవుచేసి పెట్టుకున్నాడు"

తన ప్రేయసి గురించి ఒక పరాయి మనిషి అలా మాట్లాడ్డం వెంకట్రావుకి అవమానంగానే అనిపించింది. కాని ఒక





కొత్త విషయం వెలుగులోకి వచ్చింది. జరిగేదంతా ఒక ప్రణాళిక ప్రకారమే జరుగుతోందని అర్థమైంది. తను భార్యగా చెప్పుకున్నా పద్మజకు చెప్పిన రహస్యాలూ లేవు. వాళ్లకు తెల్సిందీ ఏమీ లేదు. అదంత ప్రమాదకరమైన విషయం ఏమీకాదు. కాని ఎత్తుకు పైఎత్తు వేయాల్సిన అవసరం ఇప్పుడు ఎంతయినా వుంది. ఈ రాజకీయ చదరంగంలో పద్మజ ఒక పావు. ఆ పావునే తనూ వాడుకోవాలి. ఫర్వాలేదు... పద్మజ అగ్నిసాక్షిగా తన భార్య అయిన మనిషి కాదు.

ఆ రహస్యాలు ఏవిటని మంత్రిగారు అడిగితే చెప్పాలని ఎదురు చూస్తున్నాడు సన్యాసిరాజు. కాని ఇంతలో టెలిఫోన్ మోగింది.

ఫోనెత్తేడు.

"ఆఁ....నేనే... ఏవిటి విశేషాలు?"

"ఆ... ఏమిటీ.... రామ్మూర్తి రాజీనామా చేసేడా? ఎందుకు?"

"వ్యక్తిగతమైన కారణాలంటాడా"

"సరే... అక్కడికి వస్తేవెంటనేనన్ను కలవమని చెప్పండి"

"అలాగేలే నేనూ ఫోన్జేసాను.... మీరు మాత్రం ఎలాగోలా పట్టుకుని ఇక్కడకు లాక్కురండి"

"ఓ.కే...." అని ఫోను పెట్టేసేడు.

సన్యాసిరాజు సంభాషణ అంతా శ్రద్ధగా విన్నాడు.

"రామ్మూర్తిగారు ఎందుకురాజీనామా చేసేరో నాకు తెల్సు" అని కాసేపు ఆగి...

"ఆయన మీకు మంచి మిత్రుడు. ఆయన ఆ పదవిలో వుండటానికూడా కారణం మీరేనని ఆయనకి బాగా తెల్సు"

"అయితే?"

"ఇప్పుడు పద్మజగారి మీద వచ్చిన కేసు ఆయనే వాదించాల్సి వుంటుంది"

"ఊఁ..."

"ఆయన అందర్లాంటి వాడు కాదు. ముక్కుసూటిగాపోయే మనిషి. అందుకే ఎందుకైనా మంచిదని తప్పుకున్నాడు"

"ఇందులో ఏముందండీ...అది వాడి వృత్తి ధర్మం. వాడి బాధ్యతని వాడు నిర్మొహమాటంగా నిర్వహిస్తే ఎవరు అడ్డొస్తారు? చూస్తూచూస్తూ వీడు పిల్లల్ని పస్తులు పెట్టే పరిస్థితులు చేజేతులా తెచ్చిపెట్టుకున్నాడే..."

రామ్మూర్తి రాజీనామా చాలా మనస్తాపం కలిగించింది వెంకట్రావుకు. అతనిమీద ఆయనకెంతో అభిమానం.

రామ్మూర్తికి ఫోన్చేసేడు. ఇంటి దగ్గరే వున్నాడు. చాలాసేపు మాట్లేడేక ఫోన్ పెట్టేసి-

"ఈ వెధవ ఎప్పటికీ బాగుపడడు" అని విసుక్కున్నాడు.

"రాజుగారూ... నా మనస్సేం బాగుండలేదు. మరోసారి కలుద్దాం" అని లేచేడు.

"అసలు చెప్పాల్సిన విషయాలన్నీ అలానే వుండిపోయేయి"

"నేనూ మీకు చెప్పుకోవల్సినవి చాలా వున్నాయి. మీ సలహా, సహాయం నాకు ఇప్పుడు ఎంతయినా అవసరం. అందుకు ప్రత్యేకమైన సమయం కావాలి"

"అయితే సరేలెండి..మళ్లీ కలుద్దాం"

* * *

నరహరి తన మంత్రి పదవికి రాజీనామా అయితే చేసేడుగాని ముఖ్యమంత్రి అంగీకరించలేదు. అందువలన తన విధులు యధావిధిగానే నిర్వహిస్తున్నాడు.






## మార్చి 14, రాత్రి: 2 గం.

నరహరి ఇంట్లో ఎంతసేపట్నుంచో ఫోన్ అలా మోగుతోనే వుంది. రాత్రంతా రాచకార్యాలు నిర్వహించి కాస్త మందు పుచ్చుకుని అప్పుడే పడుకున్నాడతను. మత్తుగా వుంది. కళ్లు విప్పాలంటే మహా భారంగానూ, చికాగ్గానూ వుంది. అయినా తప్పటంలేదు వెధవ ఫోను. జవాబు చెప్పటానికి పి.ఎ.కూడా లేని అపరాత్రి.

ఇప్పుడున్న పరిస్థితుల్లో ముఖ్యమైన విషయాలు ఇలాంటి వేళల్లోనే మాట్లాడుకోవాలి.

ఫోనెత్తేడు.

"హ...హ...ల్లో...."

"ఆ.... నేనే...హోం మంత్రిగార్నేనండీ....మాట ఆదోలావుందా? ఆ...ఏం లేదు నిద్రమత్తుకదండీ"

"ఏమిటీ?...డాక్టరుగారా? ఇంత రాత్రి వేళ..."

"అవున్లెండి. ఇలాంటి విషయాలు ఇలాంటప్పుడే మాట్లాడాలి. ఊఁ... ఇంతకీ...."

"ఆఁ... ఉహూఁ .... ఆ అమ్మాయి పోయిందన్నమాట! చాలా సంతోషం. దేశభక్తి అంటే అలా వుండాలండీ. దేశనాయకులు చెప్పారంటే నిప్పయినా, నీరయినా అలా దూకేయాలి ప్రజలు. ముఖ్యంగా మీలాంటి మేధావులు. అప్పుడే దేశం బాగుపడుతుంది"

"నేనుండగా ఎందుకండీ మీకు భయం? నేను చూసుకుంటాగా"

"అమ్మమ్మా...మీ విషయం మర్చిపోతానా? ద్రోహంకాదండీ...ముందు ఇది తేలనివ్వండి. తర్వాత ఆరోగ్యమంత్రిగారితో మాట్లాడి మీ పని చూస్తాను... సరేనా?"

ఫోను పెట్టేసేడు. మత్తు చాలావరకూ దిగిపోయింది. బుర్ర పాదరసంలా పని చేస్తోంది.

కేసు మాంచి రంజులో పడిందన్నమాట! రామ్మూర్తి రాజీనామా, లలిత చావు...

మురిసిపోయేడు.

అంతా బాగానే వుంది. రహస్యం మాత్రం పొక్కకుండా చూసుకోవాలి. ఆ డాక్టరుగాణ్ని ఏదోలా కట్టిపడెయ్యాలి. అందుకు వికల్ ఒక్కడే సమర్థుడు.

కొడుకుని నిద్రలేపి పని పురమాయించాలని అతని గది వైపు వెళ్లేడు. తలుపులు తెరిచేవున్నాయి. కొడుకు మాత్రం లేడు.

నరహరి మనసులో ఏవేవో అనుమానాలు తలెత్తి పడగవిప్పి ఆడటం మొదలెట్టేయి. పద్మజ దగ్గరకు పోయి వుంటాడని అతని గట్టి నమ్మకం. వెంకట్రావు వూళ్ళోనే వున్నాడే! మరి ఒళ్లు బలిసిన కోడి ఇల్లెక్కి కూసినట్టు వీడికి వేళాపాళా లేనట్టుందే. ఇలా అయితే వీడూ చదరంగంలో ఒక పావు కాక తప్పదు.

తర్వాత నరహరికి మరి నిద్రపట్టలేదు.

తెల్లవారేక ఆచూకీ చేశేడు. వెంకట్రావు వూళ్ళో లేడుట. ఆ ముందురోజే

టూర్ వెళ్లేడు. పద్మజ ఇంట్లోనే వుందిట. రాత్రినుంచీ ఆమెకూడా కన్పించటం లేదు.

కథ అడ్డం తిరిగిందా ఏవిటబ్బా!

ఏదో ఏడవరా అబ్బాయీ అంటే ఏకంగా దాన్ని లేవదీసుకుపోయేడా ఏవిటి? నిజంగా లేచిపోతే తన పరువేంకావాలి? ప్రజలకేం చెప్పుకోవాలి??

వెంటనే ఫోన్‌చేసి చెప్పవలసినవారికి చెప్పేడు.

మరుక్షణం అన్ని పోలీస్ స్టేషన్లకీ వైర్లెస్ సమాచారం వెళ్ళిపోయింది.



## మార్చి 15 : ఉదయం 6 గం.

లలిత మరణించేప్పటికి మాధవి దగ్గరే వుంది.

అంతా రెండు గంటల్లో జరిగి పోయింది.

రాత్రి పన్నెండు గంటలకు బాత్రూం కెళ్ళింది మాధవి. తిరిగి వార్డుకి వచ్చేప్పటికి డాక్టరొచ్చి వెళ్లినట్లు తెలిసింది.

ఆవేళప్పుడు డాక్టరు రాడే

వచ్చినా పేషెంట్లను చూడడే.

లలితకు ఆవేళప్పుడు ఇంజక్షను ఇవ్వాల్సిన అవసరం ఏం వచ్చింది?

లలిత వార్డులో చేరి ఇంచుమించు మూడు నెలలు కావస్తోంది. డిస్చార్జి చేయాల్సిన సమయం కూడా ఆసన్నమైంది. ఆరోగ్యంగావున్న మనిషికి ఇంజక్షను చేయాల్సి రావటం ఆశ్చర్యమే.

ఈ ఆలోచనలన్నీ మాధవికి అప్పుడు కలగలేదు. లలితచెప్తే విని ఊరుకుంది.

మంత్రిగారు ఫోన్‌చేసి వుంటారు. అసలే పైవాళ్ళ ప్రాపకంకోసం పాకులాడే ఆ డాక్టరు అలాంటి సమయాల్లో రావటం కూడా ఆమెకు అంతగా ఆశ్చర్యం కలిగించలేదు.

కాని ఒంటిగంట ప్రాంతంలో లలిత పల్స్ క్షీణించటం ప్రారంభించింది.

డ్యూటీ డాక్టరుకు ఫోన్‌చేసింది మాధవి.

ఆయన వచ్చి పరీక్షచేసి...

"లాభంలేదు... చేయిదాటిపోయింది" అన్నాడు.

"ఏవిటి డాక్టర్?"

"ఈ పేషెంటు మీకు బాగాతెల్సా?"

"ఆ(... బాగా తెల్సు"

"ఈమెకు జీవితంమీద విరక్తా?"

"ఎందుకు?"

"ఏమో... ఇది సూయిసైడ్ కేసులా వుంది" అని లేచి వెళ్ళిపోయేడు.

మరో పది నిమిషాల్లో పోయింది లలిత.

లలిత మరణానికి కారణం ఎవరు?

డాక్టరు అన్నట్టు అది ఆత్మహత్యా??

పోస్టుమార్టం చేయాలని పట్టుబట్టింది మాధవి.

"పోయింతర్వాత ఇంకేం చేస్తే ఏం లాభమమ్మా" అన్నాడు లలిత తండ్రి.

"పోస్టుమార్టం అక్కర్లేదు" అన్నాడు డాక్టర్.

"అలాక్కాదు. పోస్టుమార్టం చేసి తీరాలి నాకేదో అనుమానంగా వుంది" అంది మాధవి.

"అంటే?"

"అంటే ఏమిటో నాకు తెలీదు. తెల్సుకోడానికే పోస్టుమార్టం చేయించమని అడుగుతున్నాను"

"అక్కర్లేదు" అని వెళ్లిపోయాడు డాక్టర్.

లలిత తండ్రిని తీసుకుని సూపరింటెండెంటును కల్సింది మాధవి.

"మీ అనుమానానికి అర్థం లేదుసిష్టర్" అన్నాడు సూపర్నెంటు.

"లేదు డాక్టర్! మా బాస్ 12 గం.లకు వచ్చి ఇంజక్షనిచ్చాకనే ఇలా జరిగింది"

"ఇంజక్షనిచ్చినట్టు కేస్ షీట్లో వుందా?"

"లేదు"

"అయితే ఆయనే ఇంజక్షనిచ్చినట్టు ఆధారం ఏం వుంది?"

"పేషెంటే నాతో స్వయంగా చెప్పింది డాక్టర్. ఇంజక్షనిచ్చినప్పట్నుంచీ ఏదోలా వుందని చెప్పింది"

"ఆల్రైట్.... మీ అనుమానాన్ని ఎందుకు సప్రెస్ చేయాలి. పోస్టుమార్టం చేయిద్దాం"

పోస్టుమార్టంకి ఆర్డరు వేసేడు సూపరింటెండెంటు.

మర్నాటి మధ్యాహ్నం లలిత పోస్టుమార్టం రిపోర్టు వచ్చింది.

తనే దగ్గరుండి చేయించితీసుకొచ్చింది మాధవి.

ఆమె అనుమానం నిజమే అయింది.

రక్తంలో సెకొనాల్ సోడియం కన్పించింది.

అయితే అది ఆత్మహత్యా?

కావచ్చు. కాని సెకొనాల్ సోడియం లలితకి ఎట్లా వస్తుంది. హాస్పిటల్లోకూడా ఆ డ్రగ్స్ చాలా అరుదుగా వుంచుతారు. అలాంటప్పుడు లలితకు చిక్కే అవకాశం ఎక్కడిది?

అంటే...?

డాక్టరే ఆ ఇంజక్షను ఇచ్చివుంటాలి. క్లినికల్ రిపోర్టులో నరాల రంగు పచ్చగా వున్నట్టుగా వుంది కాబట్టి అది ఇంజక్షనే అయివుంటాలి.

మాధవి ఒక అభిప్రాయానికి వచ్చేసింది.

కాని డాక్టరు అట్లా ఎందుకు చేస్తాడు?

లలిత చనిపోతే ఆ డాక్టరుకు ఏమిటి లాభం?

ఈ ప్రశ్నలు మాధవిని వేధిసూనే వున్నాయి. కేసు ఇన్వెస్టిగేషన్ చేయవల్సిందిగా లలిత నాన్నగారిచేత కాగితం పెట్టించింది.

"ఎందుకొచ్చిన గొడవలమ్మా ఇవన్నీ. ఆ తల్లి పోనేపోయింది" అని వారించేడు లలిత నాన్నగారు.

"లలితను ఎవరో హత్య చేశారని నా అనుమానం బాబాయ్. అదేదో తేల్చుకోవటమే మంచిది" అని పట్టుబట్టింది మాధవి.

• • •

అదే సాయంత్రం మరో ఊళ్లో మంత్రి వెంకట్రావుగారు సతీసమేతంగా ప్రభుత్వ విశ్రాంతి భవనంలో విడిది చేసేరు.

వీరు దిగినక్షణంనుంచీ సన్యాసిరాజూ, అతని బలగమూ అక్కడే వుంది. వారంతా మంత్రిగారి అడుగులకు మడుగులొత్తుతూ స్వామి భక్తిపరాయణులనిపించుకుంటున్నారు. వారి ఆశ్రితజనం అంతా అక్కడే వున్నా పద్మజ ఉనికి మాత్రం ఎవరికీ తెలీదు.

సన్యాసిరాజు చేస్తున్న పకడ్బందీ





అంతా చూసి—

"ఎందుకింత రహస్యం. వాళ్ళంతా మనవాళ్ళేగా!" అన్నాడు వెంక్రటావు మాటవరసకి.

"అమ్మో...అలా అనమాకండి. వాళ్ళెప్పుడూ మనవాళ్ళుగానే ఉండిపోతారనుకుంటున్నారా? రేపు రాబోయే సంక్షోభంలో ఎవరికి ఎవరో"

వెంక్రటావుకి కొన్ని అనుమానాలు రేగేయి. ఇంతకీ సన్యాసిరాజును నమ్మవచ్చా, నమ్మకూడదా?

తను చేయబోయే ఈ మహాయజ్ఞాన్ని అతని చేతుల మీదుగానే జరిపించాలని నిర్ణయించుకున్నాడు.

ఏం చేసినా బురద మన చేతికి అంటకుండా చేయాలి మరి.

చీకటి పడింది. ఆ చీకటి తెర జారి ఎవరి జీవితం మీదకో విస్తరించబోతోంది.

భోజనాలయ్యేక వెంక్రటావూ, సన్యాసిరాజూ సమాలోచనలోపడ్డారు. బలగం అంతా సినిమాకో, మరి దేనికో సర్దుకున్నారు.

పద్మజ లోపలిగదిలో పడుకునివుంది. ఆమె చేతిలో ఒక పత్రిక వుంది. బోర్లా పడుకుని కాళ్ళు పైకెత్తి ఆడిస్తో పత్రిక తెరిచి పట్టుకుని వారఫలాలు చూసుకుంటోంది.

బయట మరోగదిలో ఆమె గ్రహబలం నిర్ణయించబడుతోంది.

ఏర్పాట్లన్నీ పకడ్బందీగా జరిగిపోయేయి.

"మీకేమయినా కక్షలున్నాయా?" అనడిగేడు సన్యాసిరాజు.

"అంటే..."

"అంటే మరేంలేదు. కసి తీర్చుకోటానికి ఏమైనా చేయాలని వుందా మీకు?"

మాట్లాడలేదు.

"నా కైతే కొన్ని అలవాట్లున్నాయి. ఏమన్నా చేయదల్చుకుంటే అదేదో నా చేతుల్తోనే చేసి కసి తీర్చుకుంటాను" అన్నాడు. అందుకు ఆధారంగా కొన్ని సంఘటనలు చెప్పేడు సన్యాసిరాజు.

వెంక్రటావుకు ఒళ్లు జలదరించింది.

ఇంత కసాయివాడా సన్యాసిరాజు అనుకున్నాడు. ఏమైనాసరే నిర్ణయంలో మార్పు వుండకూడదు.

"నాకు అలాంటివేం లేవు. మీరే..." అని బైటకొచ్చి లాన్‌లో తనకోసం వేసి వుంచిన కుర్చీలో కూర్చొన్నాడు.

సన్యాసిరాజు బయటికివచ్చి డ్రైవర్ని పిల్చేడు.

"రెడీయేనా?"

"రెడీయేనండి"

మెల్లగా నడిచివెళ్ళి పద్మజ గది దగ్గర నుంచున్నాడు సన్యాసిరాజు.

"అమ్మగారూ"

పద్మజ లేచి బయటికి వచ్చింది.

"నిన్న పట్టు చీరల గురించి అడిగారుగా"

"అవును. మంచివేమైనా వచ్చేయా?"

"వచ్చేయిగాని పెళ్ళిళ్ళ సీజనుగదమ్మా... వెంటనే వెళ్ళకపోతే చెల్లిపోతాయి. చెప్పే పెట్టాననుకోండి. అయినా ఎందుకైనా మంచిది కాస్త తొందరగా వెళ్తే...."

"ఎప్పుడు వెళదామంటున్నారు?"

"మీ ఇష్టం. ఇప్పుడైతే మరీ మంచిది"

"ఆయన కూడా వస్తున్నారా?"

"లేదమ్మా... వారికి ఇంకా చాలా పనులున్నాయి. ఎవరో రావల్సివుంది. వారితో కొన్ని వ్యవహారాలు జరూరుగా మాట్లాడాలి"

"అయితే బయట వుండండి... ఇప్పుడే వచ్చేస్తాను" డ్రెస్ చేసుకోడానికి లోపలి కెళ్ళింది పద్మజ.

పావుగంటలో అలంకరణ ముగించుకుని లాన్‌లోకొచ్చి భర్త ముందు నిలబడింది.

"మీరు రారా?" అడిగింది భర్తను.

"ఊహూ... ఇక్కడ కొన్ని పనులు వున్నాయి"

ఇంతలో సన్యాసిరాజు దగ్గరికొచ్చేడు.

"నేను చెప్పానుగదమ్మా! ఆయనికి అర్జంటు పనులున్నాయని. అయినా ఆయన రావటం అంత మంచిది కాదు. అసలే రాజకీయాలు అల్లకల్లోలంగా వున్నాయి. ఇదిగో పులి అంటే అదుగో తోక అనే రకం మనుషులు. రేపు ఏం పోయి ఏమైనా ఆయన రాజకీయ జీవితానికే ఎసరొస్తది"

"సరే.... పదండి"

పద్మజ వెళ్లి కార్లో కూర్చొంది.



**మార్చి 18:**

**ఉదయం : 9.15**

పోలీసు రిపోర్టును పరిశీలిస్తున్నాడు నరహరి. పి. ఎ. పక్కనే కూర్చొన్నాడు.

"శ్రీశైలం వెళ్లాడని తెల్సినప్పుడు మనిషి ఏమౌతాడు? వాళ్లిద్దరూ ఎక్కడో తిరుగుతూ వుండాలిగా?"

"అవును సర్... కాని మనుషుల ఆచూకీ తెలియలేదంటున్నారు సర్"

"ఏవిటిది! నా కేసే దర్యాప్తు సరిగ్గా జరక్కపోతే ఇక మామూలువాళ్ల సంగతి చెప్పాలా. ఐ. జి. పి.కి ఒకసారి ఫోన్జేసి కలవమని చెప్పండి" అని లేవబోయాడు.

ఎదురుగా బిక్కమొగం వేసుకుని ప్రత్యక్షమయ్యేడు విశాల్.

"ఏరా...ఎక్కడున్నావు ఇన్నాళ్లూ?"

విశాల్ మాట్లాడలేదు. వెర్రిచూపులు చూస్తో వుండిపోయేడు.

"దాన్తోనేగా వెళ్ళేవు?"

ఇక నోరు విప్పక తప్పదు.

"ఎవరితోటి మీరనేది?"

"ఏం....నా నోటితోనే చెప్పించాలనా? నువ్వింతకాలం మాయమైంది ఆ వెంకట్రావు పెళ్ళాంతోగాదూ?"

"అబద్ధం...పచ్చి అబద్ధం" గట్టిగా అరిచేడు విశాల్.

"గట్టిగా అరిస్తే అబద్ధం అయిపోదు. ఇది పచ్చి నిజం. మీ ఇద్దరి పేర్లూ శ్రీశైలం గెస్ట్‌హౌస్ రిజిష్టర్లో మొగుడూ పెళ్ళాలుగా నమోదయి వున్నాయి. మీరు ఆరో నంబరు గదిలో దిగేరు"

"లేదు నాన్నగారూ! నేను నిజమే చెబుతున్నాను. నేను ఆమెను చూసి చాలా రోజులైంది"

"ఇది పోలీసు రిపోర్టోయ్. అల్లాటప్పా కాదు. ఇన్స్పెక్టర్ జనరల్ స్వయంగా సంతకం చేసి పంపించిన రిపోర్టు"

"అయితే పోలీస్‌శాఖ అంత బాగా పన్జేస్తోందన్నమాట! అసలు విషయం




వాళ్ళకు తెలిసే తెలీలేదు. కట్టుకథ ఒకటి పట్టుకుని మీ దగ్గరికొచ్చినట్టున్నారు"

"ఆఁ... అయితే ఎక్కడున్నావు ఇన్నాళ్లూ?"

"బందిఖానాలో. అదెక్కడో నాకే తెలీదు. ఎవరో తెలీని వ్యక్తులు నన్ను ఎత్తుకుపోయి నిర్బంధించేరు. ఇవాళ చీకటి వుండగానే తీసుకొచ్చి జూబిలీ హిల్స్ స్మశానం దగ్గర ఒదిలేసేరు"

"ఆఁ... కిడ్నేప్.... హోంమంత్రి ఇంట్లోంచి... హోంమంత్రి కొడుకుని ఎత్తుకుపోవటం? ఒహ్హో!"

రాజకీయుడు సరహరికి అనుమానాలు ఒకదాని వెంబడి ఒకటి తన్నుకువచ్చేయి. వెంటనే ఆంతరంగిక మందిరంలోకి చొరబడి ఆలోచన్లు మొదలెట్టేడు.

"ఏమిటి? ఓడిపోతున్నానా?"

* * *

భార్య కనిపించటంలేదని పోలీస్ రిపోర్టిచ్చేడు వెంకట్రావు.

సీనియర్ మినిష్టరు. అందులోనూ ముఖ్యమంత్రి కాగలడనే బలమైన నమ్మకం ఉద్యోగుల్లో ఏర్పడిపోయింది. ఇక పోలీసుల సంగతి చెప్పనే అక్కర్లేదు. వాళ్ళకి మంచి కసరత్తు మొదలైంది.

ఆమె గురించి అంతకుముందే కొంత సమాచారం సేకరించి వుంచేరు. శ్రీశైలం గెస్ట్‌హౌస్‌లో హోంమంత్రిగారి అబ్బాయితో ఆమె విడిది చేసినట్టు సమాచారం అందింది. అంచేత అక్కడే గాలింపు విస్తృతం చేసేరు.

అనతికాలంలోనే మంత్రిగారి అందాల సతి శవం శ్రీశైలం గుట్టల్లో పోలీసుల కంట పడింది. ఇంకా గుర్తించటానికి వీల్లే నంతగా శవం చెడిపోలేదు.

పీక పిసికి చంపేసినట్టుగా శవ పరీక్షలో ధృవపడింది.

పరిశోధన ప్రారంభమైంది.

వెంకట్రావుగారు తన మంత్రిపదవికి రాజీనామా చేసినట్టుగా పత్రికల్లో వార్త లొచ్చేయి. వెంకట్రావుగారి పత్రికా ప్రకటన కూడా వెలువడింది.

'ఇంత జరిగాక, గుండెలమీద సమ్మెట పోటును భరిస్తూ ఇంక నా బాధ్యతల్ని నిర్వహించలేను. అందుకే మంత్రివర్గం నుంచి వైదొలగిపోతున్నాను' అని దాని సారాంశం.

వెంకట్రావు రాజీనామాను అంగీక రించటానికి అట్టేకాలం పట్టలేదు. గవర్నరు అంగీకరించినట్టు వెంటనే ప్రకటనవచ్చింది.

* * *

వెంకట్రావు మంత్రివర్గంనుంచి తప్పు కున్నాక పద్మజ హత్య వివరాలు ఒకొక్కటే పత్రికల్లో వచ్చేయి.

వెంకట్రావు కేంపుకు వెళ్లేక విఠల్ పద్మజను కలుసుకున్నాడు. అతను రాగానే ఆమె పనివాళ్లనందర్నీ పంపించి వేసింది. గంట తర్వాత వాళ్లు వచ్చేటప్ప టికి ఆమె బయటికి వెళ్ళిపోయిందని తెల్సింది.

పద్మజ, విఠల్ శ్రీశైలం గెస్టుహౌస్‌లో భార్యాభర్తలుగా ఒక సూట్ తీసు కున్నారు. గెస్టుహౌస్ ఉద్యోగుల కథనం ప్రకారం వాళ్లు ఆ ముందురోజు అంతా బయట తిరిగేరు. ఆ మర్నాడు అంటే మార్చి పదహారో తేదీన సాయంత్రం నాలుగ్గంటలకు ఇద్దరూ బయటికి వెళ్ళి పోయేరు. రాత్రి 9గంటల ప్రాంతంలో విఠల్ ఒక్కడే తిరిగివచ్చేడు. అంటే 16వ తేదీ రాత్రి మాత్రమే హత్య జరిగి వుండాలి.

ఈ వార్తలు బయటికి వచ్చేక అలజడి

 

ప్రారంభమైంది. 'ఈ కేసులో న్యాయం జరగాలంటే హోంమంత్రి రాజీనామా చేయాలి. అంతేకాదు — హోంమంత్రికి కొమ్ముకాస్తోన్న ముఖ్యమంత్రి కూడా తన పదవినించి దిగిపోవాలి' ఈ కోర్కెలతో అలజడి ప్రారంభించేరు. గవర్నరుకు ఒక వినతి పత్రాన్ని కూడా సమర్పించేరు.

అల్లరి మొదలయింది.

అది ప్రారంభం కావటమే ఆలస్యం, కానీ ఆ తర్వాతి తతంగానికి ఆలస్యం అంటూ వుండదు. ఇది ఒక ఉద్యమంగా రూపొంది నాయకుల చేతుల్లో ఉవ్వెత్తున పొంగింది. బస్సులు, ఇతర ప్రభుత్వ ఆస్థుల ధ్వంసం, పోలీసుల కాల్పులు, దమనకాండ, ప్రజల తిరుగుబాటు....అలా కొనసాగి అణచిపెట్ట లేనంత అల్లరి చెలరేగింది.

ఫలితంగా ముఖ్యమంత్రి రాజీనామా చేసేడు. నిజానికి ఢిల్లీ ఆయనచేత రాజీనామా చేయించింది.

* * *

పద్మజ హత్యతో విఠల్‌కు ప్రత్యక్ష సంబంధం వున్నట్టు పోలీసులకు ఆధారాలు దొరకటంతో విచారణ ప్రారంభం కాక ముసుపే అదుపులోకి తీసుకున్నారతన్ని.

అంతకుముందే పద్మజ మీదా, విఠల్ మీదా ఒక నేరం సమోదైవుంది.

ప్రభుత్వం తరఫున పోలీసుశాఖ పద్మజ కేసును కోర్టులో దాఖలు చేసింది. అంచేత పబ్లిక్ ప్రాసిక్యూటర్ వాది తరఫున వకాల్తా చేపట్టేడు. కాని అతని వాదన డిఫెన్సు ముందు పేలవం అయి పోతోంది. ప్రాసిక్యూటర్‌ను అణచిపెట్టేస్తున్నారేమోనని అనుమానం కలిగింది వెంకట్రావుకు. కేసు వీగిపోవటం అతనికి ఇష్టం లేదు. ఈ కేసుతోనే తన రాజకీయ ప్రత్యర్థులను మట్టుపెట్టాలని నిశ్చయించుకున్నాడు. వాళ్ల వేలుతోనే వాళ్లకళ్లు పొడవాలి.అదీ అతనివ్యూహం.

ఇలా అనుకున్నప్పుడే అతని దృష్టిలో రామ్మూర్తి మెదిలేడు. రామ్మూర్తికి ప్రాక్టీసు పెద్దగా లేకపోవచ్చు. అంత మాత్రంచేత అతనికి న్యాయశాస్త్రం తెలీదని అనుకోకూడదు. అతనికి న్యాయశాస్త్రంమీద మంచి పాండిత్యం వుంది. అందుకే అతన్ని పిల్చి కేసు అప్పజెప్పాలని అనుకుంటున్నాడు వెంకట్రావు. ఇంతలో రామ్మూర్తే అతన్ని చూడ్డానికి వచ్చేడు.

కేసు బలాబలాలగురించి రామ్మూర్తితో చర్చించేడు వెంకట్రావు.

"కేసు బలహీనపడిపోతోంది. నేను వకాల్తా వే యా ల ను కు ం టు న్నా ను" అన్నాడు రామ్మూర్తే.

"సరిగ్గా అదే ఆలోచన నాకూ వచ్చింది. నీకు ఫోన్ చేద్దాం అనుకుంటున్న సమయానికే వచ్చేవు"

"కేసు ఈ ధోరణిలో నడిస్తే మన పరువు మంటగలిసిపోతుంది. ఒక ప్రజానాయకుడి భార్య వ్యభిచరించింది అనే రంగు పడకుండా జాగ్రత్తపడాలి. ఇది కేవలం రాజకీయ చదరంగంగా మాత్రమే చిత్రణ జరగాలి"

"ఏం చేస్తావో నాకు తెలీదు. నాకు కావల్సిందల్లా ఒక్కటే. ఇది రాజకీయంగా జరిగిన హత్యగా ప్రజల్లో తెలియాలి"

''పత్రికలవాళ్లని కొంచెం జాగ్రత్తగా చూసుకో, కోర్టు గొ డ వ ం తా నాకు వదిలెయ్'' అని లేవబోయేడు రామ్మూర్తి.

"అప్పుడే లేస్తావేరా? ఇద్దరం తీరిగ్గా కూర్చుని ఎంత కాలమైంది. ఇన్నేళ్ళలో ఒక్కసారయినా మనం ఇలా కూర్చున్నామా? కూర్చో కాస్సేపు ... ఏదేనా

మాట్లాడు."
రామ్మూర్తి మళ్ళీ కూర్చున్నాడు.
"ఉద్యోగం వదిలేసేవు. ఎలా నడుస్తోంది సంసారం" అంటూ ప్రారంభించేడు వెంకట్రావు.
"సంసారానికేం! హాయిగా నడుస్తోంది"
"అవునులే.నీకు అలానే అనిపిసుంది. పాపం ఆ ఇల్లాలుగా పాట్లన్నీ పడేది?"
రామ్మూర్తి కాస్సేపు మౌనంగా ఉండిపోయేడు. బహుశా అతని మనసులో పార్వతి మెదిలివుంటుంది.
పాపం తనని కట్టుకుని పేదరికం చక్కగా చవిచూస్తోంది.
ఆ సమయంలో వెంకట్రావుకూ పార్వతే గుర్తుకు వచ్చింది.
ఆ దంపతులంటే వెంకట్రావుకి చాలా ఇష్టం. అసలు వాళ్ళ పెళ్ళికి బాధ్యుడు అతనే. ఆమె కొంచెం వున్న కుటుంబం నుంచే వచ్చింది. అయినా పేదవాడు రామ్మూర్తిని కట్టుకున్నందుకు ఆమె ఎన్నడూ విచారించలేదు. అతను దొరకటమే మహా భాగ్యంగా తలుస్తుంది.



## ఏప్రిల్ 4:
## మధ్యాహ్నం 4 గం.

అపరేషన్లన్నీ ముగించుకుని డాక్టర్లు రౌండ్స్‌కి వచ్చే సమయం. కేస్‌షీట్లన్నీ తీసి బెడ్స్‌మీద పెడుతోంది సిస్టర్ మాధవి. సూపరింటెండెంటు దగ్గరుండే వార్డుబాయ్ వచ్చేడు.
"సిస్టర్ ... సారు పిలుస్తున్నారు" అని చెప్పేడు.
"డాక్టర్స్ రౌండ్స్‌కొచ్చేవేళ...కాసేపు ఆగివస్తాను"
"ఇప్పుడే రమ్మన్నారు" అన్నాడు వార్డుబాయ్.
వార్డు డ్రెయినీస్‌కి అప్పజెప్పి సూపరింటెండెంట్ రూంకెళ్ళింది. ఆయన ఏవో ఫైల్స్ ముందుపెట్టుకుని కూర్చుని వున్నాడు.
"కమిన్ సిస్టర్ .... కూర్చోండి"
కూర్చుంది మాధవి.
"మీరు మార్చి 14 రాత్రి డ్యూటీలో వున్నారా?"
"వున్నాను డాక్టర్..."
"సాధారణంగా మీరు డాక్టర్ ఆర్డరు మీదే ఇంజక్షను గాని, మరే డ్రగ్గయినా ఇస్తూవుంటారా?లేక మీరే చొరవ తీసుకుని అవసరమైనప్పుడు ఇస్తూ వుంటారా?"
"అదేవిటిసార్..డాక్టర్లు రాయకుండా సిస్టర్స్ ఎట్లా ఇస్తారు మందులు...?"
"ఒకో అప్పుడు అలాంటి పరిస్థితులు కూడా ఏర్పడుతూ వుంటాయి... ఆరోజు రాత్రి అలా చొరవతీసుకుని లలిత అనే పేషెంటుకి మీరేమైనా ఇంజక్షను ఇచ్చారా?"
అప్పటికే సగం ప్రాణం పోయింది మాధవికి.
"ఆరోజు డాక్టరే ఇంజక్షనిచ్చారు సర్"
"కావచ్చమ్మా... ఆ టైంలో వార్డుకి డాక్టర్ రాడు.నువ్వు డ్యూటీలో వున్నావు. ఆ అమ్మాయికి పోయిజన్ ఇంజక్టు చేసి

నట్టుగా ఋజువైంది"

"అంటే...?"

"ఎలా చెప్పనమ్మా ... తిరిగి నీ మీదికే నేరం పచ్చిపడింది"

"అన్యాయం డాక్టర్" అప్పటికే ఆమె కళ్లల్లో నీళ్లు నిలిచేయి.

"అన్యాయం అని నాకూతెల్సు సిస్టర్! ఏం చేసేది ... ఇన్వెస్టిగేషన్‌లో నువ్వు గిల్టీ అని తేలింది" అన్నాడు.

"న్యాయశాస్త్రం ప్రకారం ఏం చేస్తారో నాకు తెలీదు. కాని పరిపాలనా విధానం ప్రకారం నిన్ను సస్పెండు చేయక తప్పటల్లేదు సిస్టర్..అయాం వెరీ సారీ"

మరి మాట్లాడలేకపోయింది మాధవి.

"ఇక వెళ్లండి..." అన్నాడు.

ఆమె కదల్లేదు.

బెల్ నొక్కితే వార్డుబోయ్ లోపలి కొచ్చేడు.

"చూడు..ఆమెనింక వెళ్లమని చెప్పు" అన్నాడు.

వార్డుబోయ్ మాధవి ముందుకొచ్చాడు.

"ఇక లేపండి సిస్టర్...మిమ్మల్నే..."

"లేదు... నేను చంపలేదు. లలితను నేను చంపలేదు. డాక్టరే చంపాడు... డాక్టరే చంపాడు" అని అరుస్తూ పరుగెత్తి పోయింది మాధవి.



ఏప్రిల్ 10: 11.30 ని

కోర్టు విచారణకు కూర్చుంది. హాలంతా జనంతో కిటకిటలాడుతోంది.

పద్మజ హత్యకేసు విచారణలో ఒక కొత్తమలుపు ఏర్పడింది. గాలి ఎదురు తిరిగి వీయటం ప్రారంభించింది. సాక్ష్యాలూ, పరీక్షలూ, వాటి సారాంశం ఎప్పటికప్పుడు పత్రికల్లో ప్రచురణ అవుతున్నాయి. ఒక్కొక్కరి దృక్కోణం నించీ కథనం ఒక్కోరకంగా సాగింది.

సబ్ ఇనస్పెక్టర్ సాక్ష్యంతో విచారణ ప్రారంభమయింది.

"ఆరోజు రాత్రి పదిగంటలు దాటింది ఇక ఇంటికి వెళ్ళిపోదాం అనుకుంటోన్న సమయానికి స్టేషన్ ముందు ఓ కారాగింది. వెంటనే ఒక కానిస్టేబిలు పరుగెత్తు కొచ్చి—

'హోం మంత్రిగారి అబ్బాయి వచ్చారు సర్' అని చెప్పేడు.

హోం మంత్రిగారి అబ్బాయి అంటే మా డిపార్టుమెంటులో ఓ చిన్న తరహా యువరాజు.

లేచి పరుగెత్తుకెళ్లేను.

"దార్లో ఏక్సిడెంటయింది. అదుగో... ఆ అమ్మాయి కారుకింద పడింది. తీసుకెళ్లి హాస్పిటల్లో చేర్పించండి" అని ఆజ్ఞాపించేడు. ఆ ఆజ్ఞని శిరసావహించాల్సిన అవసరం మాకు తెలియాలి తప్ప మరెవ్వరికీ తెలీదు.

అతను కారు దిగి కిందికివచ్చేడు. అతనితోపాటు ఓ సుందరికూడా దిగింది. ఆమెను నేనెరగను. కాని కానిస్టేబిలు గుర్తించి సేల్యూట్ చేసేడు. ఆమె ఓ మంత్రిగారి ప్రియురాలుట.

మేం హాస్పిటల్‌నుంచి తిరిగివచ్చేప్పటికి ఒంటిగంట అయింది.

"ఏమన్నాడు డాక్టరు?" అనడిగేడు.

"తలకు బలమైన గాయం తగిలిం దన్నాడు"

"బతుకుతుందా?"

"అనుమానంగా చెప్పేరు"

"ఊ... బండి తీసుకెళ్లి ఎక్కడైనా బంకులో వెనకసీటు క్లీన్ చేయించుకు రండి"

వెళ్లి టార్చివేసి చూసేను. వెనక సీటంతా రక్తంతో తడిసివుంది.

"ఇంతరాత్రి వేళ..."

"ఇది రాత్రని నాకు తెలీదంటారా? పోలీసులు లేపితే లేవని వాడుంటాడా?"

వెళ్లక తప్పలేదు.

వెళ్లిపోతూ ఒక వార్నింగ్ కూడా ఇచ్చేరు.

"చూడూ .... ఈ రహస్యం బయటపడగూడదు"

కాని ఆ రహస్యంకాస్త బయటపెట్టక తప్పలేదు. సాక్షాత్తూ హోం మంత్రిగారే నిలదీసి అడిగితే ఏంచేసేది?

పోలీసు ఉద్యోగం కత్తిమీద నడక వంటిది. ఏమాత్రం ఏమరుపాటు వున్నా కాలు తెగుతుంది. లేదా కిందపడితే



ప్రాణమే పోతుంది. కాబట్టి ఇలా ప్రవర్తించక తప్పలేదు.

తర్వాత నరహరి సాక్ష్యం చెప్పేడు—

"ఒకనాడు నా చిన్ననాటి గురువుగారు అన్యాయం జరిగిందంటూ వచ్చి మొర పెట్టుకున్నాడు. తన కూతురు ప్రమాదంలో దెబ్బలుతిన్నా పోలీసులు పట్టించుకోలేదుట. కేసు పెట్టలేదుట. ఆయన స్వయంగా పోలీస్టేషనుకెళ్ళి ఆ మాట అడిగితే ఇనస్పెక్టరు బెదిరించి బైటికి గెంటించేడుట. అన్యాయమే. తర్వాత నా కొడుకే ఆ ఏక్సిడెంటు చేసేడని తెల్సింది. నా కొడుకు, నా డిపార్టుమెంటు! ఒక బాధ్యతాయుతమైన మంత్రి ఎలా ఉపేక్షిస్తాడు? కన్న కొడుకని కూడా ఉపేక్షించకుండా కేసు పెట్టించేను. నా పదవికి రాజీనామా చేసేను.నా రాజీనామా అంగీకరించారా లేదా అన్నది వేరే విషయం. నా సేవలు ప్రజలకి అవసరం అనుకున్నప్పుడు అంగీకరించరు. అక్కర్లేదనుకున్నప్పుడు వెంటనే అంగీకరిస్తారు.

నా కొడుకు శ్రీమతి పద్మజను హత్య చేశాడని అభియోగం వేసేరు. అందుకు నేను సుతరాం అంగీకరించను. నాకు తెల్సు..ఆ హత్యతో నా కొడుక్కి ఎలాంటి సంబంధమూ లేదు. ఇదంతా కుట్ర...రాజకీయమైన పన్నుగడ. కావాలనే ఈ ఆధారాలన్నీ సృష్టించేరు. పైగా నా ఇంట్లో కొచ్చి నా కొడుకునే ఎత్తుకుపోయేరు. ఈ హత్యను నా మీద, నా కొడుకుమీద మోపి దాన్ని రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగించుకోవాలని వారే హత్యచేసి వుంటారు. కాబట్టి కోర్టువారు ఈ విషయాన్ని కూలంకషంగా విచారించి మరీ ఒక అభిప్రాయానికి రావల్సిందిగా కోరుతున్నాను."

అని తన సాక్ష్యం ముగించాడు.

తర్వాత గెస్టుహవుస్ సూపరింటెండెంట్ వంతు వచ్చింది.

"విశాల్ బాబుతో నాకు చాలాకాలంగా పరిచయంవుంది. ఎప్పుడూ ఎవరో అమ్మాయిని తీసుకువచ్చి గెస్టుహవుస్‌లో బసచేయటం వారికి పరిపాటి. వారికి ఆతిథ్యం ఇవ్వటం మాకు తప్పనిసరి.

ఆరోజున ఒక స్త్రీని వెంటబెట్టుకుని వస్తే సాదరంగా ఆహ్వానించేను. ఒక అతిముఖ్య వ్యక్తికి ఇవ్వాల్సిన గౌరవ మర్యాదలన్నీ ఇచ్చేను. మంత్రిగారికి అత్యంత ప్రీతిపాత్రుడైన పుత్రుడు. మరి వారి ఎత్తున గౌరవమర్యాదలు జరగాలికదా. జరక్కపోతే మా ఉద్యోగాలకీ, జీవితాలకీ భద్రత వుండదు.

విశాల్ తనతో దిగిన స్త్రీని భార్యగా రికార్డులో రాసుకున్నాడు.

ఇద్దరూ రెండురోజులు హాయిగా కులాసాగా తిరిగేరు. ప్రతిరోజూ సాయంత్రం బయటికి వెళ్ళి తిరిగివస్తూ వుండేవారు.

మార్చి 16వ తేదీ మునిమాపు వేళ ఇద్దరూ అలవాటుప్రకారమే బయటికి వెళ్ళేరు. పొద్దుపోయేక ఆయన ఒక్కడే తిరిగి వచ్చేరు.

"అమ్మాయిగారేరి?" అని అడిగేను. సమాధానం చెప్పకుండా లోపలికి వెళ్ళిపోయేడు" అని ఊరుకున్నాడు సూపరింటెండెంట్.

తర్వాత విశాల్ వంతు వచ్చింది.

"ఇంత అభాసుపాలయ్యేక కూడా నేను అబద్ధంచెప్పాలని అనుకోవటంలేదు. ఉన్నది ఉన్నట్టే కోర్టుకు నివేదించుకుంటాను.

శ్రీమతి పద్మజగారితో నాకు ఒక




ఏడాదిగా పరిచయం వుంది. ఆమె నన్ను బాగా ఆకర్షించింది. ఆమె వెంట పడ్డాను. కాని ఎప్పుడూ ఆమె నాపట్ల ఆసక్తి కనబర్చలేదు. అది మా నాన్నగారు కనిపెట్టి నన్ను పరోక్షంగా ఉసిగొలిపేరు. నిజం చెప్పాలంటే ఈనాటి నా అధఃపతనానికి బాధ్యుడు మా నాన్నగారే.

ఆమె భర్తకి, మా నాన్నగారికీ రాజకీయంగా ఏవో స్పర్థలుండేవి. మంత్రి వర్గంలో మానాన్నగారుముఖ్యమైనవ్యక్తి. వారి వ్యతిరేకవర్గానికి నాయకుడు వెంకట్రావుగారు. ఆయనకి మంచి పలుకుబడి వుంది. ఆయన ముఖ్యమంత్రి అయిపోతాడేమోనని ఈ వర్గానికి భయం. అంచేత వెంకట్రావుగార్ని రాజకీయాల నుంచి దూరంగా నెట్టేయాలని ప్లాన్‌వేసేరు. ఈ రాజకీయ చదరంగంలో ఒక పావుగా నేను ఉపయోగపడ్డాను. ఆమెను పరిచయం చేసుకుని కథ నడిపితే మిగతా పనంతా తను చూసుకుంటానని మా నాన్న నన్ను ప్రోత్సహించేడు. మొదట్లో భయపడ్డాను. కాని తర్వాత అగ్నికి ఆజ్యం తోడైనట్టు ఆమే నాపట్ల సుముఖంగా మారింది. భర్త లేనప్పుడు కొన్నిరాత్రులు అక్కడే గడిపేవాడిని.

ఏక్సిడెంట్ జరిగినప్పుడు ఇద్దరం కల్సే వున్నాం. తాగిన మాట కూడా నిజమే. కాని మతి తప్పేటంతగామాత్రం తాగలేదు. ఆ అమ్మాయి ఎవరో పిచ్చిగా పరుగెడుతూ సడన్‌గా రోడ్డుకు అడ్డం వచ్చి కారుకింద పడింది. ఆమె కావాలనే అట్లా చేసిందేమోనని నా అనుమానం. బ్రేకు ఎంత వేసినా ప్రయోజనం లేకపోయింది.

ఆమె కారు కింద పడగానే హాస్పిటల్లో చేర్పిద్దామని బయల్దేరేం. దారిలో పోలీస్ స్టేషన్ కన్పించింది. మాకుగా హాస్పిటలుకు వెళ్తే అల్లరవుతుందేమోనని భయపడి, అందుకు ఇనస్పెక్టరును ఉపయోగించుకున్నాం.

అంతవరకే ఆమె విషయంలో నాకు ప్రమేయం వుంది. ఆమె హత్యా నేరంతో నాకెలాంటి సంబంధమూ లేదు. ఆమె చనిపోయినట్టు కూడా నాకు చాలా ఆలస్యంగా తెల్సింది. అప్పుడు నేనెక్కడ వున్నానో నాకే తెలీనిచోట బంధించబడి వున్నాను. తీరా బయటికి వచ్చేక పద్మజ మరణవార్త తెల్సింది. అప్పుడు నా దుఃఖానికి అంతులేదు. ఆమె నన్నెంతో ప్రేమించింది, సుఖపెట్టింది. కంటిపాపగా కాచి తన కౌగిట్లో లాలించింది. అలాంటి.. అలాంటి ప్రేమ మూర్తిని చంపటానికి నాకు చేతులెలా వస్తాయి" అంటూనే భోరుమన్నాడు విఠల్.

* * *

సాక్ష్యాలన్నిటినీ తనకు అనుకూలంగా మలుచుకున్నాడు రామ్మూర్తి. వెంకట్రావు రాజకీయ జీవితాన్ని మట్టుబెట్టటానికి ఒక ముఠా చేసిన కుట్రగా రుజువైంది. విఠల్ అపరాధిగా నిశ్చయించబడ్డాడు. జీవిత ఖైదు పడింది.

కేసు ముగిసేప్పటికి ప్రచారం పుణ్యమా అని అటు పార్టీలోనూ, ఇటు ప్రజల్లోనూ వెంకట్రావు మీద సానుభూతి పెరిగింది.

* * *

కోర్టు తీర్పును చక్కగా వాడుకున్నాడు వెంకట్రావు. పత్రికలద్వారానే కాకుండా ప్రజల మధ్యకు వెళ్ళి తనకు జరిగిన అన్యాయాన్ని గోరంతలు కొండంతలు చేసి ప్రచారం చేసుకున్నాడు. కేంద్రంలోనూ అతనిపై సానుభూతి

ఏర్పడింది. వచ్చే ఎన్నికల్లో అభ్యర్థుల ఎంపిక పూర్తి బాధ్యతను వెంకట్రావుకే వదిలేసేరు. ఆ అవకాశాన్ని జారవిడుచుకోలేదు వెంకట్రావు. అందరూ తన అనుకూలుర్నే ఎంపిక చేసుకున్నాడు. తర్వాత ముఖ్యమంత్రి అయేడు.



జూలై 2: సాయంత్రం 5 గం.

వాతావరణం ప్రశాంతంగా వుంది.

ముఖ్యమంత్రి చాంబర్స్ దగ్గర మాత్రం హడావుడిగా వుంది.

మంత్రివర్గంలో మరికొంత మందిని చేర్చుకుంటున్నాడని తెల్సి ఎమ్మెల్యేలు కొందరు ముఖ్యమంత్రి గది ముందు లాబీయింగ్ మొదలుపెట్టేరు.

అక్కడ చాలా చల్లగా వుంది.

వాళ్ల మనసుల్లో ఆతృతగా, ఆందోళనగా వుంది.

సన్యాసిరాజు ముఖ్యమంత్రి గదిలోకి మంతనాలకెళ్లేడు.

బయట వున్న ఎమ్మెల్యేలంతా ఆయన అనుయాయులు.

ఎన్నికలకు ముందు సన్యాసిరాజుకూ, వెంకట్రావుకూ మధ్య ఒక ఒడంబడిక జరిగింది.

తర్వాత అది రెండుగా మారింది.

మొదటిది: తన జిల్లాలో అందరికీ తన అనుయాయులకే టికెట్లు ఇవ్వాలి.

రెండవది: తన జిల్లా నుంచి మంత్రి పదవి వుండాలి. అదీ తన వర్గంవాడై వుండాలి.

ఇవి రెండూ అంగీకార యోగ్యమైతే వెంకట్రావుకి తన మద్దతు ఎల్లప్పుడూ వుంటుందని సన్యాసిరాజు ఎన్నికల ముందు వాగ్దానం చేసేడు. అలాగే తన వాగ్దానం నిలబెట్టుకుని వెంకట్రావు ముఖ్యమంత్రి అయేందుకు అవసరం అయిన అన్ని సహాయ సహకారాలూ అందజేశాడు సన్యాసిరాజు.

ఇప్పుడు వాగ్దానం నిలబెట్టుకోవల్సిన ఆవశ్యకత వెంకట్రావు మీద వుంది. మొదటి విడత మంత్రివర్గంలో ఎవరూ తన అనుయాయులు లేకపోవటం ఆశ్చర్యం వేసింది సన్యాసిరాజుకు. ఆశ్చర్యం తర్వాత అవమానంగా మారింది. అది గొంతు ముడి దిగటం లేదు. మొదటి సారి అడిగినప్పుడు,

"అప్పుడే అయిపోయిందా రాజు గారూ! ఎలాగూ కేబినెట్ పెంచుతాంగా. అప్పుడు తప్పక పరిశీలిస్తాను'' అన్నాడు వెంకట్రావు.

ఆ కేబినెట్ విశాలం చేసే తరుణం ఆసన్నమైంది. ఏవో పేర్లు కూడా వినవచ్చేయి సన్యాసిరాజుకు. కాని వాటిలో ఒక్కటీ తన జిల్లా నించిగాని, తన అనుయాయుల నించిగాని లేదు. ఆ విషయం తేల్చుకోడానికే ఈరోజు వెంట్రావును కలిసేడు.

"కేబినెట్‌లో మరికొంత మందిని చేర్చుకుంటున్నారుటగా?"

''అవును రాజుగారూ! పని భారం పెరిగిపోతోంది''

"ఏవో కొన్ని పేర్లు కూడా వినబడ్డ

న్నాయి"

"లేదే ... నేనింతవరకూ ఒక నిర్ణయానికి రాలేదు"

"అయితే నా అభ్యర్థనను దృష్టిలో వుంచుకుంటారుగదా?"

"అలాగే....''

బయటికి వచ్చేశాడు సన్యాసిరాజు.

''ఏం జరిగింది?''

అనుయాయులంతా ఒకేసారి ప్రశ్నల వర్షం కురిపించారు.

''ఏం జరగనట్టుగా నటిస్తున్నాడు. కాని, ఏదో దాస్తున్నట్టుగానే వుంది వ్యవహారం... దాటేస్తున్నాడు''

''అంతా మీ చేతుల్లో పెట్టాం... ఏమైనా ఎదురుతిరిగితే మీదే బాధ్యత''

''ఇదటయ్యా స్థలం చర్చించటానికి? పదండి'' అంతా బయల్దేరేరు.

* * *

సన్యాసిరాజు వ్యవహారం కొరకరాని కొయ్యగా తయారైంది వెంకట్రావుకు.

సన్యాసిరాజు వర్గానికి కేబినెట్‌లో స్థానం ఇవ్వడం వెంకట్రావుకు ఇష్టం లేదు.

ఇవ్వకుంటే ఊరుకునే మనిషికాదు సన్యాసిరాజు.

అతను తిరగబడితే ఏం జరుగుతుందో తెల్సు. ఆ పరిణామాలు ఎలావుంటాయో కూడా చవిచూసేడు వెంకట్రావు.

ఎవళ్లతో సంప్రదించటానికీ అతనికి విశ్వాసపాత్రులుగా ఎవరూ కన్పించ లేదు. ఆ మాటకొస్తే సన్యాసిరాజే ఇలాంటి విషయాల్లో ఖచ్చితంగా వుంటాడు.

ఎందుకైనా మంచిదని రామ్మూర్తిని పిలిపించేడు.

"జిల్లాలవారీగానో, కులాలవారీగానో మంత్రి పదవుల్ని పంచిపెట్టాలనే దానికి నేను పూర్తి వ్యతిరేకిని. కాని పొలిటికల్ బేలెన్సుకోసం నువ్వా పద్ధతి అనుసరిస్తున్నప్పుడు తప్పకుండా వాళ్లకీ ప్రాతినిధ్యం ఇవ్వాల్సి వుంటుంది" అని సలహా ఇచ్చేడు రామ్మూర్తి.

రామూర్తి ఇప్పుడు మామూలు రామ్మూర్తి కాదు...

జస్టిస్ రామ్మూర్తి!

రామూర్తి సలహా వెంకట్రావుకు రాజకీయంగా ఉపయోగపడ్తుందనే నమ్మకం లేదు. కాని న్యాయమైన ఒక ప్రతిపాదన చేస్తాడు. న్యాయంగా ఎలా జరగాలో కనీసం అదయినా తెలుస్తుందని వెంకట్రావు విశ్వాసం.

"నిజమే... కాని అందులో యోగ్యుడు ఒక్కడూ లేడు. నీకు తెల్సు గదా. మొదట్లో నాకు భయంగా వుండి, అతను అడిగినవాడికల్లా టికెట్టు ఇచ్చాను. ఇప్పుడు వాళ్లంతా ఎన్నికయి కూర్చున్నారు"

"యోగ్యుడంటే... ఎందులో?"

''వాళ్లకు బొత్తిగా నైతిక విలువ ల్లేవు''

"మరింకనే... అలాంటివాళ్లేకదా రాజకీయాల్లో రాణించేది"

"చాల్లేవోయ్ ... వెధవ జోకు''

"జోకు కాదు...ఆలోచించి చూడు" అని కాస్సేపాగి, "సన్యాసిరాజు మంత్రి కావాలనుకుంటున్నాడా?" అనడిగేడు.

"అతను మంత్రిపదవి కోరేంత తెలివి మాలినవాడు కాదు''

"మరి?"

"అతనిదో విచిత్రమైన మనస్తత్వం. తనకుగా తను దేనికీ ఆశించడు. డబ్బుకి

అసలే కక్కుర్తిపడడు. అతనికే కావల్సినంత వుంది. పిల్లా పాపా లేరు. పోతే అతని కోరిక ఏవిటంటే తను బతికినంత కాలం ఆ జిల్లాలో అతనే తిరుగులేని నాయకుడిగా చలామణి కావాలి. అందుకు తన జిల్లాని సర్వతోముఖంగా అభివృద్ధి చేసుకోవాలి. ఇక రెండోది: తనను ఆశ్రయించి వున్నవారు అడిగిన చిన్నా పెద్ద పనులు అడిగింది కాదనకుండా చేసిపెట్టాలి. అందుకు అధికారం కావాలి"

"మరి మంత్రి పదవి ఎందుకు కాదంటాడు?"

"ఆ అధికారం తన చేతిలో వుండకూడదు. అదే అతని తెలివిలోని సారస్యం. అధికారం చేతులకు సంకెళ్లు అని అతని వుద్దేశం. ఏ పని చేసినా విమర్శలూ, కువిమర్శలూ బయల్దేరుతాయి. అంచేత తన చెప్పుచేతల్లో ఉండే ఒక వ్యక్తిని పదవిలో పెట్టి పనులు చేసుకుపోవటం అతని స్ట్రేటజీ"

"అయితే ఇకనేం నీకు మార్గం మరీ సుఖతరం చేసేడు"

"అంటే?"

"ఏముందీ....అతన్నే మంత్రిపదవి స్వీకరించమను"

"ఫర్వాలేదురోయ్. నీ బుర్ర కూడా రాజకీయంగా ఎదుగుతోంది"

"అంటే, నువ్వూ ఆ నిర్ణయానికి వచ్చేవన్నమాట"

వెంకట్రావుకి కూడా ఈ ప్రతిపాదన తోచకపోలేదు. తన దగ్గరున్న ఒకొక్క పాచికా వేసిచూస్తే ఇదే శక్తివంతంగా అనిపించింది వెంకట్రావుకు. ఎంచేతనంటే: సన్యాసిరాజు ఎలాసూ మంత్రిపదవికి అంగీకరించడు. ఇప్పుడు ఈ ఆఫర్ ద్వారా తను అతనికి ఇచ్చిన వాగ్దానం నిలబెట్టుకున్నట్టూ వుంటుంది. మంత్రిపదవి ఎవరికీ ఇవ్వాల్సిన అవసరమూ ఉండదు.

ఈ అభిప్రాయం కలిగినా రెండో మనిషి సలహా కూడా అవసరంగా భావించేడు వెంకట్రావు. కాని, అప్పుడున్న రాజకీయ పరిస్థితుల్లో ఎవర్నీ సంప్రదించ మనస్కరించలేదు వెంకట్రావుకు.

"ఒకవేళ సన్యాసిరాజు చటుక్కున నీ ప్రతిపాదన అంగీకరిస్తే...?"

అనుమానం లేవనెత్తేడు రామ్మూర్తి.

అదీ నిజమే! కీడెంచి మేలెంచమన్నారు పెద్దలు.

రామ్మూర్తి లేవనెత్తిన శంక వెంకట్రావుకు గొంతులో పచ్చి వెలక్కాయలా పడింది. సన్యాసిరాజు మంత్రిపదవికి అంగీకరించడనే నమ్మకం వున్నా, రాజకీయాల్లో దేన్నీ తోసిపారేయకూడదని అనుభవం నేర్పిన గుణపాఠం గుర్తుకు వచ్చింది వెంకట్రావుకు.

అయితే అప్పుడేం చేయాలి?

ఈ ప్రశ్న రామ్మూర్తికి వేసి ప్రయోజనం లేదు.

అతన్ని పంపించివేసి తనే పథకాల గురించి ఆలోచించటం మొదలెట్టేడు. ఈ ఆలోచన్లో ప్రాథమికమయిన ఒక ప్రశ్న ఉదయించింది.

"అతని వర్గానికే మంత్రిపదవి ఇస్తే ఏం పోయింది?"

పోయేది ఏమీలేదు. కాని సమర్థవంతమయిన సభ్యులు ఇతర ప్రాంతాలనుంచి చాలామంది వున్నారు. అందరికీ ఇచ్చుకుంటూ పోతే కేబినెట్ జనరల్ కంపార్టుమెంటుగా మారిపోతుంది. వాళ్ళను విస్మరించి సన్యాసిరాజు మనుషులకే ఇస్తే రాజకీయంగా తిరుగుబాటు రావచ్చు. ఎంత తన మనుషులనుకున్నా పదవీ వ్యామోహం

చేయలేని పనంటూ వుండదు. తన ప్రత్యర్థులు సంఖ్యలో ఎంత తక్కువగా ఉన్నా వీళ్ళు కలిస్తే తను పడిపోయే ప్రమాదం వస్తుంది. విశ్వసించదగ్గవాళ్లలో సన్యాసిరాజునే ముఖ్యుడుగా ఎంచుకున్నాడు వెంకట్రావు. అంచేత అతన్నే ఆహ్వానించదలిచాడు. పర్యవసానం సంగతి తర్వాత చూడచ్చు.



## జూలై 8 : ఉదయం

సన్యాసిరాజు దీర్ఘ నిద్దర్లో వున్నాడు.

అతని శిష్యులంతా అర్ధ నిద్రలో వున్నారు.

సూర్యుడు ఎప్పుడో లేచి గుల్మొహర్ గుబురుల్లోంచి, కిటికీల్లోగుండా లోపలికి చొరబడి అక్కడా, ఇక్కడా అనకుండా ఎక్కడబడితే అక్కడ పడివున్న సన్యాసిరాజు ఆశ్రితుల మొహాలమీద దురాక్రమణ చేస్తున్నాడు.

సన్యాసిరాజు సాధారణంగా ఆలస్యంగా లేవడు. అతని శిష్యగణానికున్న మందు అలవాటు అతనికి లేదు. కాని రాత్రంతా రాచకార్యంలో మేలుకునే వున్నాడు.

వెంకట్రావు పార్టీలో అప్పుడే ముఠాలు మొదలయినాయి. మంత్రిపదవులు చిక్కని కొందరు అసమ్మతి వర్గంగా ఏర్పడి మంత్రాంగం మొదలెట్టేరు. సన్యాసిరాజుకీ ఆహ్వానం వచ్చింది. మొదట్లో వెళ్లకూడదనే అనుకున్నాడు రాజు. కాని వెంకట్రావు పద్ధతి చూస్తూవుంటే మొండిచేయి చూపించేట్టుగా అనిపించింది. ఎందుకయినా మంచిది వాళ్ల అభిప్రాయాలు, బలాబలాలు కూడా తెల్సుకుని వుంచే మంచిదని హాజరయ్యాడు.

రేపు మంత్రివర్గ విస్తరణలో తమకూ విస్తరి వేయకపోతే ఏం చేయాలి అన్నది చర్చ.

ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా సంతకాలు సేకరించి అధిష్టాన వర్గానికి సమర్పించాలని ఒక వాదన.

అధిష్టాన వర్గంలో వెంకట్రావుకి ప్రాపకం, పలుకుబడీ వున్నాయి కాబట్టి ఇప్పుడు సంతకాల సేకరణ ఉద్యమం మొదలుపెడితే బయటపడిపోవటం తప్ప ప్రయోజనం వుండదు. కాబట్టి కొంతకాలం వేచి చూడాలి అన్నది మరో అభిప్రాయం.

ఏ అభిప్రాయంతోనూ తన కంఠం కలపలేదు సన్యాసిరాజు. మౌనంగా అందరి అభిప్రాయాలూ శ్రద్ధగావిన్నాడు. వాళ్ల వల్ల ఏమీ కాదనే అభిప్రాయానికి వచ్చేడు. సభ్యుల్ని కూడగట్టుకోగల సత్తా వున్నవాళ్లుగాని, ఎత్తుగడలు ఎరిగిన వారుగాని ఎవరూ లేరు. వాళ్లలో ముఖ్యమంత్రి పట్ల వైముఖ్యం అయితే వుంది గాని, నాయకత్వం కొరవడింది.

తెల్లవార్లూ తాగటం, తర్జనభర్జనలు చేయటం తప్ప ప్రత్యామ్నాయ ప్రతిపాదన ఏదీ వాళ్ల ముందుకు రాలేదు.

ఆలస్యంగా వచ్చి పడుకున్నాడు సన్యాసిరాజు.

పక్కగదిలోవున్న కొత్తగా ఎన్నికైన ఎమ్మెల్యే ఒకడు వచ్చి లేపేడు సన్యాసి

రాజును.

"ఏం కొంపలంటుకుపోతున్నాయిరా?" అని విసుక్కుని పక్కకి తిరిగి పడుకున్నాడు రాజు.

"తొమ్మిదయింది"

"అయితే కానీ...."

"అది కాదు... సత్తి రాజొచ్చేడు అర్జంటుపని మీద"

సత్తిరాజు సన్యాసిరాజు జిల్లాలో ఒక సమితికి ప్రసిడెంటు. విశ్వాసపాత్రుడు. ఏదో ప్రమాదకరమైన పరిస్థితి ఏర్పడితే తప్ప పరిగెత్తుకు రాడు సత్తిరాజు. అంచేత అదిరిపడి లేచి కూర్చొన్నాడు సన్యాసిరాజు.

"ఏడీ వాడు?" అనడిగేడు.

"స్నానం చేస్తున్నాడు" అన్నాడు.

"ఏవిటటా విషయం?"

"ఏముందీ..మన ప్లానన్నీ తలకిందులైపోయాయి"

"ఏవిటో సరిగ్గా ఏడవరాదూ"

"ఛైర్మన్ తన వర్గంతో సహా ముఖ్యమంత్రి ముఠాలో కల్సిపోయేడట. అతన్ని పడగొట్టి సత్తిరాజుని పెట్టాలనే మన ప్లానంతా నాశనమైపోయింది"

సన్యాసిరాజు కాస్సేపు దీర్ఘంగా ఆలోచించేడు.

"అయితే ఏం జరుగుతుందని నీ హడావిడి"

"సత్తిరాజే చెబుతాళ్లే" అన్నాడు ఎమ్మెల్యే.

"వాణ్ణి తొందరగా తగలడమను"

మరో అరగంటలో సత్తిరాజు సన్యాసిరాజు ముందు హాజరయ్యేడు.

సత్తిరాజు కథనం ఇది:

ఛైర్మనూ, అతని వర్గమూ రెండు రోజులుగా నగరంలోనే మకాం వేశారు. మొన్న మొన్నటి వరకూ మాజీ ముఖ్యమంత్రి ముఠాలోవున్న వీరు అకస్మాత్తుగా ప్లేటుఫిరాయించి ప్రస్తుత ముఖ్యమంత్రితో కలిసిపోయేరు. జిల్లానుంచి ఎన్నికైన ఎమ్మెల్యేల్లో చాలామంది అతనికే మద్దతు ఇస్తున్నారుట. అంచేత ఛైర్మన్ కు మంత్రి పదవి ఇచ్చి, అతని వర్గంలో మరో ఛోటా నాయకుడికి ఛైర్మన్ పదవి కట్టబెడతారని జిల్లా జిల్లా అట్టుడికిపోతోందిట.

"ఏడు ఆరు మాసాల్లో ఎన్నిక కావాలిగా"

"అదీ ఖరారయింది. మన వీరాస్వామి రాజీనామా చేస్తాడట. ఆ నియోజకవర్గం నుంచి ఇతను పోటీచేస్తాడుట"

"అంతవరకూ వచ్చిందన్నమాట! అదీ చూద్దాం''

అంటూనే బాత్ రూంవైపు పరుగెత్తేడు.

అతను అలా వెళ్లగానే ముఖ్యమంత్రి పేషీ నుంచి ఫోనొచ్చింది.

ముఖ్యమంత్రి సన్యాసిరాజును అర్జంటుగా కలవాలిట. వెంటనే బయల్దేరి రమ్మని పి.ఎ మాట్లాడేడు.

ఊహాగానాలు ప్రారంభమయ్యేయి.

సత్తిరాజు నగరంలోకి దిగకుండా వున్నట్టయితే వారి ఊహాగానం ఒక విధంగా వుండేది.

అమాత్య పదవికి ఆహ్వానంగా భావించి వుండేవారు.

ఇప్పుడు వాతావరణమే మారిపోయింది ఏ వూహకీ తావు లేకుండాపోయింది.

* * *

ముఖ్యమంత్రి సన్యాసిరాజు కోసమే ఎదురుచూస్తున్నట్టుగా ఒంటరిగా చేంబర్ లో కూర్చొని వున్నాడు.

ముఖ్యమంత్రి ముఖంలో ప్రసన్నత లేదు.

ఆందోళన అంతకంటే లేదు.

వైముఖ్యం కావల్సినంత వుంది. అది సన్యాసిరాజు గమనానికి వచ్చిందో లేదో తెలీదు.

అయిదు నిముషాలపాటు ఎవరూ ఏమీ పలకలేదు.

''మీరు ఇలా చేయటం బాగులేదు రాజుగారూ" అన్నాడు ముఖ్యమంత్రి వెంకట్రావు.

"అంటే...?''

"నా ప్రత్యర్థులతో కల్సి మీరూ నన్ను వెన్నుపోటుపొడిచే ప్రయత్నం చేయటం బావుండలేదు''

"ఎవరండీ ఆ ప్రత్యర్థులు?"

"నిన్న రాత్రి మీరు కల్సినవారు"

"వాళ్ళంతా మన వర్గమేగా...''

''ఒకప్పుడు.... మీరు కూడా అంతేగా?"

"మీరు మాట తప్పటానికి ఈ అభియోగాన్ని చాటు చేసుకుంటు న్నారా?'' అన్నాడు సన్యాసిరాజు తీవ్రంగానే.

''లేదు. నిన్న మొన్నటి వరకూ మిమ్మల్ని మంత్రివర్గంలో చేర్చుకోవాలనే అభిప్రాయంలోనే వున్నాను"

"నాకు కావాలని కోరలేదుగా''

''కాని మీకే ఇవ్వాలనుకున్నాను. మీరు విశ్వాసాన్ని కోల్పోయారు"

''మీరూ... మా విశ్వాసాన్ని కోల్పోయారు. మాకు తెలీకుండానే రహస్యంగా ఫైర్మన్‌తో కుమ్మక్కయి అతనికి మంత్రి పదవిని కట్టబెడుతు న్నారు"

"ఇంతవరకూ అదీ అనుకోలేదు. ఇప్పుడు ఆలోచించాల్సి వుంటుంది"

''వెంకట్రావుగారూ... నమ్మిన వాళ్లకు ద్రోహం చేయటం నా చరిత్రలో లేదు. కాని మీరు మాత్రం నమ్మించి ద్రోహం చేశారు. ఏం చేయాలో నాకూ తెల్సు. గుర్తుంచుకోండి" అని విసురుగా బైటికి వెళ్లిపోయేడు సన్యాసిరాజు.

రాజకీయంగా తనని సన్యాసిరాజు ఏమీ చేయలేడని వెంకట్రావుకు తెల్సు. కాని అతని దగ్గర ఒక రహస్యం వుండి పోయింది. దాంతో తనని ఏమైనా బ్లాక్ మెయిల్ చేస్తాడేమోనని భయపడ్డాడు వెంకట్రావు. అది వారిద్దరి మధ్య రహస్యం మాత్రమే. మరొకరితో చర్చించి పైయెత్తు వేయటానిక్కూడా వీల్లేదు.

దొంగకి తేలు కుట్టినట్టుగా వుంది వెంకట్రావు పరిస్థితి.



## జూలై 28 : సాయంత్రం

సన్యాసిరాజు కార్యవాది. ఆ సంగతి అతనికి తప్ప అందరికీ తెలుసు. అతనికి మాత్రమే తెలీకపోవటానికి కారణం చాలా సింపుల్.

సన్యాసిరాజుకు పెద్ద పెద్ద మాటలు రావు, తెలియవు. విన్నా వాటి అర్థాలు అర్థంకావు.

ప్రజాస్వామ్యం అనేమాట లక్షన్నర సార్లు వినివుంటాడు.

కాని, దాన్ని గురించి ఏనాడూ సీరియస్‌గా ఆలోచించలేదు. ఆలోచించాల్సిన అవసరం అతనికి లేదు....రాలేదు.

అవన్నీ కార్యవాదులుగా ఘనులుకాని వాళ్లు వల్లెవేసే పెద్ద పెద్ద మాటలని అతని ఉద్దేశం.

తనకా అవసరం లేదు సరికదా ఆ మాటలు అసలు నోరు తిరగవు.

తనక్కావలసింది తన పనులు జరిగిపోవటం...

ఆ పనులు సజావుగా జరిగిపోవటం వల్ల తనకు లాభాలు రావటం...

లాభాలవల్ల పలుకుబడి పెరగటం...

పలుకుబడివల్ల పదిమందీ తనచుట్టూ తిరగటం....

ఆ తిరిగేవాళ్ళు తన చెప్పుచేతల్లో ఉండటం....

అది చూసి పెద్ద పెద్ద కుర్చీల్లో కూర్చుని పెత్తనం చేసేవాళ్లు తనను మర్యాదగా చూడటం...

తమ పెద్ద కుర్చీ పక్కనో, ఎదురుగానో తనకూ ఓ కుర్చీ చూపించి గుర్తించటం....

ఆ తర్వాత వాళ్ళకక్కావలసింది తను సమకూర్చి, తనక్కావలసింది వాళ్ళచేత కాదనలేకుండా చేయించుకోవటం....

ఇదొక చక్రం...నిజమే! కాని ఇదంతా ఎందుకు అనేది సన్యాసిరాజు దృష్టిలో అర్థంలేని ప్రశ్న.

ఆ ప్రశ్నకు అతను తకీమని జవాబివ్వగలడు.

"ఆ లెక్కన....ఈ బతుకెందుకు? ఏం సాధించటానికి?? గానుగలో పారేసే బొక్కలు కూడా అయిపులేకుండాపోయే మాత్రం కట్టెకు ఈ బతుకెందుకు?" అనగలడతను.

ఆ జవాబులోని ప్రశ్నకు జవాబు చెప్పగలవారతని సర్కిల్లో లేరు.

"సెభాష్" అనేవాళ్లే ఉన్నారు.

అందుకే ఇవన్నీ అతనికి చాలా మామూలు విషయాలు. ఈమాత్రానికి 'కార్యవాది'లాంటి పెద్ద పెద్ద మాటలు అనవసరం అని అతని ఉద్దేశం.

అవన్నీ తప్పనిసరిగా జరిగిపోవాల్సిన పనులు. వాటిని జరిపించుకోడానికే తను ఉన్నాడు.

అది మాత్రం సన్యాసిరాజుకు బాగా తెలుసు.

కనుక, సన్యాసి రాజు వెంకట్రావు "సంగతి తేల్చుకోవలసిందే" అనుకోవటంలో రాజకీయం ఏమీ లేదు. అవసరమే ఉంది!

అయితే ఆ అవసరం తీరటానికి రాచకీయం నడవక తప్పదు.

ఫలితం ఏదైనా అవుతుంది.

సన్యాసిరాజులు ఇంకా ఎందరో ఉన్నారు, ఉంటారు... ఈ దేశంలో.

వెంకట్రావులూ ఉన్నారు.

నరహరులూ ఉన్నారు.

మాజీ ముఖ్యమంత్రులూ ఉన్నారు.

కనుక ఏదైనా జరగవచ్చు. ఏదీ జరగకపోతేనే ఆశ్చర్యం.

అందుకే, సరిగ్గా పదిరోజుల తర్వాత..

రెండు వందల నలభై గంటల నిర్విరామ కృషి అనంతరం...

ఉదయమే సన్యాసిరాజు ఓ బాంబు పేల్చేడు.

ఆ బాంబు ఎలా తయారైంది?అందులో ఏమేం కూరేరు? - అనేది అంత ముఖ్యం కాదు.

అది బాంబు....

అది పేలింది.

దాన్ని పేల్చింది సన్యాసిరాజు.

పెట్టింది వెంకట్రావు కుర్చీకింద.... అతని రాజకీయ భవిష్యత్తు అనే ఎవరికీ అంతుచిక్కని ఓ చెక్క పెట్టెలో...

అది పేలింది, అంతే!

సన్యాసిరాజు కార్యవాది. అతనికి పబ్లిసిటీ గిట్టదు. అతను 'కింగ్' కాదు, కింగ్ మేకర్.

కనుక ఆ బాంబును తను స్వయంగా పేల్చలేదు... పేల్పించేడు.

తర్వాత....?

ఆ తర్వాతి కథ అనంతం... ఈ రాచకీయ వ్యవస్థా, దానిని పెనవేసుకు నడిచే సాంఘిక వ్యవస్థా ఇలా ఉన్నంత కాలం...

ఆ తర్వాత....జరిగే కథ అంతులేని, అంతుతెలియని...కథే.

• • •

"ఆధునిక సమాజంలో పెరిగిపోయిన 'వేగం' పాత్ర ఏమిటి? వ్యక్తులుగా మనుషుల జీవితాలపై దాని ప్రభావం ఏమిటి? పరస్పర సంబంధం ఎంతవరకు? ఫలితాలెలా ఉంటున్నాయి?"

...అనే విషయాన్ని తన డాక్టరేట్ థీసిస్‌కు 'సబ్జెక్ట్'గా తీసుకుని ఉన్న మోహన్రావు ఈ కథంతా చదివేడు, విన్నాడు, వాకబులు చేసేడు.

ఇదే తన సబ్జెక్టుకు సరిపడే విషయం అని కూడా అనుకున్నాడతను.

ఈ కథలోని సంఘటనలన్నీ చకచకా జరిగిపోయేయి.

ఒకదాని వెంట ఒకటిగా, పరస్పర సంబంధం లేశం లేకున్నా విడదీయ వీలు లేనివన్నట్లుగా జరిగిపోయేయి. ... నడిచేయి, పరుగెత్తేయి, మనుషుల్ని పరుగెత్తించేయి!

పరుగెత్తకుండా ఉండటానికి వీలులేకుండా అందర్నీ ఆ వలయంలో ఇరికించేసేయి,

"దీనికంతటికీ మూలం మన జీవితాల్లో పెరిగిపోయిన వేగం....దేన్నీ నిదానంగా చూసుకునే, ఆలోచించుకునే తీరికా, ఓపికా లేకపోవటం" అనుకున్నాడు మోహన్రావు.

మహోత్సాహంతో తన పనికి శ్రీకారం చుట్టాడు. "మనమంతా ఈ కాలగమనంలో పరుగులిడే పావులం. మన చేతిలో ఏదీలేదు. అందుకే ఒక సంఘటన వెంట మరొకటిగా ఇన్నీ ఇలా జరిగిపోయాయి" అని సిద్ధాంతీకరించుకున్నాడు మోహన్రావు. ఇంగ్లీషులో తాను చదివిన కొన్ని పుస్తకాలు అందుకు అవునన్నాయి కూడా.

కాని....

"అదేం కాదురా వెర్రినాయనా!" అనేశాడు మోహన్రావు తండ్రి సత్తిరాజు–సెలవుల్లో ఇంటికెళ్ళినపుడు కొడుకు చెప్పగా అంతా విన్నాక, అన్నాడాయన ఆ మాట!

సత్తిరాజు సన్యాసిరాజుకు కుడి భుజం.

గిట్టనివాళ్ళను గానుగాడించేస్తాడంటారు సన్యాసిరాజు గురించి తెలిసిన వాళ్లు–

ఆ గానుగ ఓనర్ సన్యాసిరాజైతే, దాన్ని నడిపించేదీ, ఆడించేదీ సత్తిరాజు.

పద్మజ పీకపిసికింది సత్తిరాజేనని బ్రహ్మదేవుడే స్వయంగా దిగొచ్చి సాక్ష్యం చెప్పవచ్చుగాక...

కాని–

ఆ పద్మజ శవం పీకమీద సత్తిరాజు హస్త ముద్రలుగానీ, వేలిముద్రలుగానీ చూపించి రుజువుచేయలేడా బ్రహ్మదేవుడు.

అంతటి అనుభవజ్ఞుడు సత్తిరాజు.

ఆ సత్తిరాజు తేలిగ్గా నవ్వేసేడంటే... కాదు... అని సూటిగా వ్యతిరేకించేడంటే ఆలోచించాల్సిందే. పైగా మోహన్రావుకు తండ్రి జీవితానుభవం మీద గొప్ప నమ్మకం; గౌరవం కూడా ఉందా అనే ప్రశ్న ఎవరూ వేయలేదు.

"జరిగిందేమిటి.... లలిత తొందరపడి భాస్కర్ వెంట పరుగెత్తలేదురా నాయనా" అన్నాడు సత్తిరాజు.

అది ఆమె జీవితావసరం. భాస్కర్ అందుకోదగిన ఆలంబనం అనుకుందామె!

భాస్కర్ ఆవేశంలో, తొందరపడి లలితను తిట్టలేదు.

అతను చేస్తున్నపని అతని జీవితావసరం. అది లేందే అతనికి భవిష్యత్ జీవితం లేదు. జీవితమే లేకపోతే... ఇంక లలిత ఎందుకతనికి. అందుకే అతనలా ప్రవర్తించగలిగేడు.

ముసలమ్మ మోయలేని బాస్కెట్ నిండు కోడిగుడ్ల బరువుతో నడవాల్సి రావటం క్రూరం అయితే అవ్వగాక! కాని, ఆవిడ జీవికకు తప్పనిసరి అవసరం.ఆపని చేయలేనినాడు ఆవిడనెవరూ పోషించరు. అందుకే లలిత తప్ప ఇంకెవరూ 'షాక్' తిని అరవలేదా జరిగిన దానికి. అందరూ అలవాటు పడిపోయేరా దృశ్యాలకు.

సేట్ బదరీనాథ్ మరీ అంత సామాన్యుడు కాడు. కాని, ఎన్నెన్ని ఆస్తులూ, ఎంతెంత పలుకుబడీ ఉన్నా అతని అవసరాలు అతనికీ ఉన్నాయి. అతని తక్షణావసరం ఒక వంశోద్ధారకుడు.

ఆ విషయంలో ఎన్నాళ్ళుగానో కంటున్న కలలు నిజం కాబోతున్న రోజులివి.

ఆ కలలు ఒక్కసారిగా కల్లలైపోయేయి.

అతని ఆశాసౌధాలు నేలకూలిపోయేయి. ఉన్న సౌధాలు, గోడౌన్లు అనాథలైపోయేయి.

ఆ సమయంలో అతని ప్రవర్తన అతని నిఘంటువు ప్రకారం అతి సహజం.

ఆడదనేది కేవలం అవసరం తీర్చటానికేననేది అతని అనుభవం.

ఆడమనిషి ఆకలిని, అవసరాన్ని తీర్చగల అతని డబ్బు చెప్పిన, నేర్పిన పాఠం అది.

అందుకే అతను నిస్సంకోచంగా ఒక అమాయకురాలిని చెరపట్టగలిగేడు. లలిత వంటి వాళ్ళు ప్రాణపదంగా చూసుకునే, దాచుకునే శీలాన్ని క్షణాల్లో ధ్వంసం చేయగలిగేడు.

లలిత ఒక లేతమొగ్గ.

మొగ్గల్ని నిర్దాక్షిణ్యంగా నలిపి పారేయగల మనుషుల్నెరుగని ముగ్ధ.

అందుకే సేట్ బదరీనాథ్ ఆవిడ పాలిటి యముడయిపోయేడు. ఆ షాక్‌లో ఆవిడ ఆ 'నరకం'నుండి పారిపోజూడటం ఆమె తక్షణావసరం. ఆ భయంకరానుభవం తర్వాత ఆవిడ అలా ప్రవర్తించకపోతేనే అసహజం.

వికల్, పద్మజ ఆధునిక ధన సంస్కృతీ విషవృక్ష ఫలాలు. వారి అవసరాల ముందు, 'పరువు-ప్రతిష్ట'లముందు ఇతర్ల ప్రాణం గడ్డిపోచ. 'అయ్యో' అనుపించవచ్చుగాక! మనసు పీకవచ్చుగాక! కాని, అంతకన్నా ముఖ్యం తామూ, తమనలా పోషిస్తున్నవాళ్ళూ. అసలే కన్నంలో దొంగలు వాళ్ళా సమయంలో. 'చీమ' కుట్టకపోయినా ఎదురొస్తే నలిపేయక తప్పదనేది వారి జీవితానుభవం.

లలితవంటివాళ్ళు వారి దృష్టిలో చీమలే.

అందుకే విఠల్ తండ్రి లలితను అంత అన్యాయంగా అంతం చేయించగలిగేడు. ప్రాణంపోయాల్సిన డాక్టరుచేతే ప్రాణం తీయించగలిగేడు. తండ్రి అంత అనుభవజ్ఞుడూ, గుండె బండబారినవాడూ కాదు గనుకనే విఠల్ లలితను కనీసం ఆస్పత్రిలో చేర్పించేడు.

లలిత బతకటం మాధవి తృప్తికి అత్యవసరం. వారి అనుబంధం అలాంటిది.

కాని డాక్టర్‌కు అలాంటి అనుబంధమేదీ లేదు. అతని అనుబంధమంతా తనకు కావలసివున్న ప్రమోషన్‌తో. అది అతని అవసరం. ఆ అవసరాన్ని వాస్తవంగా మార్చుకోవడానికతను ఒక నిండు ప్రాణాన్ని, అమాయక జీవాన్ని, లేలేత మొగ్గను నిర్దాక్షిణ్యంగా తుంచేయడానికి వెనుకాడలేదు.

అన్నీ తెలిసినవాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్ రామ్మూర్తి. అన్నీ తెలిసి కూడా దర్జాగా జీవించగలగటానికి కావలసిన లౌక్యం మాత్రం తెలీనివాడతను. అలాంటివాళ్లు ఈ సమాజంలో నెగ్గలేరు. అయినా లక్షలు ఘనంగా చందాలిచ్చినవాడు కార్లోంచి పోతూ పేవ్‌మెంట్ మీది ముష్టివాడికి పావలా విసరటానికి బద్ధకించినట్లే ఇలాంటివాళ్ళను ఆదుకోజూచే వెంకట్రావులు ఉండక పోరు. వెంకట్రావులకు కొందరన్నా రామ్మూర్తులు ఉండటం ఓ అవసరం. పద్మజలు మరో అవసరం. ఆ రెండూ వారికి అవసరమే.

పద్మజ జీవిత చదరంగంలో నిజానికో పావు.

కాని ఆ సంగతి తెలియదు ఆవిడకు.

పావును కాను ... పావులను నడిపేదాన్ని నేను .... అని భ్రమపడిందామె!

ఆ భ్రమలో ఆమెను ఉంచటం కొందరికి అవసరం. భ్రమలను పెంచింది సన్యాసిరాజులవంటివారు. భ్రమలు కావవి, నిజమే సుమా అని మళ్ళీ భ్రమపడేట్లు చేసింది వెంకటేశ్వర్రావులు. ఎందుకూ అంటే...వాళ్ళకది ఓ తప్పని సరి అవసరం.

వెంకటేశ్వరరావు కళాకారుడే కావచ్చు గాక! కాని అతను కళను కళగాకాక అవసరాలకు పనికొచ్చే ఒక అవసరంగానే అందుకుని వాడుకున్నవాడు. అందుకే అతని కళకు ప్రేక్షకులకన్నా పద్మజలే ముఖ్యమయ్యారు. అంతటివాడూ పద్మజకు దాసోహం అయిపోయేడు.

మంత్రి నరహరి లలిత తండ్రిని ఆప్యాయంగా అక్కునచేర్చటం కూడా అతని అవసరమే. నిత్యం నిద్రపోని పద్దెనిమిదిగంటలూ ఏదో ఒక అవసరం మీద, ఏదో ఒక రాచకీయం మీద పరివేష్టించే పాపాల భైరవులమధ్య గడిచే ఎడారిలాంటి రాజకీయపు రంగుల ఇసుకటెడారి మధ్య లలిత తండ్రిలాంటివాళ్లు ఆయనకు ఒయాసిస్సులే. ఏమీ అడగని, అడగలేని అమాయకులు ఎప్పుడోగాని తటస్థపడరు అలాంటి వాళ్ళకు.

ఆ తర్వాత అతను చేసిన పని అతనికి మరింత అవసరం. తన రాజకీయ చదరంగంలో పావుల్ని కదపటానికి లలిత తండ్రీ, పోలీస్‌ఆఫీసరూ చెప్పింది మరింత చక్కగా పనికివచ్చిందతనికి.

అసలుసిసలు రాజకీయవేత్తగా అవకాశాల్ని అవసరానికి అద్భుతంగా వాడుకోగలిగేడు వెంకట్రావు. నిజానికా దారవే ఆ తర్వాత అతని విరోధులు లలిత

ప్రాణాలు తీయటానికి పరోక్ష కారణంగా మారింది.

లలిత బతకటం వెంకట్రావు అవసరం. లలిత బతికి ఉండకపోవటం విఠల్ తండ్రిగా నరహరి అవసరం.

"ఇహ సన్యాసిరాజుగారి సంగతంటావా....?" ఓ క్షణం ఆగేడు సత్తిరాజు.

తండ్రి ఏం చెబుతాడో....అని చెవులు రిక్కించుకున్నాడు మోహన్రావు.

క్షణం తటపటాయించేడు సత్తిరాజు..

"ఆయనా...ఆయన దేవుడే" క్లుప్తంగా తేల్చేసేడు సత్తిరాజు.

తెల్లమొహం వేసేడు మోహన్రావు.

"మరి....మరి...?" తండ్రిగారి గురువును గురించి తను వినివున్న నిజాలు ఎదురుగా అనలేక నసిగేడు .... మోహన్రావు.

ఇంతలో ఫోన్ మోగింది....

అందుకున్నాడు సత్తిరాజు.

అరగంటదాకా ఆడావిడిగా మాట్లాడేకి ఆనందంగా ఊపిరి పీల్చుకుని రిసీవర్ పెట్టేసేడు సత్తిరాజు.

"సన్యాసిరాజుగారు ఫోన్ చేసేరు" ....చెప్పేడు సత్తిరాజు. "మా రాజుగారి ఎత్తుకు ఎదురులేదు.మావోడే ముఖ్యమంత్రి కాబోతున్నాడు" అన్నాడు ఆనందంగా.

"ఎవరు...? సన్యాసిరాజుగారా? సంభ్రమంగా ప్రశ్నించేడు మోహన్రావు.

"కాదు...." దృఢంగా పలికేడు సత్తిరాజు.

"మా రాజుగారికి రాజకీయం తెలుసురా చిన్నోడా! ఆయనకు పదవు లక్కర్లేదు. పదవుల్లో ఉండే వాయన జేబులో ఉండాలి... అంతే. జిల్లాపరిషత్ ఛైర్మన్ దారితప్పి అపోషన్లోకి గెంతేడు గదా! వాడిప్పుడు పైకి లాగేడు సన్యాసిరాజు."

"అపోజిషన్లో దూరినవాడిని ఎలా నమ్మేడూ?" తెల్లమొగం వేసేడు మోహన్రావు.

"రాజకీయాల్లో నమ్మకాల్దేముందిరా చిన్నోడా! ఆ మంత్రి అవుతున్నాడు. మరు నిమిషంవాడి కుర్చీలో నేను..."

"మీరు, మీరు .... జిల్లాపరిషత్ ఛైర్మన్ అవుతున్నారా...?"

"మరి సేపూ ఫోన్లో, ఎక్కడో హైదరాబాన్నుంచీ టెలిఫోన్స్ వాళ్ళకి అంత బిల్లు తగలేసి మాట్లాడిందేమనుకున్నావ్, వెర్రినాయనా! నేను పరిషత్ ఛైర్మన్నయ్యాక ఆ మంత్రిగాడు డెక్క కెళ్తాడు. చచ్చినట్లు నా గుప్పిట్లో ఉంటాడు. మా సన్యాసిరాజుకేం భయం లేద ఉద్ఘాటించేడు సత్తిరాజు.

వెక్కిలు చూస్తుండిపోయేడు మోహన్రావు.

"సరేగానీ, నీ డాక్టరేటేదో త్వరగా కానీ! ఈ రాజకీయాల్లో గొడవెందుగ్గానీ, ఏంకేదన్నా రాయి. నువ్వేం రాసినా ఫర్లేదు. ఇంకొంత కాలందాకా మందే రాజ్యం. నీకు ఫస్ట్క్లాస్ డాక్టరేటు రాకేం జేస్తుందోనే జూస్తాగా! ఏడా తిరిగేలోగా మనూరి కాలేజీకి నువ్వే ప్రిన్సిపాల్ వవ్వాలి" అనేసి లేచాడు సత్తిరాజు.

తండ్రిగారికి...కాబోయే జిల్లాపరిషత్ ఛైర్మన్గారికి ఆనందాశ్రువులాపుకోలేక, పాదాభివందనం చేసేడు కాబోయే ప్రిన్సిపాల్ మోహన్రావు.



# ఆధునిక ఆకర్షణల హాంగ్‌కాంగ్

హాంగ్‌కాంగ్‌లో రోడ్డు అయినా అశుభ్రంగా కనబడినా, వరికైనా సకాలంలో సరైన వైద్య సహాయం లభించకపోయినా 'సెంట్రల్ గ్రీవెన్సెస్ సెల్' అనే సంస్థకి ఫోన్‌చేస్తే చాలు! ఆ సంస్థవాళ్లు ఫోన్‌చేసిన వ్యక్తి ఆ సమస్యకు సంబంధించిన అధికారితో మాట్లాడే వీలు కల్పిస్తారు. ఆ ఇద్దరి సమావేశాన్ని రేడియోలో ప్రసారంచేసి, టెలివిజన్‌లో చూపిస్తారు కూడా!



హాంగ్‌కాంగ్ అంతా ఎత్తయిన భవనాల మయం! అక్కడి ప్రతి అపార్టు మెంటుకీ మెయిన్‌గేటు సదా మూసే వుంటుంది. ఆవరణలోని భద్రతా సిబ్బంది కార్యాలయ ఉద్యోగులు బైట తిరిగే పాద చారులను, అపార్టుమెంట్లలో నివసించే వారిని కలుసుకునేందుకువచ్చిన వ్యక్తులను నిశితంగా గమనిస్తుంటారు.

ఉదాహరణకు ఎవరైనా 15వ అంతస్తులోని 'బి' అపార్టుమెంటులో వారిని కలుసుకోదలచుకుంటే ముందుగా సెక్యూరిటీ కార్యాలయంలోనివారితో ఇంటర్‌కమ్‌లో మాట్లాడాలి. అపార్ట్ మెంటులోనివారు ఆ వచ్చిన వ్యక్తిని కలుసుకోదలిస్తేనే మెయిన్‌గేటు తెరుచు కుంటుంది. అపార్ట్‌మెంట్‌లోనివారు ఆ వచ్చిన వ్యక్తిని ముందుగా గమనించ



దలిసే తన టెలివిజన్‌లోని ఓ ఛానల్ స్విచ్ వేస్తే, వచ్చినవారిని స్పష్టంగా చూడగలుగుతారు.

హాంగ్‌కాంగ్ ప్రజలకి 'పవర్ కట్' అయి కరెంట్ పోయే అసౌకర్యం వుండనే వుండదు. ఏదైనా రిపేరు వుంటే 'పవర్ సప్లై కంపెనీ' ఓ నోటీసును 'పవర్‌కట్' అయ్యే నివాసభాగం ముందు అంటిస్తుంది. అందులో "సత్వరమే ఓ రిపేరు చేయాల్సి వుండటం వల్ల మీకు మధ్యాహ్నం 2 నుంచి 6 గంటల మధ్య విద్యుచ్ఛక్తి సరఫరా వుండదు. ఈ అసౌకర్యానికి క్షంతవ్యులం" అని వుంటుంది.

మెయిన్ రోడ్లపై కార్ల రద్దీని అదుపు చేయలేక, ఆ రద్దీ తగ్గించేందుకు హాంగ్‌కాంగ్ ప్రభుత్వం ఒక ప్రణాళిక రూపొందించింది. దాని ప్రకారం మెయిన్ రోడ్డు మలుపులో పెట్టిన ఓ ఎలక్ట్రానిక్ కంప్యూటర్ దానంతటదే అటుగా తిరిగే కార్ల నెంబర్లను రికార్డుచేసి తన లోపల గల కంప్యూటర్‌కి పంపుతుంది.

దాన్నిబట్టి ఆయా కార్ల యజమానులకి ప్రతి నెలా బిల్లులు పంపిస్తారు. మెయిన్‌రోడ్లపై వుండే ఎలక్ట్రానిక్ కంప్యూటర్‌లో రికార్డవడానికి అనువుగా కార్లన్నిటికీ ప్రత్యేక రకమైన నెంబర్లు ఇస్తారు. ఈవిధంగా మెయిన్‌రోడ్లపై తిరిగే కారు యజమానుల్నించి రుసుము వసూలు చేయడం వల్ల రద్దీ కొంత తగ్గడమే కాక ప్రభుత్వానికి మంచి రాబడి కూడా వస్తుంది.

హాంగ్‌కాంగ్‌లో అతి ఖరీదైన రోల్స్ రాయిస్ కార్లు లక్ష జనాభాకి ఒకటి చొప్పున దాదాపు 500 దాకా ఉన్నాయి. అక్కడ ప్రతి సంవత్సరం 40 రోల్స్ రాయిస్ కార్లు అమ్ముడవుతాయి. ప్రస్తుతం ఒక్కొక్క రోల్స్ రాయిస్ ఖరీదు 14 లక్షల రూపాయలు. ఇటీవల అక్కడో కొత్త రకపు రోల్స్ రాయిస్ కారును కొందరు పత్రికా విలేకరులకు ప్రదర్శించి చూపారు. ఓ విలేఖరి "ఆ కారులో కొంచెం చప్పుడు చేసింది ఏదైనా వుంటే, అది కారులో వున్న గడియారపు టిక్‌టిక్‌మన్న శబ్దం మాత్రమే!" అని రాశాడు. ఆ కారులో ప్రయాణం అంతనిశ్శబ్దంగా, ప్రశాంతంగా సాగుతుందన్నమాట!

హాంగ్‌కాంగ్‌లోని "పెనిన్సులా హోటల్"లో బసచేసినవారికి రోల్స్ రాయిస్ కార్లు వాడుకునే సౌకర్యముంటుంది. ఆ దేశంలో ఎక్కడైనా ఆకుపచ్చ రంగు రోల్స్‌రాయిస్ కారు కనబడితే ఆ హోటల్‌వారిదిగా గుర్తుపట్టవచ్చు.

హాంగ్‌కాంగ్ వెళ్లినవాళ్లు ఆ దేశంలో ముందుగా 'ఓషన్ పార్క్'ను చూస్తారు. అక్కడ రోజంతా ఎంతో సంతోషంగా గడపవచ్చు. ఓ పర్వత శిఖరంపై వుండే 'ఓషన్ థియేటర్'లో డాల్ఫిన్ ప్రదర్శన జరుగుతుంది. నీటిలోవున్న డాల్ఫిన్ హఠాత్తుగా పైకి లేచి నీటికి 40 అడుగుల ఎత్తునున్న బెలూన్‌ని తాకడం ప్రేక్షకులకి అద్భుతంగా వుంటుంది. 'ఓషన్ థియేటర్'కి కేబుల్ కారులో గాని, ఎస్కలేటర్ల ద్వారా గాని వెళ్లాలి. అచ్చటి ఎస్కలేటర్లు ప్రపంచంలోనే అత్యంత ఎత్తుకుపోయే ఎస్కలేటర్లు.

హాంగ్‌కాంగ్ ద్వీపంలో కెల్లూన్ అనే లైట్‌హౌస్ వుంది. 'కెల్లూన్' ప్రాంతం చైనా సరిహద్దుకి చాలా దగ్గిర. హాంగ్‌కాంగ్, కెల్లూన్‌లకి మధ్యగల సముద్రంపై వాహనాలను దాటించ

 




హాంగ్‌కాంగ్ ప్రభుత్వ అధికార చిహ్నం

దానికి 'డ్రాగన్ ఫెర్రీ సర్వీస్' అనే సంస్థ ఉండేది. 1972లో సముద్రంలో సొరంగాన్ని నిర్మించినప్పట్నించీ, 2 కిలోమీటర్ల పొడవుగల ఆ సొరంగం గుండానే వాహనాల రాకపోకలు జరుగుతున్నాయి.

సముద్రపు నీరు ఒక చుక్కకూడా చొరనంత కట్టుదిట్టంగా వుంటుందా సొరంగం. అందులోని రాడార్లు కార్ల వేగాన్ని కంట్రోల్ చేస్తాయి. ప్రతి 30 అడుగులకి ఒక టెలిఫోన్ వుంటుంది. కార్లు సొరంగం మధ్యలో చెడిపోతే సొరంగపు విభాగానికి ఫోన్‌చేస్తే వాళ్లు వెంటనే తగిన చర్యలు తీసుకుంటారు. సొరంగంలో ప్రయాణం చేసినందుకు వాహనానికి 15 రూపాయల టోల్‌గేట్ రుసుము చెల్లించవలసి వుంటుంది.

హాంగ్‌కాంగ్ వచ్చే పర్యాటకుల్లో పురాతన చైనీయుల జీవన విధానాన్ని తెల్సుకోవాలనే ఆసక్తిగలవారి కోసం 'చంగ్' అనే చైనీయుల గ్రామాన్ని ఏర్పాటుచేశారు. అక్కడ మొదటి శతాబ్దపు చైనీయుల జీవన విధానం కళ్లకు కట్టినట్టు కనబడుతుంది.

ఆ గ్రామంలో ఇళ్లన్నీ ఇటుకలు, పెంకులు, పైన్ చెట్ల కలపతో తయారు చేసినవే! అక్కడివారు పురాతన దుస్తులు ధరించి, ఆనాటి ప్రజల పద్ధతిలో ప్రవర్తిస్తారు. అందుకుగాను వారికి నెలసరి జీతం లభిస్తుంది. వాళ్లు 'కుంగ్‌ఫూ' లాంటి ప్రాచీన కళలను సైతం ప్రదర్శిస్తారు. చంగ్ పద్ధతిలో వివాహాలు జరిపి, పర్యాటకులకు అతిథి మర్యాదలు చేస్తారు. అక్కడి రెస్టారెంట్లలో మొదటి శతాబ్దంనాడు చైనాలో వాడుకలో వున్న ఆహారం

లభిస్తుంది. ఆ గ్రామంలో ప్రవేశించగానే హాంగ్‌కాంగ్ డాలర్లను చంగ్ రాజవంశ పాలనా కాలంలోని నాణాలతో మార్పిడి చేసుకోవాలి. చంగ్ గ్రామంలో ఏం కొనాలన్నా ఆ నాణాలతో కొనవల్సిందే! అక్కడ మధ్యాహ్నం అందించడం, పాడటం, నృత్యం చేయడం — అంతా చంగ్ పద్ధతిలోనే జరుగుతుంది. ఆ గ్రామంలో 5 వేల ఏళ్ల క్రితం నాటి కొందరు ప్రముఖులైనా రాజుల మైనపు విగ్రహాలను ప్రదర్శించే మ్యూజియం కూడా వుంది. ఆ విగ్రహాలన్నీ సజీవ మూర్తుల్లాగే కనిపిస్తాయి.

హాంగ్‌కాంగ్‌లో జరుపుకునే పండుగలు చాలామటుకు మన దక్షిణ భారతంలో చేసుకునే పండుగలను పోలి వుంటాయి. ఇక్కడి సంక్రాంతి, దీపావళి పండుగల్లా అక్కడి చైనీయులు కొత్త సంవత్సరపు పండుగను కనీసం 3 రోజులైనా జరుపుకుంటారు. కొత్త దుస్తులు ధరించి పాత అప్పులన్నింటినీ ఆరోజే తీర్చేయడం వారి ఆచారం. మరునటిరోజు బంధుమిత్రులను కలిసి పరస్పరం నూతన సంవత్సర శుభాకాంక్షలు చెప్పుకుంటారు. టపాసులు కాలుస్తారు. ఆ పండుగ రోజుల్లో అవివాహిత యువతులు మామూళ్ల కోసం వెంటబడి, ఏదో ఒక బహుమతి తీసుకునిగానీ వదలరు.

వారి దీపాల పండుగ కొంతవరకూ మనదేశంలోని కార్తీక పౌర్ణమి పండుగ లానే వుంటుంది. ఆ పండుగ అందాన్ని ఆస్వాదించడానికి వేయి కళ్లున్నా చాల వన్పిస్తుంది. ఓడలు, జాతులు, కాళ్లు, చేపలు— ఇలా రకరకాల ఆకారాల్లో దీపాలంకరణ చేస్తారు. ఆ పండుగ రోజుల్లో ఎక్కడ చూసినా దీపాలే కన్పిస్తాయి.

హాంగ్‌కాంగ్ మొత్తం జనాభా అయిదున్నర మిలియన్లు. వీరిలో 98 శాతం చైనీయులు, మిగిలినవారు విదేశీయులు. ఎగుమతి వర్తకంలో ఆ దేశానిది ప్రపంచంలో 16వ స్థానం కాగా బాంకింగ్‌లో 3వ స్థానం!

హాంగ్‌కాంగ్‌లో కొద్దిమంది బిచ్చగాళ్లు వున్నా, వాళ్లు చాలా శుభ్రంగా వుంటారు. వాళ్లు ఎలక్ట్రానిక్ గిటార్లను చక్కగా వాయిస్తూ అడుక్కుంటారు. అక్కడ అశుభ్రంగా తిరిగే బిచ్చగాళ్లను కఠినంగా శిక్షిస్తారు.

హాంగ్‌కాంగ్‌లో 3 నెలలకోసారి టెలిఫోన్ అద్దె కడితేచాలు. ఎన్నిసార్లు ఫోన్లు చేసుకున్నా వేరే ఏమీ చెల్లించ నవసరం లేదు. అక్కడ షాపింగ్ సెంటర్లలోనూ, బైటా అనేక పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లు వుంటాయి. వాటిని వుచితంగా ఉపయోగించుకోవచ్చు. ఫోన్‌లో కావల్సిన వ్యక్తి దొరకకపోతే, మెసేజ్ ఏమిటో చెబితే అవతలి ఫోన్‌కి కల్పివున్న టేప్‌రికార్డర్ దాన్ని ఆటోమాటిక్‌గా రికార్డు చేస్తుంది కూడా.

హాంగ్‌కాంగ్‌లోని నక్షత్ర దర్శనశాల 60 మిలియన్ డాలర్ల ఖర్చుతో నిర్మింపబడింది. దానిలో 23 మీటర్ల వ్యాసంగల సీలింగ్‌పై నక్షత్ర సముదాయాల్ని ప్రదర్శించి చూపుతారు. చంద్రునిపై జరిపిన అనేక పరిశోధనల్లో ఉపయోగించిన రకరకాల పరికరాలు, కెమేరాలు మొదలైనవాటిని కూడా ప్రదర్శిస్తారు. అమెరికాకి చెందిన 'నాసా' సంస్థ ఆ మ్యూజియాన్ని హాంగ్‌కాంగ్‌కి కానుకగా ఇచ్చి అక్కడ ఏర్పాటుచేసింది.





టాక్సీలు సమ్మె చేయకపోయినా
హాంగ్ కాంగ్ వీధులు రద్దీగానే వుంటాయి!



హాంగ్‌కాంగ్‌లోని ప్రయాణ సాధనాలు అత్యంత వేగవంతమైనవే అయినా, ఒక 'ట్రాము'ని కూడా నడిపిస్తున్నారు. దాన్ని ఎక్కువగా బ్రిటిష్‌వాళ్లే ఉపయోగిస్తారు. ఆ ట్రాము బైలుదేరాక తిరిగి గమ్యం దగ్గిర మటుకే ఆగుతుంది. దానికి టికెట్ 50 సెంట్లు. ట్రాముని ఎవరైనా, ఎక్కడైనా సరే ఎక్కి దిగేందుకు వీలుగా అది చాలా నెమ్మదిగా నడుస్తుంది. ఆ ట్రాముని ఎక్కువగా మహిళలే నడుపుతారు.

హాంగ్‌కాంగ్‌లో వివిధ పనులు చాలా వరకు మానవశక్తికి బదులు యంత్రాల ద్వారానే జరిగిపోతాయి. అక్కడ అతి ఖరీదైన ప్రయాణ సాధనం లాగుడురిక్షా. ఆ రిక్షాలో ప్రయాణించడానికి రెండు ఫర్లాంగుల దూరానికైతే 50 రూపాయలివ్వాలి.

హాంగ్‌కాంగ్‌లోని భవంతుల్లో అతి ఎత్తయినది 'కన్నాడ్ భవనం' అంతటా గుండ్రటి కిటికీలతో వుండే దాన్ని 'వెయ్యి కళ్ల భవనం' అని కూడా అంటారు.

హాంగ్‌కాంగ్‌లో విమాన ప్రయాణం చేసి దిగుతున్నప్పటి అనుభవం చాలా థ్రిల్లింగ్‌గా వుంటుంది. అత్యంత ఎత్తు వుండే భవనాల మీదుగా విమానంలో తిరిగాక 'కైడాక్' విమానాశ్రయంలో దిగటం గమత్‌గా వుంటుంది.

ఆ విమానాశ్రయపు రన్‌వే సముద్రంపై నిర్మింపబడింది. టన్నులకొద్దీ ఇసుకతో సముద్రాన్ని కొంతమేర పూడ్చి ఆ రన్‌వేని నిర్మించారు. ఆ విమానాశ్రయానికి రోజూ వచ్చే పోయే విమానాలు 75 వరకూ వుంటాయి. మధ్యాహ్నం 2గంటలకైతే అక్కడ విమానాలు క్యూలో వుంటాయి. అప్పుడు 2 నిముషాలకోసారి ఓ విమానం రావడంగాని, వెళ్ళిపోవడంగాని జరుగుతుంది. ఆ విమానాశ్రయం నుంచి రాకపోకలు జరిపే ప్రయాణీకులు 25వేలమంది దాకా వుంటారు. ప్రపంచంలోని రద్దీ అయిన విమానాశ్రయాలలో అది ఒకటి.

హాంగ్‌కాంగ్‌లో రోడ్ల అపరిశుభ్రతకు కారణమైనవారికి 300 నుంచి 1500 రూపాయలదాకా జరిమానా విధిస్తారు. అనవసరంగా కుళాయిని విప్పి వుంచి, నీటిని వృధా చేస్తే వెయ్యినుంచి 7500 రూపాయల వరకూ జరిమానా వుంటుంది. గుర్తింపు కార్డు లేకుండా వీధుల్లో సంచరిస్తే 300 నుంచి 1200లు, పార్క్ చేయగూడని చోట కారుని నిలిపితే 350 రూపాయలు జరిమానా వేస్తారు. ఆఖరికి తమ పిల్లల్ని కొట్టినవారికి కూడా వెయ్యి రూపాయలు జరిమానాయే! నీళ్లు నిలిచిపోయేట్టు చేసి దోమల పెరుగుదలకి కారణమైనవాళ్లు 15వేల రూపాయలు జరిమానా చెల్లించాలి.

హాంగ్‌కాంగ్‌నుంచి చైనాలోని కేన్‌టన్ నగరానికి ఓ ఎలక్ట్రిక్ రైలు నడుస్తుంది. దాని విశేషమేమంటే-ఎక్కడైనా ఎర్ర సిగ్నల్ పడినపుడు ఆ రైలు డ్రైవర్ కేబిన్‌లోని హారన్ డ్రైవర్‌ని హెచ్చరిస్తుంది. డ్రైవర్ బ్రేక్ వేయడంలాంటివి అలస్యం చేస్తే రైలు దానంతట అదే ఆగిపోయే ఏర్పాట్లున్నాయి.

హాంగ్‌కాంగ్‌లోని బాంకుల్ని అర్ధ సంవత్సరపు క్లోజింగ్ ఎకౌంట్స్ కోసం జూన్ 30, డిసెంబరు 31న మూసివేయటం జరగదు. వారి బాంకుల్లో 'క్లోజింగ్ ఎకౌంట్స్' జూన్ 30న సాయంత్రం అయిదున్నరకల్లా ప్రారం




హాంగ్‌కాంగ్‌లో అంతటా గగన హర్మ్యాలే!

భించి - మరుసటిరోజు ఉదయానికల్లా పూర్తిచేసేస్తారు. డిసెంబరు 31న అయితే మరుసటిరోజు జనవరి 1 సెలవు దినమే కనుక వారి పని ఇంకా సులభమవుతుంది.

అక్కడ పాదచారులు ట్రాఫిక్ నిబంధనలను అతిక్రమిస్తే ట్రాఫిక్ పోలీసు వారికో నోటీసు అందిస్తాడు. దానిలో- "ట్రాఫిక్ నిబంధనలను అతిక్రమించినందుకు మీరు 500 డాలర్ల జరిమానా చెల్లించవలసి వుంటుంది. అయితే అలా అతిక్రమించినందువల్ల మరణం సంభవిస్తే లేదా తీవ్రంగా గాయపడితే మీరు జరిమానాకంటే ఎక్కువగా కూడా నష్టపోవచ్చు. ట్రాఫిక్ నిబంధనలను నిర్లక్ష్యం చేయడంవల్ల క్రితం సంవత్సరం 280 మంది పాదచారులు మరణించారు. 8,800 మంది తీవ్రంగా గాయపడ్డారు. ఈసారికి మిమ్మల్ని క్షమించి వదిలేస్తున్నాం. మరోసారి ఇలా చేస్తే మీరు జరిమానా చెల్లించేందుకు కోర్టుకు రావడమో, గాయాలతో ఆస్పత్రి పాలవడమో జరుగుతుందని గ్రహించగలరు" అని వుంటుంది.

హాంగ్‌కాంగ్ టెలివిజన్‌లో గేస్ తాలూకు ప్రకటన ఎక్కువగా ప్రసారమవుతుంది. అనేక రకాల వంటకాలు చేసిన ఓ మహిళ 'ఫలానా గేస్‌ని వాడండి' అని ఆ ప్రకటనలో చెబుతుంది. అక్కడ గేస్ సిలిండర్ ద్వారానేకాక నీళ్ళలాగా పైప్ ద్వారాకూడా లభిస్తుంది. పైప్‌ద్వారా వచ్చే గేస్‌కి ఇంట్లో కరెంట్ మీటర్లలా ఓ మీటర్ అమర్చి, దాన్నిబట్టి నెలనెలా




రాత్రివేళల్లో మిరుమిట్లుగొలిపే హాంగ్‌కాంగ్

ఉపయోగించిన గేస్‌కి బిల్లు పంపిస్తారు. గేస్ సిలిండర్లకి ధరావతు అడగని కంపెనీలు కూడా వుంటాయి. ఫోన్ ద్వారా ఆర్డర్ బుక్‌చేసిన గంటలోనే సిలిండర్‌ని పొందవచ్చు. అక్కడ వాటర్ గీజర్లకి కూడా గేస్‌నే ఉపయోగిస్తారు.

హాంగ్‌కాంగ్‌లో ఎవరైనా తక్కువ స్టాంపులంటించిన లేఖను పోస్ట్ చేస్తే, వారికి ప్రధాన తపాలా కార్యాలయం నుంచి ఓ పత్రం వస్తుంది. దానిలో "మీరు ఎయిర్ మెయిల్ వుత్తరాన్ని తక్కువ స్టాంపులతో పోస్టు చేయడం మా దృష్టికి వచ్చింది. మేము దానికవసరమైన స్టాంపులంటించి అది సమయానికి గమ్యం చేరుకునేట్టు చేశాము. మేము అలా చేయకుంటే ఉత్తరాన్ని అందుకున్నవారు జరిమానా చెల్లించవలసి ఉండేది. తక్కువ స్టాంపులంటించినందుకు మీ వుత్తరాన్ని మేము రైలు, లేక నౌకల ద్వారా పంపితే అది రాసినవారికి అందడంలో జాప్యం జరిగేది. అది మీరు మెచ్చరు కదా! కనుక మేము అంటించిన స్టాంపులకు బదులుగా అంతే విలువగల స్టాంపులను వెంటనే మాకు పంపండి" అని వుంటుంది.

హాంగ్‌కాంగ్‌లో ప్రయాణించడానికి ఫెర్రీసర్వీస్, మినీబస్సులు, కేబుల్ రైళ్లు, రైళ్లు, టాక్సీలు, ట్రాముల్లో మనకిష్టమైన ప్రయాణసాధనాన్ని దేన్నయినా ఎన్నుకోవచ్చు. ఇవికాక 'మాస్టర్ ట్రాన్సిస్' పద్ధతి ద్వారా అతివేగంగా నడిచే ఎలక్ట్రిక్ రైళ్లు కూడా వున్నాయి. వివిధ మార్గాలలో నడిచేవి ఇన్ని వున్నా హాంగ్‌కాంగ్‌లో ట్రాఫిక్ పెద్ద సమస్యగానే వుంటోంది. హాంగ్‌కాంగ్ 200 చిన్న చిన్న ద్వీపాలతో కూడిన దేశం. ద్వీపాలన్నీ ఫెర్రీ సర్వీసులతో కలపబడ్డాయి. ప్రసిద్ధమైన 'డ్రాగన్ ఫెర్రీ సర్వీస్' లారీలు, కార్లలాంటి వాహనాలను కూడా మరో ద్వీపానికి చేరవేస్తుంది. హాంగ్‌కాంగ్‌లో 6వేల మినీబస్ సర్వీసులు వున్నాయి. మినీబస్‌లో ప్రయాణించేందుకు 14






కస్టమ్సు సుంకం వసూలు చేయని నౌకాశ్రయం

మందిని మాత్రమే అనుమతిస్తారు. ఏ బస్‌లోనూ కండక్టర్ వుండడు. టిక్కెట్‌కవసరమైన డబ్బును ప్రయాణీకులు బస్సులో ఏర్పాటుచేసిన బాక్సులో వేస్తారు.

హాంగ్‌కాంగ్‌లో ఇళ్ళ అద్దెలు మరీ ఎక్కువ. 750 చదరపు అడుగుల స్థలంలోగల ఫ్లాట్‌కి నెలకి 7,500 రూపాయల అద్దె వుంటుంది. ఆ ఫ్లాట్‌ని కొనుక్కోవాలంటే 8 లక్షల రూపాయలకి తక్కువ చేయడు.

హాంగ్‌కాంగ్‌లోని ప్రధాన తపాలా కార్యాలయం చూడ్డానికి విమానాశ్రయంలా వుంటుంది. ఎలక్ట్రానిక్ కౌంటర్ల ద్వారా స్టాంపులు, కవర్లు 24 గంటలూ అమ్మబడతాయి. వాటిలో నాణెం వేయగానే కావల్సిన స్టాంపు లేదా కవరు బైటకు వస్తుంది. అలాంటి స్టాంపులమ్మే ఎలక్ట్రానిక్ కౌంటర్లువుండేతపాలాబూత్‌లు అనేకం నగరమంతటా వుంటాయి. ఆ కౌంటర్లు పోస్టుబాక్సులకు ఆనుకుని కూడా వుంటాయి.

హాంగ్‌కాంగ్‌లో కొన్ని రైళ్లు భూమి లోపల సొరంగమార్గంలో నడుస్తాయి. భూమి పైనుంచి ఎస్కలేటర్లు సొరంగంలో వున్న స్టేషన్లకు ప్రయాణీకుల్ని తీసుకు వెళతాయి. ఆ స్టేషన్లలో టికెట్ బూత్‌లు ఎన్నో వుంటాయి. వాటిలో నాణెం వేసి వెళ్ళాలనుకున్న చోటికి టికెట్ పొంద వచ్చు. టిక్కెట్టుకి సరిపడా చిల్లర లేక పోయినా ఫర్లేదు. డాలర్ నోట్ వేస్తే టిక్కెట్ తోపాటు మిగిలిన చిల్లర కూడా వస్తుంది.

ద్వారం దగ్గిర ఓ కన్నంలో టికెట్ వేస్తే తలుపు తెరుచుకుని దారి ఇస్తుంది. హాంగ్‌కాంగ్‌లో టికెట్ కండక్టర్లే వుండరు. అంతా యంత్రాల ద్వారానే జరిగిపోతుంది.

హాంగ్‌కాంగ్ ప్రజలకి మాంసం అంటే ఎనలేని ఇష్టం. వాళ్ళు దాదాపు అన్ని జీవాలనూ తింటారు. వాటిలో ఎండ్రకాయ, పాము, పంది, తేలు, గొడ్డు మాంసాలను ఎక్కువ ఇష్టంగా తింటారు.



హార్బరు ప్రక్కనే కిక్కిరిసిన భవనాలు

అక్కడ దొరికే ఒకరకమైన చేపను వాళ్లు వండుకోకుండా, పచ్చిగానే తినేస్తారు. పెంపుడుజంతువులైన పిల్లి, కుక్కల మాంసం తినడం అక్కడ నిషిద్ధం. వాటిని తిన్నవారు శిక్షింపబడతారు కూడా! ఓ 18 ఏళ్ళ నిరుద్యోగ యువకుడు ఆకలికి తట్టుకోలేక రెండు పిల్లిపిల్లల్ని చంపి మాంసంతిన్నాడు. అది తెలిసి పోలీసులు అతన్ని కోర్టులో హాజరుపరచడంతో, 500 డాలర్ల జరిమానా పడిందతనికి.

హాంగ్‌కాంగ్‌లో టెలీకమ్యూనికేషన్ విభాగం, వాతావరణ పరిశోధనా కేంద్రాలు చాలా సమర్థవంతంగా పని చేస్తాయి. గాలివానతో కూడిన తుఫానులను ఎదుర్కోవడానికి సమర్థవంతమైన చర్యలు తీసుకుంటారు. తుఫాను రాకను పసికట్టినపుడు ప్రజలకు ముందు జాగ్రత్త చర్యల గురించి రేడియోలో వివిధ భాషలలో సూచనలిస్తారు. స్కూళ్ళు, ఆఫీసులను మూసివేయవలసిందిగా హెచ్చరిస్తారు. అక్కడ నీటి పారుదల ఏర్పాట్లు బాగుంటాయి. ఎంతటి తుఫాను వచ్చినా, అది తగ్గిన 3 గంటలోగా రోడ్లమీద నీళ్ళేమీ నిల్వకుండా పోతాయి. అక్కడి ఇళ్ళు తుఫాన్లని తట్టుకునే రీతిలో నిర్మింపబడివుంటాయి.

హాంగ్‌కాంగ్‌లో పార్కింగ్ ఓ పెద్ద సమస్య. ఉదయం తొమ్మిది దాటాక వాహనాలను పార్క్ చేసుకోవడానికి ఎక్కడా స్థలమే వుండదు. పార్క్ చేసే స్థలానికి గంటకు 25 రూపాయలు వసూలు చేస్తారు. అయినా అవన్నీ సదా "ఫుల్"గానే ఉంటాయి.

—జాస్తి శ్రీకృష్ణ వరప్రసాద్




# చాతుర కథలు

గైడ్

"అమ్మా! పిల్లి మళ్ళీ పాలు తాగేసిందే!" తాయారు చిన్నకూతురు ఫిర్యాదు చేసింది తల్లికి.

"ఆ మాయదారి పిల్లి సంగతి ఈరోజు తేలిపోవాలి. ఈ ఇంట్లో అదయినా ఉండాలి, నేనయినా ఉండాలి.... వినబడుతోందా?" భర్త సుధాకరం మీద విరుచుకుపడుతూ అంది తాయారు.

తాయారు సంగతి తెలిసిన సుధాకరం గబగబా బట్టలు వేసుకుని పిల్లిని పట్టుకోడానికి బయలుదేరాడు.

ఓ అరగంట తంటాలు పడ్డాక పిల్లి దొరికింది అతడి చేతికి. దాన్ని ఓ గోనె సంచిలో వేసుకొని, సంచిమూత భద్రంగా కట్టి, భుజాన వేసుకొని వీధినపడ్డాడు సుధాకరం.

అలా బయటపడ్డ సుధాకరం మూడు రోజుల తరువాతగానీ ఇంటి ముఖం చూడలేదు. అతడి పీక్కుపోయిన ముఖం చూస్తూనే- "ఎటు వెళ్ళారండీ! మేమంతా ఎంత ఖంగారుపడ్డామో తెలుసా?" ఎదురొచ్చిన తాయారు ప్రశ్నించింది ఆత్రంగా.

పెరిగిన గడ్డాన్ని ఓ మారు తడుముకొని- "ముందు ఓ కప్పు కాఫీ పట్రా!" అన్నాడు సుధాకరం నీరసంగా, కుర్చీలో కూలబడి. వంటింట్లోకి పోయి గబగబా కాఫీ తీసుకొచ్చి భర్తకు ఇచ్చింది తాయారు.

కాఫీ తాగి- "హమ్మయ్య!" అని నిట్టూర్చాడు సుధాకరం.

ఇప్పుడు చెప్పండి?" అంది తాయారు.

"ఆ పిల్లిని మన ఊరి చివరనున్న అడవిలో వదిలివద్దామని వెళ్లాను. తీరా అడవిలోకి వెళ్ళి దాన్ని వదిలిపెట్టాక దారి తప్పిపోయాను!"

"మరిప్పుడు ఎలా రాగలిగేరు?"

"అదిగో! దానివెంట వచ్చేను!" అన్నాడు సుధాకరం గుమ్మంవైపు చూపిస్తూ.

ఆ దంపతుల వంక విజయగర్వంగా చూస్తూ "మ్యావ్!" అంది పిల్లి.







శివాజి

# మినిష్టర్

రైలు వేగంగా పరుగెడుతోంది.

ఇంతలో టి.టి.యి. వచ్చాడు పెట్టెలోకి వరుసగా టిక్కెట్లను తనిఖీచేస్తూ సుబ్బారావు కూర్చొన్న దగ్గరకు వచ్చాడు టి.టి.యి.

"టిక్కెట్ ప్లీజ్ !" అని అడిగాడు టి.టి.యి సుబ్బారావు పక్కన కూర్చొని జోగుతున్న భారీ కాయాన్ని. ఆ కాయం ఓమారు ఉలిక్కిపడి లేచి కళ్ళు నులుముకొని "మినిష్టర్ని" అంది గుర్రుగా చూస్తూ.

"సారీ!" అని సెల్యూట్ కొట్టాడు టి.టి.యి. ఆతరువాత సుబ్బారావు తన టిక్కెట్ చూపించాడు.టి.టి యి. తనవిధి నిర్వహించుకొని వెళ్ళిపోయాడు. సుబ్బారావు మెదడులో ఏదో ఆలోచన తళుక్కుమంది. తిరుగు ప్రయాణంలో టిక్కెట్ కొనలేదు సుబ్బారావ్. టి.టి.యి. వచ్చాడు. టికెట్ చూపించమని. అతడివంకోసారి సీరియస్‌గాచూసి 'మినిష్టర్' అన్నాడు సుబ్బారావ్.

ఓ సెల్యూట్ పారేసి వెళ్ళిపోయాడు టి.టి.యి. చిరునవ్వు నవ్వుకొన్నాడు సుబ్బారావు.

తన గమ్యస్థానం రాగానే రైలుదిగాడు. సుబ్బారావు. స్టేషన్‌లోంచి బయటకుపోయే గేటు దగ్గర టిక్కెట్లు వసూలుచేసే వ్యక్తి సుబ్బారావుని ఆపి 'టిక్కెట్...?' అన్నాడు.

తడుముకోకుండా 'మినిష్టర్ని' అన్నాడు సుబ్బారావు. "ఏ మినిష్టర్...?" ఆశ్చర్యంగా అడిగాడు ఆ అధికారి. సుబ్బారావుకి ఏం చేయాలో పాలుపోలేదు. నిజానికి అతడికి ఒక్క మినిష్టర్ పేరు కూడా తెలీదు.

అయినా భయపడకుండా తనకు తెలిసిన ఒకే ఒక్క పేరు చెప్పేడు-

"ఇందిరాగాంధీ"

"మీగురించి వినడమేకానీఇంతవరకూ మిమ్మల్ని చూడలేదు. మిమ్మల్ని ఇలా కల్సుకోగలిగినందుకు చాలా సంతోషంగా వుంది'' అంటూ సెల్యూట్ కొట్టి గౌరవంగా సాగనంపాడు ఆ అధికారి.

—హరిబాబు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

# మామిడి పండ్లలోని మాధుర్యం ఇదే! ఇదే!!








సోమా మాంగో

సోమరస విహారం
ఎప్పుడైనా. ఎక్కడైనా.

గోవా, ఫ్రూట్ పంచ్
కూడా వున్నై.

ఎంతో రుచి...
ఎంతో రుచి...

ప్రియలోనే
వుంది.




అన్ని రకాలలోను అనంతమైన రుచులు
కలబోసి అందిస్తై ప్రియ పచ్చళ్ళు.
తలచుకొంటే చాలు తరగిపోని
రుచిరానుభూతికి- ప్రియ.
ఈనాడే మీ ప్రియను మీ ఇంటికి
తీసుకువెళ్ళండి.

ఎంతో రుచి... ఎంతో రుచి...- ప్రియ

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI MARKET
PRIVATE LIMITED